# విషయసూచిక.



---

ఆంధ్రభట సంఘమునకు ఈ గ్రంథమూల్యము ఒసఁగఁబడినది.

వలయువారు:—

డాక్టరు జోగయ్యశర్మ, ఆంధ్రభట కార్యదర్శి,

పవరుపేట, ఏలూరు.

అని వ్రాయవలెను.

---

ఘన సమవాకారమును, సుప్రసన్నయా
దవము, చిత్రరేఖీయ పద్మసంబు,
తిరుపతివేంకటేశ్వర భారతంబును,
పానుగంటి నృసింహు భవ్యకృతులు,
గద్యతిక్కన వరో కమనీయ భణితియు,
సూరి గంభీర వాగ్ధోరణియును,
గీ. రాజశేఖరయుక్త, విమలాభిరామచరిత.
ప్రణయమహిమంబు, వేంకటపార్వతీశ
రచన, రామలింగారెడ్డి వచనగరిమ
మొదలు నాధునిక గ్రంథములను బొగడి.
క. పద్యంబుల గద్యంబుల
హృద్యంబగురీతి లోకహితబోధనలన్
వేద్యం బొనరించిన గురు
విద్యాగ్రంథముల కేను వినుతు లొనరున్.

---

గ్రంథ ప్రశంస.

చ. మహిమదలిర్పఁగా భువనమండలి నంబరవీధి నేతలన్
మహిత జనంపులోకనియమంబుఁ ద్రిప్పుచు జీవకోటికిన్
విహిత మొసంగఁజేయు హరి వేముల్ఁ గూర్చెనుగాక తారకా
గ్రహయుత సౌమ్యయోగ విసరంబు జగంబులు మోద మందఁగన్.
ఉ. భూతలమాసవాలిబలముల్ గ్రహరాజ విరాజమాన వి
ఖ్యాతమహత్త్వసత్త్వముల సందనివౌట నధీనమౌట ఖ
ద్యోత కుజాదిమూర్తులను యుద్ధమునన్ మనుజాళి గెల్చుటల్
నీతియె? యందురేమొ! భువినేతలు దివ్యుల మున్ జయింపరే!
సీ. జన్మతారకనామ సకలలోకారాధ్య
లక్ష్మీశ్రమ సృష్టిమూలంబు కొంత,
సిద్ధాంత ఫల సుప్రసిద్ధభాగప్వయ
జ్యోతిర్విశేష సంస్తుతి యొకింత,
వర కాకతీయాంధ్ర వంశ రాజోత్తంస
మాన్య రుద్రాంబికా మహిమ కొంత,
సహజ ధైర్య ధురీణ సప్త సప్తతి గోత్ర
పద్మనాయక శౌర్యఫణితి కొంత,

తే. కలిసి, రసములు దొలఁకెను తలఁపు లొలయ,
వింత చిన్నెల వన్నెపూబంతిఁ బోలు
నాంధ్రి వీరలక్ష్మీజయం బఖిల సుజన
వినుత కౌతుక పాత్రతఁ దనరుఁ గాత.

~~~

సూ త్ర ధా ర స్తు తి.

గీ. తారలుఁ గ్రహముల వేషధారులుగను,
నంబరమునెల్ల నాట్యరంగంబు గాను
భవ్యతర జగన్నాటక ప్రౌఢి నెఱపు
సూత్రధారుండు దయ మమ్ముఁ జూచుఁగాక.



కత్తితో అభివాదనము సల్పు ఆంధ్రయోధుఁడు.
~~~

# కథాసందర్భము.



సృష్ట్యాదిని బ్రహ్మసభలో గ్రహపూరుషులు గ్రహబలము అధిక మనియు, ప్రజాపతులు వ్యక్తిస్వాతంత్ర్యమే బలవత్తర మనియు, జర్చసేయుదురు. భూలోకమున హిందూదేశమున నేకశిలానగరసామ్రాజ్యమునకు మహారాజ్ఞి యగు రుద్రమాదేవికాలమునఁ బై[illegible]న వాదపరీక్ష జరుగునట్లు అర్ధనారీశ్వరునిచే నిర్ణయింపఁబడెను. ప్రజాపతులలో నొక్కఁడగు వసిష్ఠుఁడు భాస్కరాచార్యుఁడనఁగను, కళయను ప్రజామాత యాతని కూఁతురగు లీలావతిగను, భూలోకమున నార్యావర్తమున జనించిరి. ఆ భాస్కరాచారి తన కొమార్తెతో దక్షిణాపథమునకు వచ్చి, యేకశిలానగరమున రుద్రమాదేవి సన్నిధి నాశ్రయించి, వ్యక్తిస్వాతంత్ర్యవాదియై జ్యోతిర్విద్యను సాధించుచుండెను. అతని ప్రయత్నము నోడఁగొట్టుటకై దేవగిరి రాజగు మహాదేవుని నోరుగంటినగరముపై దాడివెడలుటకు గ్రహపూరుషులు పురిగొల్పుదురు. అట్లు గ్రహబల సంయుతులై వచ్చిన దేవగిరిసైన్యములను ఓరుగంటి ప్రభువగు రుద్రమాదేవి స్వసామర్థ్యముచే నోడించి, వ్యక్తిస్వాతంత్ర్యమే బలవత్తర మను వాదమును నిరూపించును.

జ్యోతిశ్శాస్త్రవిశేషములను దృశ్యరూపమున వ్యక్తపఱచుట గ్రంథోద్దేశము.

పురుషప్రయత్నమునకు ప్రకృతిసత్త్వములు స్వాధీనము లని నిరూపించుట కథాపర్యవసాన ధర్మము.

మన పూర్వులగు నాంధ్రవీరుల సద్గుణకీర్తనమే గ్రంథకర్తకుఁ బ్రతిఫలము.

ఇందు చరిత్రాంశముల సంబంధముకొఱకు వీరభద్రరావుగారి ఆంధ్రులచరిత్రయొక్క ద్వితీయభాగమును, K. V. Subramanya Iyar's Historical Sketches of anicient Dekkan, Vol. I ను పరిశీలించునది.

# ప్రదర్శనముయొక్క కాలపరిమితి.

| | | | గం. ని. |
|---|---|---|---|
| 1 వ అంకము. | ... | ... | 0—45 |
| విశ్రాంతి. | ... | ... | 0—5 |
| 2 వ అంకము. | ... | ... | 0—45 |
| విశ్రాంతి. | ... | ... | 0—5 |
| 3 వ అంకము. | ... | ... | 1—10 |
| 1 వ రంగము. | ... | 0—16 | |
| విశ్రాంతి. | ... | 0—2 | |
| 2 వ రంగము. | ... | 0—30 | |
| విశ్రాంతి. | ... | 0—2 | |
| 8 వ రంగము. | ... | 0—20 | |
| | | 1—10 | |
| విశ్రాంతి. | ... | ... | 0—5 |
| 4 వ అంకము. | ... | ... | 1—19 |
| 1 వ రంగము. | ... | 0—15 | |
| విశ్రాంతి. | ... | 0—2 | |
| 2 వ రంగము. | ... | 0—45 | |
| విశ్రాంతి. | ... | 0—2 | |
| 8 వ రంగము. | ... | 0—15 | |
| | | 1—19 | |
| విశ్రాంతి. | ... | ... | 0—5 |
| 5 వ అంకము. | ... | ... | 1—26 |
| 1 వ రంగము. | ... | 0—16 | |
| విశ్రాంతి. | ... | 0—2 | |
| 2 వ రంగము. | ... | 0—16 | |
| విశ్రాంతి. | ... | 0—2 | |
| 8 వ రంగము. | ... | 0—50 | |
| | | 1—26 | |
| | | ప్రదర్శనమున కంతకు. | 5—45 |

ఈ నాటక మంతయు ప్రదర్శించుటకు అవకాశములేనప్పుడు 1వ, 2వ అంకములలోని కథను క్లుప్తముగా ప్రేక్షకులకుఁ దెల్పి, 3వ అంకమునుండియే దృశ్యములు ప్రారంభించునది.



శ్రీ

# జ్యోతిర్లీల.

## ప్రథమాంకము.

ప్రదేశము—సృష్టికిఁ బూర్వము మహార్ణవముగ నుండిన ఆకాశము.

ప్రవేశము—పద్మాసనమునఁ గూర్చుండి ధ్యానముఁ జేయు బ్రహ్మ, ఒక్కింత దవ్వుగ నంజలిబద్ధ యయి తద్భక్తిపరవశయై నమస్కరించియుండునట్టి సరస్వతి.

బ్రహ్మసరస్వతు లున్నచోట్లు వెలుఁగగను, కొదువప్రదేశ మంతయు చీఁకటిగను ఉండును.

సరస్వతి—ఆహా! సకలచరాచర హేతుభూత సృష్టికారకుం డగు శ్రీమన్నారాయణుని యపరిమిత మాహాత్మ్య మే నెంతయని కొనియాడఁగలను! అనంతం బును, అనుపమానం

బును, అగమ్యగోచరంబును, అనిర్వాచ్యంబును అగు నా యాదిమూర్తి కౌతుక్య-నిర్హేతుక యథేచ్ఛానుసరణ లీలాప్రమోద మేదుర వ్యాపార కారణాంకూరమే సదా మాయాగర్భాంధకార పరివ్యాప్త జడమయ ప్రకృతిబీజమును అశ్వత్థజనక పంచ భూతాత్మక బ్రహ్మాండాంతర్గత గోళోపరిస్థిత చిత్రతరరూప దీపిత జీవకోటిశాఖల యుతం బగు స్వర్గభూజంబుగా నింక వర్థిల్లఁజేయుచున్నది. ఏ మహామహుని యిచ్ఛామాత్ర కారణంబున వ్యక్తినొంది, నే నత్యంతధన్యుఁ డైతినో యా దేవాధిదేవుని సంస్తవం బొనర్చెదను.

త్రిభంగివృత్తము.

ప్రవిమలనిజరుచి నివహ నిభృత కల సువికసితాంఘ్రి సరోజ్,
కల్మషనాశున్, సర్వాత్మసకాశున్,
దివి పవన సలిల దన భువి వినిమయత విభజి తాదిమమూర్తిన్,
సన్నుతసత్కీర్తిన్, భూరిమహాత్మున్,
భువన రచన ఘన వివరణ విధగుణ భవగత పద్మజకారిన్,
ధర్మవిహారిన్, కల్మషహారిన్,
అవికల గురుతప జవయుత మునిగణ వివిధ వచోనుత చర్యున్,
దైవతవర్యున్, భక్తసహర్యున్.

ధ్వనివృత్తము.

శ్రీహరిదేవున్, శివకరు, కరుణా
సింధు, జగత్పతి, సరసిజనేత్రున్,
దేహధృతాంతి ర్వికలహృదయ సం
దేహ నివారణ పదయుగు, పద్మా
మోహనరూపున్, నతజనహృదయా
మోదకరున్, భవకలుషవిదూరున్,
"పాహి" యటంచున్ వినయ నత మతిన్
భావన సేయుచు వినుతి యొనర్తున్.

(ధ్యానస్థిత యగును.)

బ్రహ్మ—(కన్నులువిచ్చి, చూచి,) ఆహా! అనంతంబగు నీ నిరామయ మహావివర విధానతత్త్వం బెంతసేపటినుండి యూహించుచున్నను నాకు నిదమిత్థ మని బోధకము కాకున్నది. దరి యంచు లేక, క్రింది మీఁదులు పోల్పరాక, దిక్కులు తెలియక, భాగంబు లేర్పఱుపనీక, రూపెఱుంగనీక, యొక్కటేరీతి నవిచ్ఛిన్నంబును, దురవగాహనంబును నగు నీతెలియఁబడనిదాని నేమని చెప్పఁగలను! (యోచించి) ఏదియో యొక మహా

పదార్థం బిందు సువ్యక్తంబుగాక మఱుఁగుపడి యున్నట్లు అనుమానము కల్గుచున్నది. కాకున్న నీ పరివ్యాప్తాంతరాళము యొక్క ప్రయోజనం బేమి? ఏమియు నిశ్చయింప వీలులేక నిర్వ్యాపారంబగు మన్మనంబు సంశయాకులం బగుచున్నది. నే నొక్కండ నిందు చేయునదేమి? (ఒక్కింతసేపు కన్నులు మూసి, తెఱచి, అటు నిటుఁజూచి,) ఓహో! ఇంతకు మునుపటికంటె నిప్పుడిప్పుడి దుర్భేద్యమాయాపటలంబు ఒకింత తెఱపియై, నాకుఁ దెల్విఁ గలిగించుచున్నది. (మఱలఁ జూచి) అకటా! ఈ మహాంతరాళంబున నే నొక్కఁడను, నే నుండు నీ మహాకమలంబును దిక్కు నింకెవ్వరును గానరాకున్నారే! ఇదివఱ కేమియుఁ దెలియనప్పటికంటె నిప్పుడు కొంత తెలియుట, మఱింత సంశయాకులంబును, భయదంబును గానున్నది. (ఒకింత యోచించి) ఇందు నే నొక్కఁడనే యుంటినా? ఇంకెవ్వరైనఁ గూడ నున్నారా? క్రమక్రమంబుగ ప్రవర్ధమానంబులగు నీ ప్రబోధనోదయకాంతుల సాహాయ్యమునఁ బరీక్షించెదఁగాక! (అటు నిటుఁ జూచి, సరస్వతిని గాంచి,) ఓహో! నాయెదుట నేదియో యొక దివ్యవ్యక్తి కానవచ్చుచున్నదే! ఇద్దానిం గాంచుట కన్నుల కెంతయానందముగ నున్నది. తన తేజంబుచేఁ దాఁ దెలియఁబడు జ్యోతిఃప్రభ వోలె నీదివ్యతేజయుఁ దన నునికానంబునకుఁ దానె యాదర్శమగుచున్నది. ఈ రూపము కన్నుల కింతయానందముగనున్నదికదా! దీనిపల్కులు వినిన నవి యెంత శ్రోత్రపేయములుగా నుండఁగలవో! (సంతోషముతో సరస్వతివంకఁ జూచుచుండును)

సరస్వతి—(కన్నులువిచ్చి, చూచి, తనలో) నన్ను సృష్టించిన మహామహుఁడు "నీవు విద్యాధిదేవత వగు సరస్వతివి. బ్రహ్మకు భార్యవై సృష్టికార్యంబున నాతనికిఁ దోడ్పడుము" అని నా కనుజ్ఞ నిచ్చి, యంతర్ధానుఁడయ్యె. అప్పుడు నాకు వేదవిజ్ఞానము స్ఫురించెను. తోడనే యీ మహాకమలంబును, దీనిపైనున్న యీ పావనమూర్తియు నా కగపడిరి. ఇతఁడే సృష్టికర్త యగు బ్రహ్మ. ఈతని దర్శన భాగ్యంబుచే నేను ధన్యనైతిని. శ్రీహరి యాజ్ఞానుసారముగా నెట్లు వర్తింపవలెనో! (యోచించి) శ్రీహరి నుతియే సర్వార్థసిద్ధికి సాధకము. (ప్రకాశముగా)

చంద్రవర్మవృత్తము.

భర్గ పద్మభవ భావిత గుణాసం
వర్గలోల! యపవర్గ వితరణా
సర్గ పుష్టి లయ సాధనకర! స
న్మార్గచార నుత మానిత చరణా! (ధ్యానస్థితయగును.)

బ్రహ్మ—అరరే! ఏమి దీని కంఠమాధుర్యము! రూపము కన్నుల కెంత సమ్మోదదాయకముగ నున్నదో యంతకంటె నతిశయముగ నీమె గానమాధుర్యము నాకు శ్రోత్రపేయముగ నున్నది. శ్రుతివిహితంబులగు నీమె పల్కులు వినినతోడనే కఠినతరయగు

మ ద్వాస్థోగణియు మృదులత్వము నొందుచున్నది. ఈ దివ్యమూర్తియం దెంత ప్రభావము లేనిదే యీభంగి నాలో నింత మార్పుకల్గునా? రూపముఁ గాంచిన తోడనే విశ్వాసమును, వాక్యంబుల వినినతోడనే వాక్శుద్ధియు నాకుఁ గలుగఁ జేసిన గీనిగొలుక్క సంస్పర్శచే నింక నెంతటివిశేష మేర్పడఁగలదో! (తలయూచి) కాని సౌమ్య తేజోమయం బగు నిద్దాని నే స్పృశింపఁదగునా! (యోచించి) అనునయంబుగఁ గొంచెము సమీపించి చూచెద! (పద్మాసనమునుండి దిగును.)

సరస్వతి—(తనలో) ఈ మహామహుఁడు నన్ను గాంచి, యిచ్చటికి వచ్చుచున్నాఁడు. నా మనంబు లజ్జాకులం బగుచున్నది. (సిగ్గునఁ దలవంచుకొనును.)

బ్రహ్మ—(సరస్వతి సమీపమునకు వచ్చి) దాపునకు వచ్చినకొలంది నీమూర్తి తేజోవిలాస మెంత స్పష్టముగ, భాసురముగఁ గన్పట్టుచున్నది! దీని తనువెంత కోమలం బై యుండునో! కొంచెము స్పృశించి చూచెదఁగాక. (అంటఁబోవును.)

సరస్వతి—మహాత్మా! మన్నించి విడువఁదగును.

బ్రహ్మ—ఆహా! ఈమె వాక్య మెంత వినసొంపుగ నున్నది. ఈమె నాతో సంభాషించుటచే ధన్యాత్మకుండ నైతిని (సరస్వతితో) భద్రాకారా! మనోహరమగు నీ రూపమును కనులవిందుగాఁ జూచితి, మధురంబగు నీమృదులస్వరంబు వినుచు, నీచెంతనయు చుండుట నాకు సుఖకరంబుగ నున్నది సుమా! సుదతీ! నీ వగపడకముందు దరి యోచన లేని యీ మహాంధకార సమూహంబు నేమియుఁ దెలియక కలవరపడు చుంటిని. కాని నీవు కాన్పించినతోడనే ఘనానందభరితుండ నైతిని.

సరస్వతి—మహాత్మా! తాము సకల చరాచర సృష్టికార్యంబునకు సమర్థులు. సత్యలోక ప్రభువులు.

బ్రహ్మ—సకల చరాచరమా! సత్యలోకమా! సృష్టికార్యమా! అ వేమిటివో నే నెఱుంగను. కాని సౌందర్యవతీ! నీవు తప్ప నాకవేవియు నక్కఱలేదు.

సరస్వతి—(తనలో) ఆహా! సకల సృష్టికార్య భారవాహుఁడు కాఁదగు నీ మహాత్ముం డెంతగా మాయచేఁ గప్పఁబడి యున్నవాఁడు! ఈతని యజ్ఞానంబును బోఁదోలుట యెట్లు? (యోచించి ప్రకాశముగా) దేవా! ఇంతవఱకు తా మాసీనులై యుండిన యా మహా పద్మ నాళాంతరబలంబు నొకసారి పరీక్షింపఁదగును.

బ్రహ్మ—లావణ్యమయీ! దానిలోనేమున్నది?

సరస్వతి—దేవా! అనుచరి వాక్యంబు నాదరింపఁ దగును.

బ్రహ్మ—మంచిది. చూచెదగాక! (పోయి చూచి ఆశ్చర్యముతో) ఓహో! మహాశ్చర్యము! మహాశ్చర్యము! నే నింతవఱకు నిచ్చటనే యుండియు దీనిఁ గాంచనైతినే! సుతనూ! రమ్మీ. రమ్మీ. నీవుకూడ వచ్చి చూడుము.

సరస్వతి—(చిఱునగవుతో) మహాత్మా! తా మందుఁ గాంచున దేమి?

బ్రహ్మ—నే నిందుఁ గాంచునది యేమని చెప్పఁగలను! దీని లోపల నూహ కందరానంతటి మహాకాశంబును, అట్టి యాకాశమునం దచ్చటచ్చట మెఱయుచుఁ దిరుగుచున్న గోళంబులును గాన్పించుచున్నవి. వానిపైని వింతవింత రూపములు గల వ్యక్తు లున్నవి. వానిలోఁ గొన్ని మనలఁ బోలునవికూడ నున్నవి. ఇది యున్నట్లుండక క్షణక్షణమునకు మాఱుచు, నెప్పటికప్పుడు క్రొత్తదగు విచిత్రరూపములతో నతిశయిల్లుచున్నది. ఎంత యద్భుతము! ఎంత చిత్రము! ఇదంతయు నేమిటి?

సరస్వతి—అదియే చరాచరాత్మకం బగు లీలావిభూతి. తమ సృష్టిచే వ్యక్తతఁ గాంచవలసిన బ్రహ్మాండసర్గము.

బ్రహ్మ—ఇదంతయు దీని లోపల నుండుటకుఁ గారణ మేమి?

సరస్వతి—ఆ మహాపద్మము శ్రీమన్నారాయణుని నాభిప్రదేశమునం దుదయించినది. వెనుకటి మహాకల్పము ముగిసిన వెనుక శ్రీహరియందు లీనమైన సర్వప్రపంచమును ఆ పద్మనాళంబుగుండ తమకిప్పుడు కానిపించుచున్నది. శ్రీహరి సర్వాత్మకుండుకదా!

బ్రహ్మ—శ్రీహరి! అతఁ డెవరు? ఎక్కడ నున్నాఁడు?

సరస్వతి—(తనలో) అకటా! సర్వప్రపంచ సృష్టికర్త కాఁబోవునట్టి యీమహాత్ముండు శ్రీమన్నారాయణుఁడు కలఁడను జ్ఞానము లేక జడుఁడై యున్నాఁడు. ఎంతటివారలైనను శ్రీశుని కరుణకుఁ బాత్రులు కాకుండినచో నెందుకును గొఱగారు. ఈ మహనీయుని యీదుస్థితినుండి తొలఁగించుట కే నేమి చేయఁగలదాన! (యోచించును.)

బ్రహ్మ—లావణ్యమయీ! నా ప్రశ్నకు నుత్తర మీయవేమి? నే నడిగినదానిచే నీ కేమైన నప్రియమయ్యెనా?

సరస్వతి—దేవా! తమ సంశయములఁ దీర్ప నా కొక సులభోపాయము పొడకట్టుచున్నది. (అంజలిబద్ధ యగుచు) ఇట్లంజలిబద్ధనై దైవస్తుతి యొనర్చుచున్న నన్ను తమరు అనువర్తింపవలెను.

బ్రహ్మ—అట్లే! నీవు చెప్పినట్లు చేసెదను.

సరస్వతి—ఆజ్ఞాపింపఁబడి, ధన్యాతిధన్యులము కావలయును.

విష్ణువు—కాల మనాద్యంతము. ప్రకృతి నాశరహితంబు. పరతత్త్వం బవ్యయంబు.

బ్రహ్మ—అవహితుండను.

విష్ణువు—గతకల్పంబున సుప్తిం బొందింపఁబడిన ప్రకృతిని పునస్సృష్టివ్యక్తంబు గావింపవలయును.

బ్రహ్మ—విధేయుండను.

విష్ణువు—వత్సా! నీకు తోడునీడ యగు భార్యగ నుండ సరస్వతి నిర్మింపఁబడియె.

బ్రహ్మ—మఱియు ననుగ్రహింపఁబడితిని.

విష్ణువు—నియమితకార్యంబు నిర్వర్తింపుము.

బ్రహ్మ—తావక కృపాలేశంబు గలుగ నేకొఱంతయు రాదు.

బ్రహ్మ
సరస్వతి } — వనమయూరవృత్తము.

శ్రీరమణ! భూరమణ! చిన్మయవిహారా!
వారిరుహనేత్ర! మునివర్యనుతిపాత్రా!
చారుగుణహార! పదసారఖల గర్వో
దార పరితుష్ట నిజ దాస పరివారా!

(శ్రీహరి యంతర్ధానుండగును.)

బ్రహ్మ—ప్రేయసీ! శ్రీహరి కృపావిశేషం… …డనైతిని. మఱియు,

ఆ. శ్రీశు నాభి భాగ్య…
…సృష్టికర్తనై

దేవియా ధాంగ

సరస్వతి—విధేయురాలను. నాథా! తామీ కమలాసనంబుపై నధివసింపవలెను.

బ్రహ్మ—మంచిది. నీ పాణిపద్మంబు సహాయముగా నిట్లిమ్ము.

(అన్యోన్య కరగ్రహణము చేసి, పద్మాసనము పైకెక్కి, ఉభయులును కూర్చుందురు.)

నీ సహాయమునను, పరమేశ్వరుని దర్శనంబునను, నా యజ్ఞానంబు నశించినది. ఇంక సృష్టికార్యంబునకు నియుక్తుండ నగుదును.

సరస్వతి—నాథా! సృష్టి యనఁగ సుప్తంబగు ప్రకృతి చైతన్యముతో ప్రబోధము నొందుటేకదా?

బ్రహ్మ—అవును. పరమేశ్వరుని యాజ్ఞచే ప్రకృతికి నట్టి ప్రబోధము కొంతవరకుఁ గలిగినది. అనఁగా ప్రకృతి పంచభూతములుగాఁ గొంతవఱకు విడియున్నది.

సరస్వతి—ఈ భూతపంచకమును ఎట్లెఱుంగనగును?

బ్రహ్మ—చెప్పెదను.

సీ. మొదటి దాకాశ మయ్యది శబ్దము గుణంబు
గలది శ్రోత్రేంద్రియాకలనఁ దెలియు
అల స్పర్శేంద్రియసాధ్య మౌ స్పర్శగుణముతో
నుండెడి వాయువు రెండవయది
మూడవ దనలంబు గూడి తేజోగుణం
బునఁ జక్షురింద్రియమునఁ గనఁగ
రసగుణాత్మకమౌట రసనేంద్రియంబుచే
గ్రోలఁదగు సలిలంబు నాలుగవది
తే. యైదవది గంధగుణమున నలరుచుండి
ఘ్రాణశక్తి నాఘ్రాతచేఁ గలుగు పృథివి
పంచ భూతంబులును గుణ ప్రకరములును
సాధనేంద్రియములు నివే నళినాక్షి.

ఇట్లు మూలప్రకృతి ఆకాశము, వాయువు, తేజస్సు, జలము అను పంచభూతములుగా విభజింపఁబడి యున్నది. వానికి క్రమంబుగ పంచతన్మాత్రలంబను శబ్ద స్పర్శ రూప రస గంధంబు లయిదును గుణంబులై శ్రోత్ర త్వక్ చక్షు ర్జిహ్వా ఘ్రాణంబు లను జ్ఞానేంద్రియ పంచకంబుచే నెఱుంగఁదగిన వై యుండు. ఆ జ్ఞానేంద్రియంబులకుఁ దోడుగా వాక్పాణి పాద పాయూపస్థలను కర్మేంద్రియంబులును నిర్మింపఁబడియె. వీని నన్నిటి నెఱింగి కర్మ ఫలానుగుణంబుగ నడపింప మనసు మనోబుద్ధ్యహంకార రూప భేదంబున సాత్త్విక రాజస తామస గుణంబులతోడ నలరుచుండును.

సరస్వతి—నాథా! అనంతరసృష్టి యేది?

బ్రహ్మ—అది మనచే నిక్కపుఁ గావింపఁబడ వలసియున్నది. ముందుగ నీ యంధకారముఁ బాపుటకై సూర్యుండు సృజింపఁబడవలెను.

సరస్వతి—మీ ప్రయత్నము విజయప్రద మగుగాక.

బ్రహ్మ—(ధ్యానించుచు,)

సీ. మహిత తేజోమూర్తి మానవాంశ ధరుండు
గ్రహరాజు సంపూర్ణ ఘన బలుండు
నిఖిల జీవతతికి నిర్మాణ కరుండు
చతురస్ర పీఠికా స్వర్ణ గేహి
పితృ రాజ్య హయ యజ్ఞ భూమి సింహాసన
ఛత్ర తా మూర్తిసన్నేత్రకారి
బ్రాహ్మణకులపతి ప్రైత్యాత్త్వ తనుండు
కల్యసత్త్వాధిక క్షత్రియుండు

తే. సర్వగోళ ప్రచారణ జవ దాత
సకలలోక ప్రభాకాంతి సాకరుండు
సన్మనిగ్రహుండు సూర్యుండు పరమపూజ్యుఁ
డునయ మగుఁగాక లోకములు ముదముఁ జెంద.

సరస్వతి—తథాస్తు.

(సూర్యుఁడు ప్రవేశించును.)

సూర్యుఁడు—పూజ్యులైన బ్రాహ్మదంపతులకు నమస్కరించుచున్నాఁడను.

బ్రహ్మ—సర్వాంధకారనివారణపటుఁడగు సూర్యునకు విజయ మగుఁగాక.

సూర్యుఁడు—అనుగ్రహింపఁబడితిని. మన్నియమిత కార్యభారం బుపదేశింపఁబడునుగాక!

బ్రహ్మ—త్రినిష్ఠ నాసతిచే జగముల సృజించుచున్న బ్రహ్మనగు నేను లోకములకు వెలుఁగు నిచ్చుటకై నిన్ను సృజించితిని.

సూర్యుఁడు—విధేయుఁడను.

బ్రహ్మ—తేజోమయంబగు నీ మండలము చుట్టును పరిభ్రమణ మొనర్చునట్టి కొన్ని గ్రహగోళంబు లేర్పడఁగలవు. వానిపైని వివిధములగు జీవకోట్లు నింపఁబడును. ఈ

యన్నింటికిని కాలక్రమంబుగ తేజస్సును, జీవనమును, కలుషహారములగు నీకిరణముల చేత నొసగూర్చుచుందుము.

సూర్యుడు—ధాతా! ఈ ప్రపంచమున కంతకు నామండలమే మధ్యమస్థానమా?

బ్రహ్మ—ప్రపంచమున కంతకును కాదు. నిన్ననుసరించి తిరుగు గోళప్రపంచములకు నీ మండలమే మధ్యమస్థానము. గ్రహగోళములు నీచుట్టు నెట్లు తిరుగుచున్నవో యటులే వానిని వెంటఁబెట్టుకొని నీవు ప్రద్యుమ్న మండలము చుట్టును, మీయందఱను గూడఁ బట్టుకొని యా ప్రద్యుమ్నుఁడు నిరుద్ధ మండలము చుట్టును ప్రదక్షిణము సలుపుచుందురు. ఇట్టి పరంపరకు తుది మొదలు లేదు. సర్వమును శ్రీమన్నారాయణుని యనీకమైయున్నది. ఇఁక నీ కనుచరులుగ నుండు గ్రహ గోళాధికార పురుషుల నిదే సృజయించెదను.

సీ. మాతృ గో కృషి సితమణి వృష జల కారి
రాజ వైశ్యుండు చంద్రగ్రహంబు
(చంద్రుఁడు ప్రవేశించును)
భాతృ ర ణాగుణ పర్వత విష కారి
సైన్యనాథుండు కుజగ్రహంబు
(కుజుఁడు ప్రవేశించును)
గణిత వాణిజ్య శంకా యుక్తి ధనకారి
తరుణ శాంతుండు బుధగ్రహంబు
(బుధుఁడు ప్రవేశించును)
బ్రహ్మవిద్యా ధర్మ భక్తి సంతాన సౌ
భాగ్యాధికారి జీవగ్రహంబు
(గురువు ప్రవేశించును.)
వనితా కళా భోగ వర్ష పుష్ప సుగంధ
గానాధికారి శుక్రగ్రహంబు
(శుక్రుఁడు ప్రవేశించును)
హీనసేవాదోష పాపవ్యసన రోగ
నిధి మృత్యుకారి శనిగ్రహంబు
(శని ప్రవేశించును)
తే. మారి దేశాట నోత్పాత కారి రాహు
(రాహువు ప్రవేశించును.)
వఖిల వైరాగ్య మోక్ష దాయకుఁడు కేతు

ప్రపంచవ్యక్తి సాహాయ్యపడుచుండును. ఇఁక నీ సూక్ష్మప్రపంచవ్యక్తి ధర్మార్థ కామ మోక్షము లను కర్మానుగుణముగా ననుభవించుటకు స్థూలదేహమే సాధన మగును. ఇదియే యీ రెండువిధము లగు సృష్టిప్రక్రమంబులకు ను గల సామరస్యము; కావున నిప్పుడు జీవలోకజనకులుగా నుండఁదగు మహాపురుషుల సృజించెదను. (ధ్యానించి)

తే. అకలుషాత్ములు, హరిభక్తు, లమల చరిత్రు,
లఖిల వేదార్థవిజ్ఞాను, లఖిలలోక
సంచరణ దక్షులును, తపస్సత్వ బలులు,
ఘనులు సనకాదు లుదయంబు గాంత్రు గాక!

సరస్వతి—తథాస్తు!

(ప్రవేశము:—సనక, సనత్కుమార, సనత్సుజాతాది బ్రహ్మమానసపుత్రులు.)

సనకాదులు— సమానీవృత్తము.

సార హీన జన్మ రుజా
దూర హారి శాంతి గనన్
శ్రీ రమేశు నెంచి మనో
వైరి రాజిఁ గెల్వ వలెన్.

(అనుచుఁ బ్రవేశించి) వాణీహిరణ్యగర్భులకు నమస్కారము.

బ్రహ్మ—సనక సనందనాది మన్మానసపుత్రులారా! శ్రీహరి యానతివొసఁగిన ప్రజాసృష్టికిఁ బూనుకొన్న నేను మిమ్ములను ప్రజాభివృద్ధి యొనర్చుటకు సృజించినాఁడను.

సనకాదులు—ఓ వాణీనాథా! తండ్రీ! మన్నించి యీ మహాకార్యభారమునుండి మమ్ముఁ దొలఁగింప వేఁడెదము.

ఉ. శ్రీహరినామ సంస్మరణ సేయుచు, లోకములెల్ల పావనం
బౌ హితరీతి, సత్తపమునందుఁ జరింతుముకాక యిట్టి దు
ర్మోహకరంబుఁ బాపమయమున్ గనుభీకరమైన సంసృతి
వ్యూహమునందుఁ బోరఁ జన నోపుదు మెంతయు నబ్జసంభవా!

సరస్వతి—నాథా! తమ వచనానుసారముగ నుద్భవించిన మానసపుత్రు లగు నీ సనక సనందన సనత్కుమార సనత్సుజాతులు నల్వురును కేవల సత్వమూర్తులు. వారికి సంసృతిపైఁ గోర్కె యుండదు.

బ్రహ్మ—(ధ్యానించి) అట్లయినచో కేవల రాజసమూర్తుల సృజించెదను.

తే. పూర్వ చరితులు, హరిభక్తి నీతి పరులు,
రాజసాత్త్వికులు, కామినీ రాగ మతులు,
వీర్య బలులు, ప్రజాపతుల్, శౌర్య ధనులు,
వారి సతులును జన్మంబు వడయ వలయు.

(ప్రవేశము:—మరీచి, అత్రి, అంగిరసాది ప్రజాపతులు; వారి సతులగు, కళ, అనసూయ, స్మృతిలోనగువారు)

మరీచ్యాదులు—వాణీహిరణ్యగర్భులకు నమస్కరించుచున్నాము.

బ్రహ్మ—అందఱాసీనుల రగుఁడు. (ప్రజాపతులు ఆసీను లగుదురు.)

ప్రజాపతులు—వాణీశా! మమ్ము సృష్టించిన కారణము సెలవీయుఁడు.

బ్రహ్మ—ప్రజాపతులారా!

శా. మీరా? ప్రాజ్ఞులు వీర్యసద్బలయుతుల్, మీచెంత నుత్కృష్ట యీ
నారీరత్నములా? పరిగ్రహణ మాన్యాకార యోగ్యానుసం
ధానంబుల్ గలవారు; మీకు వలయున్ సమ్యక్ ప్రజాసంతతుల్,
కానే సాయము బ్రహ్మసృష్టికి; రమాకాంతుండు మిమ్మేలెడిన్.

మరీచి—వాణీశా! తావక వచన విధేయులమై వర్తింపఁదగిన మమ్మింతగఁ గోరవలయునా! కాని యనుకూలదాంపత్యంబున కనుమతి యిరుతెఱఁగులనుండి రావలయునుగదా?

సరస్వతి—ప్రజానాయకులారా! నిరాకరికదా.

కళాదులు—సిగ్గునఁ దలవంచుకొని, అమ్మా! సరస్వతీ! నీవే యూరటీయఁదగును.

సరస్వతి—(అనవాదించి బ్రహ్మతో) నాథా! లజ్జాస్వభావము గల యబల లంతకంటె విపులముగ నెట్లు సమ్మతిఁ దెలుపఁగలరు?

బ్రహ్మ—అస్మత్కార్యం సిద్ధం నే నెఱిఁగితిప్పట్లే. పరమసంతోషము. పరమాహ్లాదము. ఇఁక కోట్ల కొలఁదికిఁ బ్రజాసృష్టికిఁ గొదవ యుండదు. ఇఁక కాలచక్ర విభాగానుసరణిగ సృష్టి జయప్రదముగఁ గొనసాగఁగలదు.

సూర్యుఁడు—వాణీశా! కాలవిభాగంబునుఁ గూర్చి తాముముందుగ నొక్కింత వివరింపవలెను.

అందఱు—మే మందఱమును నదియే వినఁగోరుచున్నాము.

బ్రహ్మ—(ధ్యానించి) పరమాత్మ కాలశరీరి యని చెప్పఁబడును. కావున కాలంబు పరమాత్మవలె నాద్యంతరహితం బని యెఱుంగనగు. ఐనను లోకవ్యవహారార్థమై మనమన చేష్టావకాశంబులం బట్టి దాని విభజింపవలయు.

ఆ. కన్ను మూసి తెఱచు కాలంబు క్షణమాను;
కల్ప మగును సృష్టి కలిగి యణఁగ;
కాల మాః మందుఁ గల కొలందియు గొప్ప
లివియ; నసుమ నెన్నొ యేండ్లు కడచు.

నా నుడివిః ప్రకారము నిమేషాది మహాకల్పాంతకాలంబును ఆయాప్రజ లాయాప్రదే శానుగుణంబుగ ః నేకరీతుల విభజించి, నానిక భిన్నభిన్న నామంబు లుంపఁగలరు. అది యెట్లున్నను, దానిముఖ్యవిభాగం బిట్లుండఁగలదు.

సీ. గిఁచుట్టు నొకసారి తిరిగు నేగోళ మం
దుందు నాఁడ కది యొక్క దినము
తన కక్ష్యపై సూర్యు ధరణిచుట్టఁగ నొక్క
వత్సరం; బదియె దేవతల దినము;
నలునదిమూడు లక్షలు; వేలు నిర్వది
యల వత్సరములు మహాయుగంబు
ఇవి వేయి నిండఁగా నగు పదునాల్గు మ
న్వంతరములు; నాకు నదియె పగలు;

తే. సంతదగు రాత్రి నాకు; బ్రహ్మాండసృష్టి
నాదు రాత్రుల నిలుచు; దినముల నడచు;
నట్టి దినరాత్రివర్షంబు లరుగ నూఱు
నాకు పరమాయు వగును సుశ్లోకులార!

నా పరమాయుః ప్రమాణకాలంబే మహాకల్పం బనఁబడు. ఇట్టి మహాకల్పము లనంతములు. మహాకల్పకాలాయుః ప్రమాణుఁడ నగు నావంటి బ్రహ్మ లనేకులు శ్రీ పర మేశ్వరుని లీలా వినోద సర్గకార్యంబుకొఱకు ఇదివఱకుఁ గల్పింపఁబడిరి. ఇంకను గల్పింపఁబడఁ గలరు. మఱియు ప్రతి కల్పంబునందును.

తే. సాధువులఁ బెంపఖలులను సంహరింప
ధర్మసంస్థాప్య మొనరింప ధర భరింప
ఘనదయామతి యుగయుగంబునను బుట్టు
దేవతా నత పాదుండు శ్రీవిభుండు.

**అందఱు——అద్భుత మద్భుతము. కాలవిభాగమూలమును గూర్చి వాణీనాథుని వాక్యములు విని ధన్యులమైతిమి.**

బ్రహ్మ—శ్రీశు నానతిని మీ కెఱింగించుటచే నేను మత్కార్యంబు నెఱవేర్చినవాఁడ నైతిని. ఇంక మీ రందఱు చని మీ మీ కార్యంబుల నెఱవేర్పుఁడు. కొనసాగెడి కాలచక్రంబు తృటిమైనను నిలువదు. ఇక్కడ నొక్క క్షణ మైన నితరలోకంబుల యుగశతములు కడచుచుండును. నే నింక వివిధ ప్రపంచ సృష్టికార్యంబునకుఁ గడఁగవలయు. భానూ! నీ వేగి, గ్రహముల నియత మార్గ వర్తులఁగా నొనరించి, తద్బల సాహాయ్యంబున లోకవాసుల నెల్లర సంరక్షింపుచుండుము.

మరీచి—వాణీశా! ఒక విజ్ఞప్తి. గ్రహములకును నీ యాదేశంబున జనింపనున్న ప్రజాకోటికిని గల యన్యోన్యసంబంధము ను గూర్చి యొక్కింతయైనఁ దెలియ వలదా?

సూర్యుఁడు—ఇందుఁ దెలియుట కేమికలదు. ప్రజలు గ్రహబలాధీనచర్యగలిగి వర్తింపవలసినవారే కదా!

మరీచి—అది కొంతవఱకు సత్యమే. కాని పురుషప్రయత్నము వ్యర్థమే యనఁదగునా?

సూర్యుఁడు—వ్యర్థముకాక మఱేమియగును? పురుషప్రయత్నమను నది కేవలము భ్రమము. సర్వమును కాలనియామకుల మగు గ్రహచారాధీనమై యున్నది.

మరీచి—ఆ సిద్ధాంతమునకు మాత్రము మా చిత్తంబు లంగీకరించుట లేదు. ఏలయన పురుషప్రయత్నమున కనకాశమేలేక ప్రజాజీవితముయొక్క దినచర్యయంతయుఁ గేవలము గ్రహచర్యాధీనంబే యగునో ప్రజలకుయుక్తాయుక్త విచార జ్ఞాన సమర్థంబగు జ్ఞానేంద్రియపంచకం బేల ప్రసాదింపఁబడవలయు? దీనికి వినియోగం బెచ్చట? ధర్మశాస్త్రంబుల ప్రయోజనం బేమి? కావునఁ బ్రకృతియందుఁ బురుషప్రయత్నావకాశంబును గల దని విశ్వసింపక తీరదు. ఈ యుభయశక్తుల సమన్వయంబును, బలాబలంబులును తీర్మానింపఁబడవలసియున్నది. ఓ వాణీశా! ఇది యిప్పుడు విచారణీయాంశ మగుచున్నది.

బ్రహ్మ—భవ్యులారా! ఈమహావిషయమును గూర్చి యిప్పుడు తర్కించు టెందులకు? కాలక్రమంబుననదియే నిర్ణీతము కాఁగలదు. మీర లేగి మీ మీ పనులను జూచుకొనుఁడు.

మరీచి—వాణీశా! మేము జీవలోక జనకులము.........

సూర్యుఁడు—మేము జీవకోటి చారిత్ర నియామకులము.

మరీచి—ఇట్టి యిరుతెఱఁగులవారమును బరస్పరసానుభూతితో వర్తించినచో బ్రపంచ ధర్మమును గొనసాగింపగలుగుదుము కాని, యిట్టిమహద్విషయంబులఁ గూర్చి భేదాభిప్రాయులమై యుంటిమేని యెట్లుకొనసాగింపఁ గలుగుదుము.

బ్రహ్మ—(మనసులో), నా వచనము నాలింపరుగా! ఈ మహాసమస్యార్థ మిప్పుడేల తర్కించెదరు.

సూర్యుఁడు—సమస్యార్థమున మహత్వ ముండుటచేతనే తమను కోరవలసివచ్చెను. స్వల్పాంశములగునెడ మాలో మేమే తీర్మానించుకొనఁగలుగుదుము గదా.

బ్రహ్మ—(కోపములో) వాగ్వాదములో సృష్టికార్య నిర్వహణమునకు అంతరాయముఁ గలిగింతురా? శాంతమూర్తులై యీ సనకాదులును, రాజస స్వభావులై ప్రజాపతులును, వాగ్వాదపరులై గ్రహపూరుషులును, నాకు సహాయులగునట్లులేదు. కేవల తామసునే సృజించి మీ సంశయముల నన్నిటిని తీర్తును.

(ధ్యానించి)

కం. బలవంతుఁడు సక్రోధుఁడు
విలయకరుం డిష్టరూప విభజిత తనువున్

సరస్వతి—నాథా! శాంతింపవలయును. శాంతింపవలయును. తాము తలంచు మూర్తి లోకంబులనిన్నంటిని నశింపఁజేయు మహాతామసిగా వ్యక్తిగాంచుచున్నాఁడు.

(తెరలో రౌద్రధ్వనులు వినఁబడును.)

(అందఱును భయమున నిల్తురు.)

బ్రహ్మ—ఓహో! ఈ మహాతామసమూర్తి యుద్భవించి నన్నే మ్రింగుటకు వచ్చుచున్నట్లున్నది. ఆలసింపఁ జనదు. ఈ మహాభీకరమూర్తియొక్క పౌరుషమునం దించుక స్త్రీత్వమును జేర్చుట సమంజసము. (అనుకంపములో)

లలితాంగి, దుర్గ, శాంభవి,
యలఘు కృపాహృదయ జనన మందఁగవలయున్.

(అర్ధనారీశ్వరుఁడగు శివుఁడు రౌద్రాకారముతోఁ బ్రత్యక్షమగును.)

అర్ధనారీశ్వరుఁడు—ఆః! ఆః! పద్మోద్భవా! భ్రమ పరాధీనమనస్కా! నన్ను సగ మాఁడది యగునట్లు సృజించి, రాఁగల వీరలోకంబుచే నవ్వించెదవా! ఇట్టివాఁడవీ సర్గకార్యం బెట్లు నిర్వహింపనేర్తువు. చూపుము, నాచే సంహరింపఁబడఁదగిన లోకములేవియో! లెమ్ము! త్వరగ! అట్లుచూపవేని నిన్నే నాకోపమున కాహుతిఁగాఁజేసికొందును.



సరస్వతి—(అర్ధనారీశ్వరునకు నమస్కరించుచు.)

సీ. హైమవతీనాథ! యసురవిదారక! శూలి!
పన్నగభూషణ! భక్తవరద!
వృషభరాడ్వాహన! విశ్వమం దేవేఁ
బాపవిషవ్యాప్తి ప్రబలి, ఖలులు
పురవార మాక్రమింతురు క్రొవ్వి, యవ్వేళఁ
గల్మషవిలయాధికారి యగుచుఁ
గ్రాలు నీ మూఁడవకన్ను మంటలు రేఁగఁ
దగుఁగాని నీ మిత్రతతులమైన

తే. మము విరోధింపఁగా నేల? మానితాత్మ!
నిజపతీ సమ్మదాశ్లేష నిరత సౌఖ్య

భాగ్య మిచ్చితఁ గోపమే బ్రహ్మపైని
నెయ్యముం గూర్మి తిగునుగదయ్య యీశ!

అర్ధనారీశ్వరుఁడు—(పార్వతీభాగము తెలియకుండునట్లు వేషము మార్చి) పావనీ! సరస్వతీ! మృదువులగు నీ సౌమ్యవాక్యములకు సంతసించి శాంతుండనైతిని. పద్మోద్భవా! కార్యకారణసంబంధము అమోఘమైనది. సృష్టికర్తవగు నీవు విభ్రమంబున నన్ను అర్ధనారీశ్వరునిగాఁ జేసిన కారణంబున, నింక నీచే సృజింపఁబడు ప్రతివ్యక్తి యందును, అర్ధనారీశ్వర ప్రకృతి లీనంబై, ప్రచ్ఛన్నంబై యుండఁగలదు. మరియు వాణీశా! మదీయసృష్టికిఁ గారణమైన నీయకాలకోపంబునకుఁ గారణమే నెఱుంగుదును.

గ్రహపూరుషులు—(తమలో) నీతఁడు మాపైఁ గోపించునా యేమి?

బ్రహ్మ—దేవా! ఆ కారణ మెఱుంగుదుమేని దానికిఁగూడఁ గారణంబగు నీప్రజాపతుల యొక్కయు, గ్రహపూరుషులయొక్కయు, సంశయ విచ్ఛేద మొనర్తుము.

ప్రజాపతులు—(తమలో) ఈతఁడు మమ్మే విచ్ఛేద మొనర్చునేమో!

అర్ధనారీశ్వరుఁడు—(చిఱునగవుతో) సర్వవిచ్ఛేదనము కయినను సంశయవిచ్ఛేదము సులభము కాదు. మఱియు సంశయనివారణకు స్వానుభవమే ప్రబలమగు సాధనము. తరువాత గాని పరులు చెప్పు సమాధానములు సమంజసముగాఁ దోఁచవు. కావున గ్రహపూరుషులారా! ప్రజాపతులారా! మీరు ఉభయులును దీనిఁగూర్చి యొకపన్నిదముఁ జరుపుకొని, లక్ష్యలక్షణవిధానమున మీవివాదాంశమును దీర్మానించుకొనుఁడు.

గ్రహపూరుషులు, ప్రజాపతులు—దేవా! తద్విధానమును గూడఁ దామే యూఁతీయవలెను.

అర్ధనారీశ్వరుఁడు—భవ్యులారా! అట్లేని వినుండు. ప్రజాపతులగు మీరు కొందఱు భూమిపై మానవజన్మంబుల నవతరించి, కేవలమానుష శక్తి నేదేని మర్త్యుల సత్కార్యసాధనకై వినియోగించి వ్యక్తిస్వాతంత్ర్యమే బలవత్తరమను మీ వాదమును జయప్రదము గావించు కొనుటకై ప్రయత్నింపుఁడు.

ప్రజాపతులు—విధేయులము.

అర్ధనారీశ్వరుఁడు—గ్రహపూరుషులారా! మీరు గ్రహబలాధిక్యవాదులు. కావున వేఱుగా జన్మంబు లెత్తనావశ్యకము లేదు. ఆకాశమున సంచరించుచు నీ ప్రజాపతు లేకార్యమునకు అధికోత్సాహముతో బూనుకొందురో దానిని మీ గ్రహచార బలంబుచేతఁ బ్రతిఘటించి, మీగ్రహబలాధిక్యవాదమును స్థిరపఱుచుటకై ప్రయత్నింపుఁడు.

గ్రహపూరుషులు—వినతులము.

సరస్వతి—గౌరీశా! సంశయవిచ్ఛేదమార్గములలో స్వానుభవవిధానమును గూర్చి సెల విచ్చితిరి. ఇఁక సమాధానప్రక్రియను గుఱించి కూడ నొకింతయానతీయ వేఁడు చున్నదానను.

అర్ధనారీశ్వరుఁడు—పూజ్యతమా! నిన్నుఁ బోలు పావనియగు నొక స్త్రీవ్యక్తియే, యీ ప్రక్రియను నిర్వచింపఁగలదేమో! భావికాల మెట్లుండునో నేనుమాత్రము నిర్ణయింపఁ గలనా! అయినను ముందుగ స్వానుభవసంబంధ మగు ప్రయత్నమును వీరలు కొన సాగించిరేని తరువాత సమాధానవిధానమును, సంసిద్ధి కాఁగలదు. గ్రహపూరుషులారా! ప్రజాపతులారా! ఈ పద్ధతి మీకు సహింపదేని సర్వసంశయనివారక మగు (తీనశూలాయుధమును జూపి) వే ఱొక మార్గమును మీకుఁ జూపి తీరుదును.

గ్రహపూరుషులు } —మహాత్మా! తమ వచనానుసరణిగ నన్యోన్య ప్రతిఘటనకై
ప్రజాపతులు } ప్రయత్నింతుము.

బ్రహ్మ—లెస్సగాఁ బలికితిరి. ఈ ప్రయత్నముయొక్క పర్యవసానముగా నొక యుత్కృష్ట ధర్మము సాధింపఁబడనున్నది. కావున నీ కథ వినోదజనకముగను, లోకోపయోగ కరముగను వర్ధిల్లుఁగాక.

అర్ధనారీశ్వరుఁడు—మఱియు దీని పర్యవసానము అన్యోన్య ద్వేషజనకముగా నుండక జ్యోతి ర్విశేషములను దెలుపునట్టి లీలగా పరిణమించునుగాక.

సరస్వతి—కావున నీలీల జ్యోతిర్లీలగాఁ బెంపొందుఁగాక.

గేయము.

పన్నగభూషణ! భక్తజనావన! పాపవిశోషణ! గిరినిలయా!
నిన్నుఁదలంప లభించు శుభావహ నిర్ణయముల్ శివ! భవతరణా!
సన్నుతచారిణి! సాధ్వసకారిణి! శక్తి! మహేశ్వరి! గిరితనయా!
మన్ననసేయు ముమా! సతి! శాంభవి! మత్తఖిలాసురవగవిలయా!

(అని సరస్వతి వినుతించుచుండఁగా తెర దిగును.)

ప్రథమాంకము సమాప్తము.



# జ్యోతిర్లీల.

## ద్వితీయాంకము.

ప్రదేశము:—భచక్రము.

[ప్రవేశము:—తారలు. మేషాదిరాసుల క్రమంబున అశ్విన్యాది నక్షత్రపాత్రలు తమ తమ రాశినామములఁ దెల్పు నర్ధచంద్రపతాకలను బట్టి, చుట్టు నాట్యముసేయుచుండగా తెర యెత్తఁబడును.]

తారలు:— కళ్ళరగడ.

శ్రీ రమేశు కాలపురుషు చిద్విలాస గేహమైన
భూరి శింశుమారచక్ర పూత శీర్ష రత్నమైన
పుణ్యమూర్తి ధ్రువకీర్తి బుధనుత ప్రభావుఁడైన
గణ్యమాన మా మాన గమన సుమన సాధ్యుఁడైన
ధ్రువుని సప్తదేవమునుల, తోడి సురల నెల్ల వేడి
రవి శశి గురు లాదిగ గ్రహ రాజ రాజి నెల్లఁ గూడి
కడఁగి మేష వృషభ మిథున కటక సింహ కన్యక లన
మడగు తులయు కీట చాప మకర కుంభ మీనము లన
పదియు రెండు రాసులందు భానుఁ బుట్టి యంబరమున
"తధిమిత" యని యిర్వ దేడు తార లాడు సంతసమున.

(నాట్యము చాలించి)

అశ్విని—తారామణులారా! ఈనాఁడీ మేషరాశియందు కొండొక కార్యార్థమై గ్రహపూరుషు లందఱును సమకూడ నున్నారని కదా మన మందఱమును మనమన నక్షత్ర మండలంబులనుండి, యంశమూర్తులఁ దాల్చి, యిందుఁ జేరితిమి. భరణీ! వారి యాగమనమునకై సర్వంబు సంసిద్ధముగ నున్నదా?

భరణి—ఉన్నది.

కృత్తిక—ఇదిగో కేతువు నిదేవచ్చుచున్నాడు.

[ప్రవేశము: వెనుకకు నడచుచు కేతువు.]

రోహిణి—పలువురును నవ్వునట్లు వెనుకకు నడచెద వేమి?

కేతువు—సృష్ట్యాదినుండి యెన్ని యుగములింతకుఁ గడచినవో అప్పటినుండియు నభోవీథిపై రాహువును, నేను, వెనుకకు నడచుట కలవాటు పడితిమికదా. ఇపుడు క్రొత్తనడక యెట్లువచ్చును? కాని యిది మేషరాశియేనా?

అశ్విని—ఏరాశియో నక్షత్రములఁ జూచి గుర్తింపలేవా?

కేతువు—నక్షత్రము లాయాచోట్లఁ గదలక యుండునప్పుడే రాశివిభాగము చేయఁజాలక నేను కలవరపడుచు దారితప్పకుండుటకై మా యన్నయగు రాహువునకు సూటిగ చుక్కయెదురుగ నడచుచుందును. ఇఁక మీ రింత టిక్కడ గుమిగూడి కలసిమెలసి గంతులువేయుచు నాట్యము త్రొక్కుచుండఁగా నేరాశి యెక్కడనో గుర్తుపట్టుట బ్రహ్మకైనఁ దరమనుకొంటిరా!

భరణి—రాశిశీలములఁ బట్టియైన గుర్తించి జ్ఞప్తికిఁ దెచ్చుకొనలేవా?

కేతువు—ఏమో. నాటకమునకుఁ బూటకపు టట్టతల తగిలించుకొని వచ్చితిని గాని తలలేని నాకు చదువుట కోపికయు, మెదడుండ కంటియుండఁదగిన జ్ఞాపకశక్తియుఁ గూడ నున్నవనుకొంటిరా? అనగాక సతతము వైరాగ్యచింతయు, మోక్షాపేక్షయుఁ గల నాకు ఐహికవిషయములందు బుద్ధి నిలుచుటయెట్లు? (తల గోఁకుకొని) పోనీ. ముందుగ ఈరాశిని గూర్చి చెప్పుఁడు. ఇంకపై మఱవక జ్ఞప్తియందుంచుకొనెద.

అశ్విని—అట్లే చెప్పెదను. ఇదిగో. మొదట నశ్వినినగు నేనును, భరణియుఁ, గృత్తికా పాదంబునుం గలిసి మేషరాశియగుదుము. తరువాత కృత్తిక మూఁడుపాదంబులును...

కేతువు—ఆఁగు మాగుఁడు. నా కొక్క సందేహము కలిగినది. ఒకటిన్ని మూఁడున్నా ఏడా, ఎనిమిదా?

కృత్తిక—ఇదేగణితము? ఏడును గాదు. ఎనిమిదియుఁ గాదు. నాలుగు.

కేతువు—(వ్రేళ్లతో లెక్కించి) సరియే. ఒప్పెదను. పోనీ? కృత్తికా! ఆప్రకారమైన మేషంబున నొక్కపాదంబును వృషభంబున మూఁడు పాదంబులును గల నీకు నాలుగు కాళ్లుండి తీరవలెనే? కడమ రెం డెక్కడ దాఁచియుంచితివి?

కృత్తిక—ఉత్తమాంగ మగు తలయే లేని నీవు హస్తములనుఁ గూడ కాళ్లుగా లెక్కించుకొనుము.

అశ్వని—కేతూ! ఈనాఁడు మిగుల మందబుద్ధివై యుంటివేమి? ఇక్కడ నాల్గు పాదము లనఁగా నాల్గు భాగము లని యర్థము. ప్రతి నక్షత్రము నాల్గు భాగములుగా విభజింపఁబడినది. ఇఁక రాశిశీలముల వినుము.

అశ్వినియు, భరణియు, కృత్తికాపాదంబును గలిసి మేషరాశి యగును. అది రక్తవర్ణము, అగ్నితత్వము, రాత్రి బలము, తూర్పున కాధిపత్యము, పృష్ఠోదయము, కాలపూరుషశీర్షత్వము, పాదజలము, స్థిరత్వము, క్రూరస్వభావముఁ గల పురుష రాశి. ఇది రవికి ఉచ్ఛస్థానము. శనికి నీచ. గురుచంద్రులకు మిత్రము. శుక్రునకు సమము. బుధునకు శత్రుత్వమును గలది. దీనికి కుజుఁ డధిపతి!

కేతువు—ఇవన్ని అన్నిరాసుల కుండునా?

అశ్వని—ఉండును.

కేతువు—ఇన్ని విశేషము లొక్కొక్క రాశికే యుండునెడల అన్నిరాసుల శీలభావములు చెప్పినచో నాటకమాడవచ్చిన నేనును, చూడవచ్చిన యీ ప్రేక్షకులును గూడ పాఠకులము కావలసివచ్చునే. రాశి శీల వివరముల పట్టిక తయారుచేసి నల్లావేసి యొప్పగించెద. కాని నాకొక్క సందేహము తోఁచుచున్నది. గ్రహములకు మిత్రత్వ సమత్వము లని, యుచ్చ నీచ లని యేమో యంటివి. ఈ శత్రుత్వ మిత్రత్వాదులు గ్రహముల నెత్తి గీతల మహిమయా, కాక గృహాధికారిణులైన మీలో మీకేమైన నాంతరరహస్యసందర్భము లున్నవా?

కృత్తిక—(కోపములో) చంద్రపదారిల మైన మమ్ము గురుతెఱిఁగి మాటాడుము.

కేతువు—చెంపలు వైచుకొందును. నా యర్థమది కాదు.

అశ్వని—(నవ్వుచు) కృత్తికా! వాని మాటలకేమి! కేతూ? నీసందేహము వాపెద వినుము. ఏచోటికి కేగ్రహము చేరునప్పుడది నిలువుగఁ బ్రసరించు సునిశిత కిరణకాంతినిచ్చునో యాచోటా గ్రహమునకు ఉచ్ఛస్థలము. మిక్కిలి యేటవాలుగఁ బ్రసరించు దుర్బల కిరణములు కలుగు చోటు నీచస్థలము. కిరణప్రసార మనుకూలముగ నుండు చోటు మిత్రము. సమముగ నుండు చోటు సమము. వ్యతిరేకముగ నుండుచోటు శత్రు స్థానము. ఇప్పుడు తెలిసినదా?

కేతువు—ఇంతేనఁటమ్మా! దీనిలో నేవియో చిక్కు సందర్భము లున్నవని తలఁచితిని. మొత్తముమీఁద నక్షత్రము లెన్ని యుంటివి?

అశ్వని—నక్షత్రముల సంఖ్య యసంఖ్యము. ఐనను రాశివిభాగంబులోఁ జేర్పడినవారము మే మిరువదేడుగురము.

కేతువు—అట్లు నియమించుట సృష్టికర్త గ్రహములమగు మాపై దయదలఁచి సుమా! మీ యిరువదేడ్గురనే చుట్టి తిరిగివచ్చుసరికి కాళ్ళీడ్చుకొనిపోవును. ఈ యసంఖ్యాకంబులగు నక్షత్రముల కన్నింటికి బలాదూరు తిరుగుచున్నచో గ్రహాధికారమున కొక్క నమస్కారము చేసి, వేఱుదారి పట్టవలసినదే.

కృత్తిక—కాళ్ళీడ్చుకొనుచుఁ బదునెనిమిది సంవత్సరములకుఁ గాని రాశిప్రదక్షిణ మొనర్పఁ జాలని నీ కతివ్యాప్తమార్గము మాత్రము సులభగమ్యముగా నున్నదా యేమి?

కేతువు—ఏమో! నాకు దేవుఁడిచ్చిన సిక్కబల మాపాటిదే. అశ్వనీ! ఒక్క విషయము నిన్ను చాలదినములనుండి యడుగఁదలఁచితిని. అడుగునెడఁ గోపము రాదుకదా.

అశ్వని—రాదు. అడుగుము.

కేతువు—రాశ్యాధిపత్యము విషయములో ఛాయాగ్రహముల మగు మా కొక్క గొప్ప లోపము జరుగుచున్నదమ్మా!

భరణి—ఏమది?

కేతువు—సూర్యాది గ్రహముల కొక్కొక్క రాశ్యాధిపత్యమే యైనను రాజగ్రహము లగుటచే వారికిన్ని యిండ్లు నవ్యాహతముగ జరిగిపోవును. తక్కినవారలకు పరిధి కామూల నొకటి, ఈమూల నొకటి చొప్పున భూలోకప్రభులకు వేసవి చలి బంగళాల వలె రెండేసి యిండ్లు కలవుగదా! మాకొక్క పంచయైన నిలుపకపోవుటకు మాచే మీకు అంత యపకార మేమిజరిగినది?

కృత్తిక—గ్రహరాజంబగు సూర్యుని, మా యండజనను ప్రాణవల్లభుండైన చంద్రుని గ్రహణమిషచే మీరు బాధించుచుండుట మాకు ప్రీతికరమే యనుకొనుచుంటివా!

కేతువు—అది పురాతన సందర్భమమ్మా. క్షీరసాగరమథనమునాఁటి వైర మిప్పటికిని మాలో రగులుచున్న దనుకొంటివా యేమి? అది వట్టి లోకాపవాదము. ఛాయాగ్రహముల మగు మాచేత ఎముకపుష్టి, రక్తపుష్టి గల గ్రహములు బాధింపఁబడుట యెట్లు? ఆ మహారాజులకు మేము వంగివంగి వందనము లిడుదుమే. వెనుకఁ బోవుచున్నను మా నీడ వారిపైఁ బడక మానదు. ఏమిచేయుమందువు?

అశ్వని—అది య ట్లుండనిమ్ము. సంభాషణలో సందర్భావశ్యకతను మఱచుచున్నాము. కేతూ! నీవు పాకశాలాధికారివి. గ్రహపూరుషులకు ప్రియమగు వంటలఁ జేయింపవలెను. వారి వారి రుచిభేదములనైన జ్ఞప్తియందుంచితివా?

కేతువు—ఎంత తెలివితక్కువవాఁడైనను తిండికి మెంచుకాకుండునా? గ్రహపూరుషుల రుచి పదార్థములఁ జెప్పెదను వినుఁడు. రాజగు సూర్యుఁడు పైత్యతత్వముఁగల గ్రహము. కావున నతనికి చేదుకారముల రుచి కలిసిన గోదుమధాన్యముల వంటకమునందు ప్రీతి. వాతశ్లేష్మశరీరి యగు చంద్రుఁడు మెత్తనివాఁడు. ప్రియభార్యలైన మీరలు ఉప్పుఁడుబియ్యము పెట్టినను నాతఁడానందించును. కుజునకు పైత్య మతిశయించుటచేఁ గాఁబోలు మంచి చేదుకందులైనగాని నెమరునకు రావు. వాతపిత్తశ్లేష్మములు మూఁడును ప్రకోపించి యుండుటచేతఁ గాఁబోలు బుధునకు కాంతాభిరుచి పూజ్యమైనను ఖాదనంబున మాత్రము షడ్రస గ్రహణ పారీణతా పాండిత్యము మెండు. గురువుగారికి సమమ శ్లేష్మము కొంచె మభివృద్ధిమైనది. కావున పంచదార పానకములో నానవేసిన సెనగలు పెట్టించిననే కాని రోగము నివృత్తి కాదు.

కృత్తిక—వంటలరుచినుండి వైద్యమునకు దిగితివేమి? వంటలరుచికిని వైద్యమునకును చాల దూరమే.

కేతువు—దూరమైననేమి? నా వైద్య మైహికాముష్మికములకు రెంటికిని బనికివచ్చునది.

కృత్తిక—అవును. నీ కైహికము. రోగి కాముష్మికము.

కేతువు—మఱియు మోక్షకారకుఁడ నగు భిషజ్మణిని. నా చేతి మాత్ర వైకుంఠయాత్రయే. అది ధూమకేతు సహస్ర తుల్యమైన పటుత్వముఁ గలది యని యెఱుంగరు? తరువాతఁ జెప్పెనింపు. సంతత శృంగారరసానుభూతిచే వాతశ్లేష్మాభివృద్ధి యై, పైత్య మణుగంటి, పండ్లు పులియుటచేఁ గాఁబోలు పాపము శుక్రుఁడు మెత్తగ నుడికిన అల చందలు మాత్రము చప్పరింపఁగలఁడు. శనిగానికి నవనాడుల వాత మతిశయించుటచే మంచి వగరైన కషాయముతో మెదిపిన తిలల పిండము గాని గొంతు దిగదు. ఇఁక మాయిద్దఱను గూర్చియు మీయిష్టము. కాని రాహువుకుఁ గొందెము అనుముల పిండియు, నాకు చేరెఁడు ఉలవచారును మాత్రము పోయుంపుఁడు.

అశ్విని—చాలుఁజాలు. నీయుపన్యాసము బాగుగినేయున్నది. నిన్న వంటకములఁ జేయింపుమని వేడుకకొలఁది కంటిని. మీ మీ యిచ్ఛానుసారముగ నిదివఱకే యిందు సర్వము సంసిద్ధము చేయఁబడినవి. గ్రహపూరుషులు వచ్చు సమయమైనది.

రోహిణి—అందఱికంటె ముందుగ ప్రాణేశ్వరుండు తన చల్లని కిరణంబుల వెదచల్లుచు వచ్చుచున్నాఁడు.

కృత్తిక—కేతూ! నీ వామూల నొదిఁగి కూర్చుండుము. నీ నీడ యేమహాపూరుషు పాదం బులనైన సోఁకరాదు.

కేతువు—ఇప్పను నా నీడ యాతనిపైఁ బడదు. అందుకు సమయాసమయములు లేవను కొంటివా!

అశ్విని—సోదరీమణులారా! నాథుని కెదురేగుదము. రండు.

[ప్రవేశము:—చంద్రుఁడు.]

చంద్రుఁడు—సతులారా! సమకూర్పఁబడిన ముత్యముల వరుసవోలె కన్నుల కానందంబుఁ గొల్పుచున్నారు.

అశ్విని—నాథా! సతీపతు లొండొరుల సాన్నిధ్యంబుచే నలరువారుకదా?

చంద్రుఁడు—కాంతలారా!

శా. తారానాథుఁడు తారలందున లసత్సంపూర్ణ దివ్యప్రభా
తారుణ్యంబున నెల్లవారలకు మోదంబుం బ్రసాదించు సం
చారాధింతురు సత్కవుల్ కృతుల; నయ్యామోద సామోదయౌ
చేరిన్ బొలుపారు మీ రసికులే కేళొందు దీపించిరన్.

మ. పరమాత్ముండు నిజాంశచే వెలుఁగుచున్ భక్తావళీ సన్నిధిన్
వర సందర్శనుఁడై వెలుంగు; ఘన శోభాస్ఫారమౌ హీరముల్
గరమొప్పంగ దంచుట్టు రత్నకములుం గల్గంగ; ధీమంతుఁడౌ
పురుషుండుం గను రాజిల్లున్ నిజసతీ పుణ్యప్రభాయుక్తుఁడై.

అశ్విని—నాథా! మాపైఁ గల యనురాగవిశేషముచే నట్లు సెలవిచ్చితిరి. కాని తమ చల్లని వెలుఁగునకు మా సహకార మెంతటిది!

చంద్రుఁడు—ఎంతటిదియైన నగును. అది యట్లుండె. కాని నేఁడు మనకుం గల కార్య క్రమంబుఁ జెప్ప మఱచితిని. నేఁడి మేషరాశికి గ్రహపూరుషు లందఱును విచ్చేయుదురు.

అశ్విని—ఆ ఘట్టంబుచే ఫలింపనున్న విశేషాంశ మానతీవలయు.

చంద్రుఁడు—అదియే చెప్పనుంటిని. తొల్లి సృష్ట్యాదిని బ్రహ్మసభలో నర్ధనారీశుని సముఖమున ప్రజాపతులకును, మన కథనాథుండైన సూర్యభగవానునకును, దమలో నెవరి శక్తి బలవత్తర మనుటనుగూర్చి యించుక చర్చ జరిగినది.

రోహిణి—నాథా! తేజోనిధియగు సూర్యభగవానునకును, ధీమంతులైన ప్రజాపతులకును స్వల్పులకుంబోలె వాగ్వాద మెందులకు? ఉభయులుం ద్రికాలవేదులే కదా.

చంద్రుఁడు—రోహిణీ! నా పల్కులొక్కటి జ్ఞప్తియం దుంచుకొనుము. ఎంతటి విజ్ఞానులైనను కానిమ్ము. కాలకర్మపాశంబులకుం గట్టువడి వ్యక్తావ్యక్త జ్ఞాన వేషభాషల నటింపక తీరదు.

కం. ఎంతటి ధీమంతు లైనం
గాంతా! కడవంగ లేరు కర్మవిపాకం
బింతను సాధనమాత్రుల
మంతయుఁ బరవశము; కారణాధిపుఁ డెవఁడో.

కం. కాల నియామకులము గ్రహ
పాలుర మే మెల్లఁ గాల కర్మ వశత మా
పాలిటి దిఙ్మార్గములన్
దేలుచు బొంగరములట్లు తిరిగెద మెపుడున్.

కం. జీవుల సుఖదుఃఖములన్
మావలనన్ గాదు సేయ; మా మా గతులున్
శ్రీవిభుని యధీనము లగుఁ
గావున మన కేల కార్యకారణకథల్?

కానున్న కార్యక్రమము ప్రకృత సంభాషణ సందర్భమునకు నుదాహరణము కాఁగలదు. కావున నేఁడు మా గ్రహకూటంబునఁ జర్చింపఁబడు విషయములఁ బూర్తిగఁ జెప్పనెంతు. అట్లానాఁడు శివునియొక్కయు, బ్రహ్మయొక్కయు సమ్ముఖమ్మున రవియు, ప్రజాపతులును పై యర్థమునే తేటపఱుప వాగ్వాద మొనరించిరి. ప్రజాపతుల వాదమును బరిపూర్తిగ నోడింపఁ దగు నుపాయంబును బన్నుటకై నేఁ డీనవగ్రహము లిందుఁ గూడనున్నవి. గ్రహరాజుల యాగమనమునకై సర్వ మాయిత్తముగ నున్నదా!

అశ్విని—ఉన్నది.

చంద్రుఁడు—అదిగో గోళాధిపు లందఱు నేతెంచుచున్నారు. సతులారా మనమేగి యాతిథ్యమునిచెదము రండు.

[ప్రవేశము:—కుజ, బుధ, గురు, శని, శుక్ర, రాహువులు.]

చంద్రుఁడు—గురువర్యా! విచ్చేయుఁడు. నెయ్యులారా! రండు. కుమారా! బుధా! త్వరితగతిఁ గలిగియు ముందుగ రాక ఆలసించితివేమి? రాహూ! సందియపడకుము రమ్ము. కేతూ! ఇంతవఱకును నిన్నుఁ జూడనైతినే!

కేతువు—చూడఁబడుట కేను నిజబలశీలములు గల గ్రహమునా? అన్ని పీడలలో నాది యొక పెద్దపీడ.

చంద్రుఁడు—(సత్వరము) మూల నొదిగెద వేల! ముందునకు రమ్ము. మోక్షకారివి. భవ్యులారా! అందఱును లోనికి విచ్చేసి గృహంబు పావన మొనర్పుఁడు. (తారలతో) కల్యాణులారా! మీరు వేగి లోన విశ్రమింపుఁడు. సూర్యాగమనమున నర్ఘ్యాదులం గొనిరా వచ్చును. (తారలు నిష్క్రమింతురు) పావనమూర్తి యగు భానుం డింత తడయుటకుఁ గతం బేమైయుండునో?

గురువు—ఇప్పుడే రాఁగలఁడు.

శని—వింశుపున్నమనాఁటి నీ సౌరు తాను డాసిన నమావాస్యయందునటె ఖలమగు నని సందియపడెనేమో.

బుధుఁడు—అవాచ్యము లాడకుము. పూజ్యుండగు మత్పితరుని భవ్యతేజంబు ఖిలమగుటయేమి! సూర్యమండలాభిముఖ మగు గోళార్ధంబుఁ బ్రకాశించుచుండును. వంకరచూపు గల కొన్ని గోళంబుల కది కొంతయే కనిపించును.

చంద్రుఁడు—బుధా! తొందరపడెద వేల? శనీ! మనమునందే గాక మాటలయందును వక్రత గల మా బుధుని పలుకుల పాటింపకుము. భాను నాలస్యమునకుఁ గారణ మేమంటివి?

శని—ఏమియు లేదు. ఆలస్య మాధిక్యమునకు సూచకము కదా.

కుజుఁడు—అట్లైన నందఱికంటె నెక్కువ మందగతి గల నీ వత్యధికుఁడవా?

శని—కయ్యమున కెప్పుడును కాలు ద్రవ్వుచు సమయమునకు స్తంభించియుండు నీవే యధికుఁడవు లెమ్ము.

శుక్రుఁడు—గ్రహములారా! ఏల వాదులాడెదరు? సూర్యచంద్రులకుఁ దప్ప మన కందఱకును వక్రచలనమో, వంకరచూపో, వింతస్వభావమో, వ్యత్యస్తకరణమో, ఏదియో, యొకటి కొలఁదిగనో గొప్పగనో యుండియేతీరెనది. మొదట నడక చూడుఁడు. గురువును, నేనును, బ్రాహ్మణులమే. సమానగౌరవము గలవారమే.

గురువు—(లవలో) రాక్షసుల నాశ్రయించి బ్రతుకు నీతఁడు నాకు సమానుఁడా?

శుక్రుడు—అయినను ఆతఁడు ఒక్కొక్క రాసియందు సుమా రొక్కసంవత్సరంబు వంతున పదునొకండు సంవత్సరముల, మున్నూట పదుమూఁడు దినములకుఁ గాని సూర్యప్రదక్షిణము చేయఁడు. నేనో ఒక్కొక్కరాసిని నెలలోపుననే దాఁటుచు, రెండువందల యిరువదియారు దినములకే పరిధిని చుట్టిరాఁగలను. కుజుఁడు ఒక సంవత్సరము మూఁడువందల యిరువదియొక్క దినములకు పండ్రెండురాసులును దిరుగును. చంద్రకుమారుఁడైన బుధుఁడు.............

బుధుఁడు—నన్నుఁ గూర్చి నేనే చెప్పుకొందును. సూర్యమండలంబునకు మిక్కిలి దగ్గఱగ నుండు పరిధి మార్గంబున నేను ఎనుబదియెనిమిది దినములకే పండ్రెండు రాసులును తిరుగఁగలను.

శుక్రుఁడు—శని యిరువది తొమ్మిది సంవత్సరంబుల నూట యిరువదియేను దినములకు తన తండ్రియగు భానుని ప్రదక్షిణము సేయును. రాహుకేతువులు నల్లని యొక్కొక్కఁడు చుక్కయెదురుగ వెనుకనడకతోఁ బదునెనిమిదివత్సరములకుఁ బండ్రెండురాసులను చరింతురు. చంద్రుఁ డిరువదియేడు దినములలోనే పండ్రెండురాసులను గిఱ్ఱునఁ దిరిగి వచ్చును. దానికిఁ గారణములు లేకపోలేదులెండు.

చంద్రుఁడు—దనుజగురూ! ఆ కారణము లేవి?

శుక్రుఁడు—ఏవా? ఇటు వినుము.

సీ. ఇరువదేడ్గురు కూర్మి యిల్లాండ్ర సమరీతి
దినమొక్కతొరఁగాఁ దనుపుటకునో
మింట వేలుపుజంట లంటి క్రీడలఁ జొక్క
సుధ నింపి, తిమిఁ బెంపఁ జూచుటకునో
తన మండలంబున మను పితరుల కెల్ల
గమనగాపు వేడుకఁ గజపుటకునో
వెనువెంటఁ గబళింపఁ జను రాహుకేతువుల్
చేర రాకుండంగఁ బోవుటకునో

చంద్రుఁడు—గీ. కావు కావివి నిజమగు కారణములు
తెలఁగి నేఁ జనియెడుకక్ష్య చిన్నది సుమి,
కక్ష్య లిటు చిన్నపెద్దవౌ కారణమున
గలిగె భేదంబు మాగమన గతులయందు.

గురువు—గమ్యమానం బగు మార్గంబుల దవ్వు దాపు లట్టుండఁగా స్వాభావికసిద్ధములగు మంద తీవ్ర గమనభేదంబులు మనకు వేవందువా?

శని—మీలో నావంటి కుంటికాలివాఁ డున్నప్పుడు లేకేమి? గురువరా! గ్రహముల దృష్టి భేదములఁ గూర్చి చెప్పరేమి?

గురువు—సూక్ష్మదృష్టియు వాగ్ధోరణియు గలిగి, కవియగు రాక్షసగురువర్యుఁడే గ్రహంబుల దృష్టిభేదంబులఁ గూర్చి యుపన్యసింప సమర్థుఁడు.

శుక్రుఁడు—(తనలో) నా యేకాక్షిత్వమునుఁ గూర్చి యపహసించుచున్నాఁడు. కానిమ్ము. (ప్రకాశముగా) తారానాథుండును......

గురువు—ఆ!

శుక్రుఁడు—తారానాథుఁడును, రవియు, రాజగ్రహము లగుటచే వారికి దిక్చక్రమున కేవల నుండి యావలవఱకు నిశ్చలమగు నెదుటిచూపు సప్తమరాశిపైఁ బ్రసరించుచుండును. ఇఁక నొక్కకన్నుగల నాకును, ఒక్కటే సూటియైన చూపు. అదియు సప్తమరాశి పైనే ప్రసరించును. నిజముగ రాజానుమతముగ మన కందఱకును సప్తమరాశివీక్షణ మున్నదిలెండు. కాని మనలోఁ గొందఱు ప్రక్కబారు చూపులవారును, ఓరగంటి సైగలవారును లేకపోలేదు.

సజుఁడు—ఎవరువారు?

శుక్రుఁడు—ఎవ్వరనినవారే! కుజా! ఒక్కమాట నడిగెదను. నిజము వచింపుము. శౌర్య ప్రకృతిఁ గల క్షత్రియగ్రహమవు కదా! నీకు తిన్నని సప్తమదృష్టితోపాటు నాల్గవ యింటి హ్రస్వవీక్షణమును, ఎనిమిదవయింటి దూరవిలోకనమును ఎందుకు?

కేతు—వ్యభిచార కారకుఁడు............

కుజుఁడు—నోరు మూయుము.

కేతు—తలయే లేని నేను నో రెట్లు మూయుదును!

కుజుఁడు—పోనిమ్ము. ఆకాశకుసుమము వంటి కుత్సితకోక ధూమకేతువు ప్రశ్నము వేసికొనుము. శుక్రాచార్యా! నా చతుర్థాష్టమ దృష్టులకుఁ గారణము చెప్పెదను వినుము. రణ విజయ కారకుఁడ నగు నేను—

రాహువు—కలహకారకత్వమే కాని విజయాధికారము నీకెక్కడిది? అది నా వంతు.

కుజుఁడు—ఛాయాగ్రహమ వగు నీ వేగ్రహముతోఁ జేరెదో వాని ననుసరించుటయే కాక నీకొక్క యధికారము వేఱుగ నున్నదా? ఊరకుండుము. శుక్రాచార్యా! అట్లు రణ కారి నగు నేను వ్యూహ నిర్మాణ నిర్వహణమందు కొంచె మీవలనావలఁ జూచుటకు హ్రస్వ సమ దీర్ఘ దృష్టులు ఆవశ్యకములుకావా?

శుక్రుఁడు—ఏమో! కొంతవఱకు సహేతుకముగనేయున్నది. కాని బృహస్పతికి సప్తమదృష్టితో పాటు పంచమ నవమ దృష్టు లెందుకో!

గురువు—నిజమగు కారణము నాకే తెలియదు. కాని యిట్లుండు నని తలంచెద. విద్యా కారకుఁడ నగు ముసలివాఁడను. కావున నిరత గ్రంథావలోకనచే హ్రస్వంబగు పంచమ రాశిదృష్టియు, ముదుసలితనముచే నవమ దూరదృష్టియు సంఘటిల్లెనేమో.

శుక్రుఁడు—కాని శనిగా! నీకుఁ దృతీయ దశమ దృష్టు లెందుకురా?

శని—అదేమి? "శనిగా" "రా" అని నీచే బిలువఁబడుట కంత తక్కువవాఁడనా!

శుక్రుఁడు—బానిసవగు నిన్ను మఱెట్లు పిలువు మనెదవు;

శని—అట్లయిన చండాలగ్రహ మగు రాహువును "రాహుగాఁడా" యనలేదేమి!

రాహువు—అట్లనిన నో శుక్రుని మంచికన్ను చిదుకఁబొడిచి, నీ మంచికాలిని విఱుగఁదన్ననా!

చంద్రుఁడు—ఆఁగుఁ డాఁగుడు. గోళాధికారులకుఁ దగని ధోరణిగ సంభాషింపఁ దగునా? గురువర్యా! లోకవ్యవహారమున కావశ్యక మగునట్లు మనలో మనకు భేదము లున్నను వైషమ్యరహితులమై యుండునట్లు తాము సెలవొసంగవలయు.

గురువు—అవును. తత్వభేదము గల వస్తువు లుండుట లోకధర్మము. కావుననే మనలో మన కనేకభేదములు కలవు. అది భగవత్సంకల్పము. అట్టివానిని లోపములుగ నెన్నుకొనరాదు. ఇంక నీ ప్రసంగములఁ గట్టిపెట్టుఁడు. మన కందఱకును రాజైన సూర్యభగవానుఁడు విచ్చేయుచున్నాఁడు.

చంద్రుఁడు—(తెఱవంకఁ జూచి) అశ్వినీ! అర్ఘ్యమాల్యాదులఁ దెప్పింపుము.

(తారలు అర్ఘ్యాదులతోఁ బ్రవేశింతురు. సూర్యుఁడు ప్రవేశించును.)

తారలు—సీ. మంగళంబు ఖగోళ మహానాథ విభునకు
మంగళం బమిత భా మండితునకు
మంగళం బారోగ్య మార్గ ప్రదాతకు
మంగళం బమల పతంగునకును
మంగళం బబ్జ సమ్మాన్య తేజస్వికి
మంగళంబు తమ స్సమాపకునకు
మంగళం బఖిల సన్మౌని వందితునకు
మంగళం బుదయార్ఘ్య మానితునకు

గీ. మంగళంబు సంజ్ఞా సతీ మనసఖునికి
మంగళము పుణ్యజన లభ్య మండలునకు
మంగళంబు త్రిమూర్త్యంశ సంగతునకు
మంగళం బభ్రమణి కిదే మంగళంబు.

(తారలు అర్ఘ్యాదుల నిచ్చెదరు.)

సూర్యుఁడు—గురువర్యులారా! వందనములు.

గురువు
శుక్రుఁడు } —విజయోస్తు.

సూర్యుఁడు—మిత్రమా! చంద్రా! నీ తారలకును నీకును శుభంబేకదా? గ్రహగోష్ఠి పాలకులారా! మీకును క్షేమమా!

చంద్రుఁడు—సకల శుభ ప్రదాత వగు నీవు రాజుగానుండ శుభంబులకేమి కొఱఁత?

సూర్యుఁడు—మంచిది. నేఁటి మన గ్రహసమావేశంబునకు అంతయు సంసిద్ధముగనున్నదా?

చంద్రుఁడు—తమ రాకయే సర్వార్థసిద్ధిప్రదము.

అశ్విని—భవ దుచ్చస్థానం బగు మేషరాశి మహాపీఠము నలంకరింపవలయు.

సూర్యుఁడు—అశ్వినీ! అటులే చేసెద. (పీఠంబు నెక్కి) అందఱాసీనుల గుఁడు.



(అందఱును ఉచితాసనములఁ గూర్చుందురు.)

సూర్యుఁడు—మన మండలము కొండొక కార్యార్థమై నేఁడు అంశమూర్తులఁ దాల్చి ఇందొక్కచోఁ జేరితిమి. గురువర్యా! నేటి సభాప్రయోజనమును గూర్చి నిర్వచింపుఁడు.

గురువు—రాజాజ్ఞ తెలంగున వర్తించెద. గ్రహగోళాధిపతులారా! లోకచారిత్ర నియామక దివ్యావతారులారా! నియతప్రచారవేగంబుల మీ మీ కక్ష్యలయందు అతులిత తేజంబునం బరగు తామందఱు నేఁ డిక్కడకు విచ్చేయుటకుఁ గారణంబు మీ రిదివఱ కెఱింగినదే. అయినను కార్యకారణ సందర్భ వివరణము, లక్ష్యసాధన ప్రయోజక మగును. గావున రాజు నానతి శిరసావహించి వివరించెద. మునుపరికథా సృష్ట్యాది కాలంబున మనకును ప్రజాపతులకును స్వత్వ పరత్వ సామర్థ్యములం గూర్చి బ్రహ్మ సభలో జరిగిన వాదంబు. అర్ధనారీశుని విజృంభణము. అప్పటినుండి నేఁటికిఁ గోట్ల కొలందిగ సౌరాబ్దంబులు గతించినవి. శివునియానతి నొప్పున బ్రజాపతులు తమ ప్రతిజ్ఞా పరిపాలనమునకై భూలోకముం జన్మించి గ్రహబలముకంటె వ్యక్తిస్వాతంత్ర్యమే యధికమను తమవాదమును స్థిరపఱుప వలసియున్నది. అట్టి భూలోక మదిగో.
(తెరవంకఁ జూపుచు.)

సీ. సౌమ్యానిలవ్యాప్తి జలదసంఘావృత్తి
సమజలస్థలపూర్తి సకలజంతు
సంతానజీవన వంతమై, కుజశుక్ర
పథముల నడుమను పరిధిఁ గల్గి,
ఘనవేగమున దేవదినమున కొకసారి
సూర్యమండలమును చుట్టి తిరిగి,
తేజరిల్లు ధునినంబుఁ ద్రిసహస్రయోజన
మధ్యమంబు హిమోష్ణమానితంబు
గీ. గలిగి, చిత్రవర్ణస్ఫూర్తి నలరు నదిగొ;
మానవావళీ ధీప్రభా మానితంబు,
దివ్యతమ ధరా దేవతా ధిష్ఠితంబు,
మహిత పుణ్యప్రదంబు, భూమండలంబు.

మానినీవృత్తము.

మండలభూమికి మధ్యమునందున
మాన్యహిమాచల దక్షిణమం
దుండెడి కానన వృక్ష చయంబుల
నొప్పెడి పర్వత పంక్తులపై
నుండి నదీనివహంబులు పాఱ స
ముజ్జ్వల సస్య సమృద్ధిమెయిన్
బండు మహాజన జీవనయోగ్యము
భారతవర్షము హర్షదమై.

శని—హిమంబుచే గొప్పవారెయో, వేఁడిమిచే గుబగుబ పొగలురేఁగియో, యుండునట్టి గోళముల కధిపతులమగు మనకెల్ల నట్టి ప్రదేశము హర్షదమనుటకంటె నమర్షదమనుటయే సరి.

సూర్యుఁడు—కుమారా! గురువుల వాగ్ధోరణి కడ్డురాకుము. గురువర్యా! తరువాత సెలవిండు.

గురువు—ఆభూమండలంబున నార్యధాని యనంబడు భరతఖండభాగమే మానవసృష్టి కానెమ స్థానంబును, ధర్మప్రాశస్త్యంబు గల కర్మభూమియు నను వార్తను నాదేశంబు మీకు విదితంబే. అట్టిచోట.

గీ. ఆది మానవ నిర్మాణ మగుట మొదలు
నరిగె నేఁటికి చాతుర్యగానుసరణి
ధర్మపరివర్తనము పెక్కుదార్ల; నిపుడు
లోపనియమంపు కలివేళ దాపురించె.

చం. యుగయుగధర్మవర్తనల నొంది, మహాజను లెందఱెందఱో
విగత సమస్త కల్మిష నివిక్త మనంబుల జీవితంబులన్
నిగమ నియామ మార్గపర నిర్మల వర్తనులై తరించి; రా
జగ దుపకార చేతనుల జన్మఫలంబు నుతింప శక్యమే!

ఉ. ఈ కలివేళఁ గాయ హృద యేంద్రియ పాటన మల్ప మూర్వపై
నేకడ; నైన కస్తురిఁబయించిన వస్త్రముభాతి నార్యధా
నీ కమనీయ భూమి యది నేఁటికిఁ గాంచును పౌరుషాఢ్యులన్,
శ్రీకర కర్మయోగ పరసిద్ధి నిబద్ధుల, దేశభక్తులన్.

సూర్యుఁడు—గురువరా! ప్రజాపతులు తమ ప్రయత్నపరీక్ష కిట్టి యార్యధానినే తగు ప్రదేశముగాఁ దలంచిరా!

గురువు—అవును. ఆర్యధానియందు వింధ్యపర్వతములకు దక్షిణపార్శ్వమందుఁ గల దక్షిణాపథంబున నిప్పుడు కాకతిరాజ్యంబు అత్యున్నతదశయం దున్నది. ఈ హిందూరాజ్య నృపాలుర శాస్త్రానిలాషకారణంబుగా నిఖిలవిద్యలు నక్కడ వర్ధిల్లుచున్నవి. కావున నాప్రదేశమే తమకు సమయపాల నోచిత స్థానంబుగాఁ దలంచి, ప్రజాపతు లిప్పుడు తమ ప్రయత్నంబు నచ్చట ప్రారంభించిరి.

బుధుడు—ఆ ప్రయత్న మెట్టిది?

గురువు—వసిష్ఠప్రజాపతి భాస్కరుం డను నామంబుఁ గల విప్రుఁడుగా ఆర్యావర్తంబున జనించి, యధికోత్సాహములో జ్యోతిర్విద్య సాధించెను. కళ యను ప్రజామాత

యా భాస్కరాచార్యునకు లీలావతి యను కూఁతురుగ జనించి, తండ్రికడ విద్య నభ్యసించి, జ్యోతిర్విద్యావ్యాపనమున నాతనికిఁ దోడగుచున్నది.

సూర్యుఁడు—జ్యోతిర్విద్యను సాధించుట ప్రజాపతుల వాదమున కెట్లు సహకారమగును?

గురుఁడు—గ్రహబలముకంటె వ్యక్తిస్వాతంత్ర్యమే బలవత్తర మను సంశయమును మానవజన్మము ధరించి పోషింతుమనికదా వారి ప్రతిన; అట్లు మనబలము నతిక్రమించుటలో ముందుగా మన శీలముల నెఱుఁగుటయే వారి ప్రథమప్రయత్నము కాఁగూడదా?

సూర్యుఁడు—మన బలశీలముల నెఱిఁగి, వారు చేయునదేమి?

గురుఁడు—మన బలశీలముల గుఱించిన రహస్యంబుల లోకంబునకు వెల్లడిచేయుటయే వారి యుద్దేశము.

చంద్రుఁడు—మన శీలబలాదులఁ దెలియఁజేయు జ్యోతిర్విద్యను లోకంబునవ్యాపింపఁ జేయుట మనకు సంతోషకరమగు కార్యముకాదా?

గురుఁడు—అది పరిస్థితులను బట్టి యుండును. అనఁగా మనలను గూర్చి సంపూర్ణ విజ్ఞానము గలవారు మన కనుకూలురును, భక్తులును నై, అట్టివారిచే జ్యోతిర్విద్య వ్యాపించుచున్నచో మనము సంతోసింపవలసినదే. కాని మనకుఁ బ్రతిస్పర్థు లగువారు జ్యోతిశ్శాస్త్ర మభ్యసించునపుడు వారు దాని నేయుద్దేశముతో నేర్చుచున్నారో యోజింపవలదా? రంగుటద్దములగుండఁ జూడఁబడునప్పుడు స్వచ్ఛతేజంబును మలినముగఁ గాన్పించును. అట్లే మన ప్రతికక్షుల బోధనలచే లోకంబున వ్యాపించు జ్యోతిర్విషయంబులు మనయెడల నెట్టి దురూహలఁ బుట్టింపగలవై యుండునో యెవరు చెప్పఁగలరు.

చంద్రుఁడు—అట్లు దురూహలు మనయెడలఁ బ్రజలకుఁ గలుగునట్లు చేయుట ప్రజాపతుల వాదమున కేమి యుపయోగము?

గురుఁడు—చెప్పెదను. మన శీలబలాదులను బాగుగ నెఱుంగువారికి, మన బలమునుండి తప్పించుకొను మార్గములు కూడను తెలియక పోవు. అట్లు తెలిసికొనువారు మన భక్తులేని మన కరుణచే నట్టి యవకాశము కలిగెనని తలఁచి మనల నభినందింతురు. కాని ప్రతికక్షు లట్లు తలంపక తమశక్తిచే నట్టి యవకాశము లేర్పఱచుకొంటి మని గర్వింతురు. ఈ రెండవయూహయే లోకమునఁ బ్రబలునేని యెండకు గొడుగు వేసికొనునట్లు గ్రహబలంబుల నన్నింటిని సులభంబుగ నివారింపఁగల మను దురూహ లోకమున వ్యాపించును. జనులు మనలఁగూర్చి యట్లు తలంచుట ప్రజాపతుల వాదమునకు గెలుపువంటిదేకదా?

చంద్రుఁడు—కావున వారొనర్చు జ్యోతిర్విద్యావ్యాపన ప్రయత్నమునకు మనము ప్రతికూలురుగా నుండవలెననియే తమయాదేశమా?

గురువు—అంతియగాక మనకు ప్రతికక్షులగుటచే వారేప్రయత్నము నధికోత్సాహముతో పూనుకొనెదరో దానిని మనము ప్రతిఘటించి మన ప్రతిఘటనము నతిక్రమించుచు వారు తమ ప్రయత్నము నెంతవఱకు కొనసాగింపఁ జాలుదురో పరీక్షింప వలయునని, అర్ధనారీశుని యాజ్ఞగదా!

సూర్యుఁడు—అదియే నాయభిప్రాయమును. ఇఁక మన పరీక్షావిధానమును నిర్ణయించుటకు ముందుగా వారి ప్రయత్నవివరంబు లెట్టివో పూర్తిగ నెఱుంగవలెను.

గురువు—అవును. వినుఁడు. భాస్కరాచార్యుని ప్రయత్నమగు జ్యోతిష రహస్య వ్యాపన కార్యంబునకై మయాచార్యకృతంబు లగు కొన్ని జ్యోతిషగ్రంథంబుల నతఁడు సాధింప మిగుల నుత్సాహియై యున్నాఁడు.

శని—దనుజశిల్పియు, రావణుని మామయు నగు మయుండను రాక్షసుండు ఈ మన సూర్య భగవానుని గూర్చి తపం బొనరించి పడసిన వరంబులచే నిఖిలఖగోళవిజ్ఞాన సంపన్నుం డయ్యెనని వింటిము. అతఁడు రచించిన గ్రంథములేనా యివి?

శుక్రుఁడు—అట్లే! ఘనకార్యసాధనలో మా రాక్షసులే యధికులు.

గురువు—(తీవ్రముగా) కావుననే పవిత్రము లగు దేవరహస్యముల గోప్య గౌరవమును భంగపరుపనున్నారు.

శుక్రుఁడు—అదెట్లు?

గురువు—ఎట్లా! చెప్పెద వినుము. పవిత్రములును దివ్యులే యెఱుంగఁదగినట్టివియు నగు జ్యోతిశ్శాస్త్రరహస్యములను మయుండు తా నెఱుఁగుటతో తృప్తిచెంది యూరకుండక ఆ మర్మంబు లన్నింటిని గ్రంథస్థములుగాఁ జేసినాఁడు. మఱియు నట్టి యుద్గ్రంథంబులను దనుజలోకమునఁ దనయొద్దనే న భద్రపఱుపక ఆ భూలోకమునందు తాను తపం బొనర్చిన యాశ్రమంబు చెంగటి బిలంబున నిక్షిప్తములుగా నొనరించినాఁడు.

సూర్యుఁడు—ఇది భస్మాసురుని చరిత్రమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నదే! తరువాత!

గురువు—కాలక్రమంబున నా మయాచారి యాశ్రమప్రాంతముననే త్రిలింగదేశరాజధాని యగు ఏకశిలానగర మేర్పడినది. మయుఁడు గ్రంథంబుల దాఁచిన బిలప్రదేశంబు పై నిప్పు డొక కాళికాలయం బున్నది.

కుజుఁడు—ఈ కాళికాలయ మా నగరములో నున్నదా?

గురువు—లేదు. ఏకశిలానగర ప్రాకారమునకుఁ గొంచెము దూరమున నున్నది.

బుధుఁడు—కోట వెలుపల నుండు దేవళములో నిట్టియుద్గ్రంథము లింతకాల మెవ్వరికిని జిక్కక భద్రముగ నెట్లుండెను?

గురువు—ఈ యాలయము కోటవెలుపల నున్నను, త ద్రాజ్య పాలుర కభిమాన దైవత స్థలము. కావున భద్రముగ సేవింపఁబడుచున్నది.

శుక్రుఁడు—ఆరాజులైన నీ గ్రంథములఁ దీయించుటకు ప్రయత్నింపలేదా?

గురువు—అందుల కేదియో సమస్యావిధానమగు ప్రతిబంధకమున్నట్లు తెలియుచున్నది. ఏది యెట్లున్నను ఆ యాలయంబులోని గ్రంథంబులు సాధించుటకై భాస్కరాచార్యుఁడు తన కొమార్తెయగు లీలావతితో దక్షిణాపథంబునకు వచ్చి—

శని—ఇట్టి గ్రంథము లక్కడ నుండుట భాస్కరాచార్యుం డను మానవుఁడుగా పుట్టిన వసిష్ఠ ప్రజాపతి యెట్లెఱుంగఁగలిగెను?

గురువు—ఇట్టియుద్గ్రంథంబు లా యాలయమున నుండుటను వార్తక హిందూదేశమంతట ను వ్యాపించినది. ఇట్టి గ్రంథంబులను సాధించు పట్టుదలతో భాస్కరాచారిగఁ బుట్టిన వసిష్ఠప్రజాపతి కొంతకాలమునకు తన కొమార్తె యగు లీలావతీపరిచయమూలంబున కాకతిరాజ్య పట్టభద్ర యగు రుద్రాంబామహారాజ్ఞ నాశ్రయించి, యామెయనుజ్ఞ చేఁగాని తనకు లభింపని పూర్వోక్తగ్రంథములకొఱకు ప్రయత్నించుచున్నాఁడు. ఆంధ్ర సామ్రాజ్యలక్ష్మి యగు రుద్రాంబామహారాజ్ఞకి కల్యాణ మింకను కాలేదు. త్వరలో కానున్నది. ఆమె కల్యాణసమయమునఁ గాని యీ భాస్కరాచార్యున కీ గ్రంథములు లభింపవు. మన ప్రతిఘటనముల నతిక్రమించి భాస్కరాచారి యీ గ్రంథములను రుద్రాంబాదేవి సాహాయ్యమునఁ బడయఁజాలెనేని ప్రాకృతుల వాదమునకు విజయ మేర్పడినట్లే యెంచఁదగును. సూర్యనాటినే దివ్యదృష్టి నెక్కువగ వినియోగించి ఈ వివరము లన్నియు నేనారయఁ గల్గితిని కావున మన మీ యవసరమున నెట్లు ప్రతిఘటింపవలెనో యాలోచించి ఖగోళపాలురు తీర్మానింతురుగాక!

సూర్యుఁడు—గ్రహపూరుషులారా! వింటిరికదా గురువర్యుల యుపన్యాసమును?

గ్రహములు—వింటిమి.

సూర్యుఁడు—ఇఁక మనము సలుపవలసిన ప్రతిప్రయత్నమును గూర్చి యొక్కొక్కరుగ సెల వింతుము. కేతూ! నీ యభిప్రాయ మేమి?

**కేతు**—తలలేనివాని కాలోచన కూడనా! మఱియు శల్య మాంస రక్త చర్మ పటుత్వములు గాని, వివిక్త శీల బలాదులు గాని లేని వట్టి ఛాయాగ్రహమును. మీయూహయే నాయూహ.

సూర్యుఁడు—రాహూ! నీయుద్దేశ మేమి?

రాహువు—గ్రహపూరుషులని యింతటిపేరులతో నాకాశవివరంబంతయు నవ్యాహతముగ నేలు మనకీ ప్రజాపతు లొక యడ్డు గలిగింపవలెనా? మన భానుఁ డుద్దీపించినచో నాశ్రమములగు ప్రజాపతులతో సత్యలోకమువఱకును మాఁడిపోదురు. వేయేల! నాకు సెలవిండు. ఇప్పుడే సర్పాకృతిఁ దాల్చి, యూరు పేరు లేకుండ నీ భూలోకము నంత నొక్క నిమిషములో నొక్క కోఱక్రిందవేయుదు.

సూర్యుఁడు—ఆఁ! ఆఁ! అంత తీవ్రత కార్యవిచారణయం దుండఁగూడదు. అర్ధనారీశ్వరుం డానతిచ్చిన విధానమదికాదు. వారే కార్యము నధికోత్సాహముతో సలుపుచున్నారో దానిని మనము ప్రతిఘటింపవలసియున్నది. శనీ! నీవేమందువు?

శని—అనుట కేమున్నది? సరి యున్నచోఁ జేతనైన పని చేసెదను.

సూర్యుఁడు—ఏమది?

శని—మత్ప్రియులగు మ్లేచ్ఛనివహంబులం బురికొల్పి, ఓరుగంటి చెంతను పుస్తకంబులున్న కాళికాలయమునందుఁ జొన్పి, వారిచే నాలయంబు నపవిత్ర పఱిపించి, తత్కారణంబున మహిమకోల్పడునట్టి కాళినుండి గ్రంథంబుల హరించి, చించి, చలిమంట వైచుకొందును.

సూర్యుఁడు—నీ యూహ వెంట వర్తించుటకు సమయ మిదికాదు. మ్లేచ్ఛనివహంబులు దక్షిణాపథంబున విజృంభించుకాల మింకను దాపురింపలేదు. మఱియు నిట్టి యుద్గ్రంథంబు భాస్కరాచార్యునకుఁ జిక్కనీయకుండుటకే మన ప్రయత్నముగాని వానిని ధ్వంసపఱచుటకాదు. కుజా! నీయుద్దేశమేమి?

కుజుఁడు—గురువర్యుల యుపన్యాసమునందు రుద్రాంబా వివాహసమయమునందే భాస్కరాచార్యునకు గ్రంథములు లభించునట్లు వివరింపఁబడియె. కావున నాతని కా గ్రంథములు చిక్కనీయకుండుటకై రుద్రాంబయొక్క వివాహము నాటంకపఱుచు ప్రయత్నము నాలోచించెను.

శుక్రుఁడు—కానున్న యామె శుభకల్యాణమును ఆఁపుటకు నీతరమా, నాతరమా!

కుజుఁడు—నాకుఁ దోఁచిన యుపాయమును జెప్పెద వినుండు. ఈ రుద్రాంబయొక్క కాకతి రాజ్యమునకు ప్రాంతమున దేవగిరిరాజ్యమున్నది. ఈ రెండురాజ్యములకును పూర్వమునుండియు బలవద్విరోధము కలదు. అది కారణముగా దేవగిరిరాజగు మహాదేవుని రుద్రాంబావివాహసమయముననే కాకతీయరాజ్యముపైకి దాడివెడలునట్లు పురికొల్పెదము. మనగ్రహబలంబుల నా దేవగిరిసైన్యములకు సాహాయ్యముగా నొసంగి వారిచేత నీ భాస్కరాచార్యునకు నుత్సాహభంగ మగున ట్లా యాలయములోని జ్యోతిష గ్రంథంబుల గ్రహించి మనవద్ద గుప్తముగావించెదము. తనసైనికులగునట్టి యాంధ్రవీరులతో రుద్రాంబ దేవగిరిసైన్యముల నెదిరింపఁజాలుట, అందుపై నామె వివాహమగుట, భాస్కరాచార్యునకు గ్రంథములు చిక్కుట యను విషయములు మన ప్రతిఘటనల నతిక్రమించి సంభవించునో లేదో పరీక్షింతము.

సూర్యుఁడు—యుద్ధకారకుఁడై నందుకు కుజుఁడు తగినపరీక్షనే సూచించినాఁడు. ఒకవైపున అనఁగా ప్రజాపతుల పక్షమున భాస్కరాచార్యునిసంకల్పము, ఆంధ్రవీరుల దోర్బలము, రుద్రాంబాదేవి సాహసము. రెండవవైపున మనబలములతోఁ గూడిన దేవగిరి వీరుల పరాక్రమము. ఏదిగెలుచునో చూచెదము. శుక్రాచార్యా! తా మేమందురు?

శుక్రుఁడు—నాకు కుజుని యభిప్రాయమే యాచరణీయ మని తోఁచుచున్నది.

సూర్యుఁడు—గురువర్యా! తమ యాదేశమేమి?

గురువు—విద్యావిషయమే గాని నా కితరప్రసంగముల పరిచయము లేదు. కాని కుజుని యభిప్రాయము ఆదరణీయముగ నాకును పొడకట్టుచున్నది.

సూర్యుఁడు—చంద్రా! నీ వేమందువు?

చంద్రుఁడు—నాకును కుజునియభిప్రాయమే సరియని తోఁచుచున్నది. ఏపను తా మెట్లు నిశ్చయించినను నేనుండు ప్రదేశమునుండి అనఁగా గోచారరీతిగా నీ గ్రహపూరుషుల సందందు నిలిపినఁ జాలవలయుఁ గార్యసాధక మగును.

సూర్యుఁడు—అదియు సమాదరణీయమైన యంశమే! తారలారా! మీ రేమి సెలవిత్తురు?

అశ్విని—మేము తమ యాజ్ఞానుసారి యగు మా ప్రాణేశు నానతి ననుసరించువారమే.

సూర్యుఁడు—బాగుగా పలికితివి. సభ్యులారా! నాతీర్మానమును వినుఁడు. వసిష్ఠప్రజాపత్యవతార మగు భాస్కరాచార్యునకు కాళికాలయ నిక్షిప్తంబు లగు జ్యోతిషగ్రంథంబులు లభించుటకును, రుద్రాంబాదేవి వివాహకాలమునకును, సంబంధము కలదని గురు

వులు సెలవిచ్చిరి. అట్టి సంబంధము విడదీయుటకై ఇట్లొనర్చెదము. కుజుఁడు చెప్పినట్లు దేవగిరిరాజగు మహాదేవుని కాకతీయరాజ్యముపైకి దాడి వెడలునట్లు మన గ్రహగోళ బలంబులచే ప్రేరేపింతము. మన గ్రహగోళబలంబునకు, తోడుగ మన మందటము కూడ సంశమూర్తులఁ దాల్చి, స్వయముగ భూమిపై కరిగి, వారికిబలమని వెలిబుచ్చి, కాకతిరాజ్యము పైకి దాడి వెడలునట్లు పురికొల్పి, దేవగిరి రాజులతోఁ గూడ, ఏకశిలానగరమునకరిగెదము. ఈ దాడి రుద్రాంబాదేవి వివాహ సమయమునకే కాకతిరాజధాని చేరునట్లు సంఘటింతము. ఈ కల్లోలమునకుఁ గారణము రుద్రాంబాదేవి వివాహ మొక్కంత యాపుట. ఇంతలో మనతోనుండు దేవగిరివారిచే, కాళికాలయములోని గ్రంథమును దీయించి, వానిని భాస్కరాచార్యునకుఁ జిక్కకుండ, మనవద్ద గుప్తపరపించుటకును, ప్రయత్నింతము. ఉభయ సైన్యముల పరాక్రమమును వేఱుగఁ బరీక్షింతము.

గ్రహములు— ఔనౌను. అట్లే యొనర్చెదము.

సూర్యుఁడు—అట్లొనర్చుటచే నాదేశపు ప్రజలతో మనకు సన్నిహితపరిచయ మేర్పడఁగలదు. అప్పుడు జ్యోతిర్విద్య గ్రహించుటకు వారు తగుదురో తగరో బాగుగాఁ బరీక్షింప వచ్చును. మఱియు యుద్ధములో గ్రహబలయుతులగు దేవగిరిసైన్యంబులను, కేవల మానవపరాక్రమంబుచే కాకతీయసైన్యవీరులు జయించిరేని ప్రజాపతుల వారసులకు గెలుపు కలిగనని తలంపవచ్చును.

అందఱు:—ఔను! అట్లే!

సూర్యుఁడు—ఇంక నెల్లరమును భూలోక ప్రయాణోన్ముఖులము కావలెను.

తారలు—సూర్యదేవా! మా యాతిథ్యము స్వీకరించి మమ్ము ధన్యులఁ జేయవలెను.

సూర్యుఁడు—తారలారా! మీ యాతిథ్యముచే మేమే ధన్యుల మయ్యెదము.

అశ్విని—దేవా! ఇట్లు దయచేయవలెను. గోళాధిపులారా! ఇట్లు దయచేయుఁడు.

అందఱు—మంచిది. మంచిది.

[గ్రహపూరుషులు శీఘ్రగా తెరదిగును.]

ద్వితీయాంకము సంపూర్ణము.




## తృతీయాంకము.

### ప్రథమరంగము.

ప్రదేశము:—భూలోకము, దక్షిణాపథము. ఓరుగంటిలోని రుద్రమదేవి అంతఃపురము.

ప్రవేశము:—మహారాజ్ఞి రుద్రాంబ, లీలావతి విశ్రాంతిగఁ గూర్చుండి యుందురు.

రుద్రమదేవి—లీలావతీ! ఏమనుచుంటివి!

లీలావతి—మహారాజ్ఞీ! రుద్రమాదేవీ! ఈ భూలోకమున నివసించు వారందఱును జ్యోతిర్విద్య నేర్వఁదగును. తమకు జ్యోతిర్విద్య కూడ సులభసాధ్యమే యనుచు విన్నవించు చుంటిని.

రుద్రమదేవి—పరమపూజ్యులును కీర్తిశేషులును నగు మాతండ్రి గణపతి చక్రవర్తివారికి మేమును, మాచెలియలు గణపాంబయు నిరువురమే సంతానము. మా యిరువురిలో నన్ను చిన్ననాఁటినుండియు పుత్రునివలె ప్రేమించుచు, పూరుషోచితములగు గజాశ్వారోహణాదులను రాజ్యతంత్రావశ్యకవిద్యలను నాకు మాతండ్రిగారు నేర్పించి, వారితోఁ గూడ దండయాత్రాదులం ద్రిప్పుచు, యుద్ధపరిచితి నలవఱచుచువచ్చిరి. కావున జ్యోతిర్విద్యామల సాధించుటకు విశేషావకాశము లేకుండెను. ఇంక స్త్రీలు నేర్వఁదగిన గానకళాది క్రీడావిద్యలఁ గూర్చి శ్రద్ధయే చేయమైతిమి.

లీలావతి—మహారాజ్ఞీ! ఎట్టిశాస్త్రమైనను మాబోంట్లకుఁ గష్టసాధ్యముగాని రాజ్యపాలనావశ్యకము లగు సకలవిషయంబుల నెఱుంగుటచే వివేకాధిక్యము గల తమవంటి ప్రభువులకు సులభసాధ్యమే.

ఆ. కష్టతరము మాకుఁ గను సులభము నీకు
విద్య లెల్ల హృదయ వేద్య మగుట
రవి కర ప్రభాపరం బన్య దూరంబు
లోక విషయ సార లోకనంబు.

ఆ. కుంభలగ్న జాత! గురుఁడు విద్యాకారి;
తనదు మీఁద నుండుఁ దవరు వాక్య
జాల మీఁదు నుండె; సకల విద్యలయందు
రాని దొకటి కలదె రాజ్ఞి నీకు!

రుద్రమదేవి—శాస్త్రానుభవముఁ గల నీ వట్లు చెప్పుట విద్యనేర్చుటకై మమ్ము ఉత్సాహపఱుచుచున్నది. కావున మాకుఁ గొన్ని సందియములు తేటపఱుచుము.

లీలావతి—విధేయురాలను.

రుద్రమదేవి—ఆకాశంబుపై నుండు గ్రహంబులకును భూమిపై నుండు మనకును ఎట్టి సంబంధము కలదు?

లీలావతి—కార్య కారణ సంబంధము. అనఁగ సర్వవ్యాపారములందును మనలఁ బ్రేరేపించునవి ఖేచర గ్రహాదులు. వానిచేఁ బ్రేరేపింపఁబడువారము మనము.

రుద్రమదేవి—అంతదూరమునుండి అవి మనలఁ బ్రేరేపించు టెట్లు?

లీలావతి—మహారాజ్ఞీ! సూర్యకాంతిచే పద్మములు వికసించుటయు, చంద్రకాంతిచే నవి ముకుళించి కలువలు వికసించుటయు మనము వినునదియుఁ గనునదియుఁ గూడఁ గదా.

రుద్రమదేవి—అవును. సూర్య చంద్ర మండలంబులు గొప్పవగుటచే వాని కిరణప్రసారము భూమిపైకి నధికముగఁ గలుగును.

లీలావతి—రవి శశి మండలములు మిగుల సామీప్యమున నుండుటచేత ననవలెను. గొప్పవగుటచేతఁ గాదు. సామీప్యస్థితిచే మన కట్లు కనిపించినను రవిశశిమండలంబులకంటె కోట్లరెట్లుగ మండలాధిక్యముఁ గల తేజోమూర్తులౌ మిణుకు నక్షత్రములలోఁ జాలఁ గలవు.

రుద్రమదేవి—అ దెట్లు?

లీలావతి—తల్లీ! చెప్పెద వినుము. ఒక క్షణమునకు అనఁగా కన్నుమూసి తెఱచునంతలో తేజఃపుంజంబులు (23,250) ఇరువదిమూఁడు వేల, రెండు వందల, యేఁబ దామడల దూరము వ్యాపింపఁగలవు. అట్టి తేజంబు చంద్రమండలమునుండి యిటకుం జేర నొక్కక్షణంబును, క్షణపాదంబును మాత్రమే పట్టును.

రుద్రమదేవి—అట్లయినఁ జంద్రమండల మీ భూమికి (30,000) ముప్పదివే లామడల దూరమున నున్నదా?

లీలావతి—గణితంబున ప్రభువుల సూక్ష్మవివేకము అపరిమితమైనది. మహారాజ్ఞీ! తేజఃపుంజంబులు సూర్యమండలమునుండి ఈ భూగోళంబునకు వ్యాపించుటకు ఘటికలో పాదంబే యగుచున్నది.

రుద్రమదేవి—(కొంచెము యోచించి) అందుచే భానుబింబంబు భూమికి (1,16,25,000) ఒక కోటి,పదునాఱు లక్షల, యిరువదియైదువే లామడల దవ్వున నున్న దని తలంపవలెను.

లీలావతి—మేలు తల్లీ! నీ బుద్ధిసూక్ష్మతకు మెచ్చితి. మఱియు నట్టి తేజఃప్రసారంబు సూర్యమండ లావృత గ్రహకోటిలో నన్నిటికిని దూరస్థం బగు వెలుపలి కక్ష్యాపథంబున జరించు నభస్థానమండలంబునకు నడచుటకు నాల్గు హోరల కాలంబు కాఁగలదు.

రుద్రమదేవి—(నవ్వుచు) ఎల్లెట్లూ! ఇఁక భూమిపై మనము వాహకచేయు నిడివికొలఁది లందుట లేదే!

లీలావతి—తల్లీ! అందనిదే నిజము. ఇంక నత్యంత దూరస్థంబు లగు నక్షత్రంబుల వఱకు నుండు నంతరాళ పరిమితి నెఱుంగఁజేయుటకు తేజస్సు వ్యాపించు కాలమును ఇన్ని వత్సరంబు లనుచు లెక్కింపఁదగుఁ గాని యామడల లెక్కయక్కఱకురాదు.

తే. వేగ నిరువదియునుమూఁడువేలు, రెండు
నూఱు లేఁబది యామడల్ దూర మేగు
నొక్క త్రుటిలోన వెలు; గద్ది పెక్కు నెలల
యేండ్ల పయనంబునసె తార సెనయఁ గల్గు.

ఆ. అట్టి కాంతిసత్వ మంబరంబునఁ బర్వ
నాకసమునఁ ద్రిప్పునట్టి ఘనులు
ఆ ఖగోళనాథు లవ్యాహతంబైన
శక్తి యుక్తు లనుట సాహసంబె!

ఆ మహామూర్తులనుండి వ్యాపించు విద్యుత్కాంతి పుంజంబుల పటిమంబునకు దవ్వు దా పను భేదము కలదా!

రుద్రమదేవి—అట్లయిన నీవుచెప్పిన మహావ్యాయామపరిమాణ మూహింప సూర్యమండలంబు కంటె నన్నివిధములఁ బెక్కుమడుఁగు లధికంబు లా తారామండలంబు లని తోఁచెడిని.

లీలావతి—అమ్మా! నిజస్థితియు నట్టిదే.

ఆ. ధరణికంటె వేలతరములు భానుండు,
వతనికంటె తార లధిక-మయిన

మండలాప్తి వెల్గుచుండుట యోచింప
మదికి వచ్చు సృష్టి మహిమ కొంత.

తే. ఇట్టి సృష్టి చేయఁగఁజాలు నట్టి యజుని
జడత వాపుటకై సరస్వతి నొసంగి,
జగము వెలిగింప రవికిఁ దేజము నమర్చె
నెవ్వఁ డవ్వాని మహిమంబు నెన్నఁ దరమె!

రుద్రమదేవి—అది యవాఙ్మానసగోచరమే. నీవు తేటపఱిచిన విషయము లద్భుతావహంబులు లీలావతీ!

లీలావతి—ఇంతకంటె నత్యద్భుతంబు లగు సృష్టిరహస్యంబుల యోగచక్షుర్బలంబున వీక్షించి, లోకంబున కెఱింగించుటకై యార్యవర్యులైన పూర్వఋషులు వానిని గ్రంథస్థంబు లుగఁ జేసియున్నారు.

రుద్రమదేవి—గ్రంథంబు లన జ్ఞప్తికి వచ్చె. రుదాగ్రంబికాలయంబునందున్న జ్యోతిర్గ్రంథంబులఁ గూర్చి మరల నడుగకపోతివి?

లీలావతి—మహారాజ్ఞీ! దూరస్థం బగు మా జన్మదేశంబునుండి వచ్చి, తద్గ్రంథములకొఱకై పూజ్యులగు నాతండ్రి భాస్కరాచార్యులును నేనును ప్రభువుల నాశ్రయించితి మని తమ మనంబున నుండ నేనవ్వానిఁగూర్చి మఱలమఱల విన్నవించుట తగునా!

రుద్రమదేవి—మన నగరమున మొన్న జరిగిన జ్యోతిర్విద్యా పరిషత్తునందు మీ తండ్రిగారు జ్యోతిర్విద్యనుగూర్చియు, పలువురకు వ్యతిరేకముగ నేదో వ్యక్తిస్వాతంత్ర్యమును గూర్చియు నుపన్యసించెద రని వింటిని. అట్టివానికి జ్యోతిర్విద్యా వ్యాసంగము, జ్యోతిర్గ్రంథ సంపాదన ప్రయత్నము నెందులకు?

లీలావతి—అమ్మా! వ్యతిరేకమనుటకంటె వారు నుడివినది నూత్నవిషయ మనదగును. అనఁగా సర్వము గ్రహబలాధీన మని నేటివఱకు పలువుర యభిప్రాయము. వ్యక్తిస్వాతంత్ర్యము గ్రహబలమును అతిక్రమింపవచ్చు నని వారి యభిప్రాయము. దీని నిరూపించుటకే జ్యోతిర్విద్యా వ్యాసంగమును వారు నిరంతరము సేయుచు, నా నుడివిన గ్రంథముల పరీక్షించుకొఱకు తమ సెలవుఁ గోరుచున్నారు.

రుద్రమదేవి—ఈ గ్రంథముల వెలికిఁ దీయింప మా తండ్రిగారు ప్రయత్నించినప్పుడు కాళి దుర్ఘటంబగు కాంక్షఁ జేసె నని వినియుంటివికదా?

లీలావతి—వింటిని. కాని అది యెట్టి దని యెఱుంగను.

రుద్రమదేవి—ఇష్టం వెలిఁగెదుగాక! వకుళా!

వకుళ—(ప్రవేశించి మహారాజ్ఞికి నమస్కరించును.)

రుద్రమదేవి—మెట్లప్రక్క గదిలోని ఎఱ్ఱ గవిసెన కల చిన్నదంతపుపెట్టె నీవు తెమ్ము.

వకుళ—అనుజ్ఞ. (నిష్క్రమించును.)

రుద్రమదేవి—లీలావతీ! కాళి కోరిన కోరిక బహు దుర్ఘటమైనది. అసంభావిత మని కూడఁ దలంచితిని. తీక్ష్ణబుద్ధి కల నీ వేమయిన సమంజసార్థముఁ దీయఁగలవేమో చూతము. ఏమే! ఎంత యాలస్యము!

[తెరలో]

అమ్మా! వచ్చితిని.

[ప్రవేశము—పెట్టెతోడ చేటి.]

రుద్రమదేవి—ఆ చిన్నబల్లపై నునిచి పొమ్ము.



(చేటి అట్లు చేసి మహారాజ్ఞికి నమస్కరించి నిష్క్రమించును.)

రుద్రమదేవి—లీలావతీ! ఈ తాళపుచెవితో నా పెట్టె తీయుము. (లీలావతి అట్లు చేయును.)

లీలావతి—తెఱచితి. ఏమి యుత్తరువు?

రుద్రమదేవి—పచ్చపట్టుదారము కట్టియుంచిన భూర్జపత్రముల రెంటి నిట్లిమ్ము. (పుచ్చుకొని) చూచితివా? మీరు కోరెడి పుస్తకముం గూర్చిన శిలాశాసనసమస్యను ఈ చీటియందు లిఖింపఁజేసి, మా తండ్రిగా రిందుంచిరి. దీని ననేకపర్యాయములు చదివినను నాకు సుబోధం బైనదికాదు. నీవు చదువుము. ఇదిగో చీటి.

లీలావతి—(పుచ్చుకొని)

ఆ. "గ్రంథములను గోరు కన్య ద్విజాంగన
పెండ్లివేళఁ దనదు ప్రియునిఁ గూడి,
వేయి మంది నాకు వేడుక బలి యిచ్చి,
బ్రహ్మచర్య దీక్షఁ బడయ వలయు."

(మఱలఁ జదివి యోచించును.)

రుద్రమదేవి—ఇది గ్రంథప్రచారణము నిచ్చగింపని కొందఱు మూఢులచే నేర్పఱుపఁబడి భావరహితమైన దబ్బరవాక్యమేమో యని మా తండ్రిగారు సందేహించి, ఆగామిక నియమంబు పాటింపక, దేవికి ఇతర పూజాదికము లొసఁగి, బలిద్వారము దెలుపింపఁ జూచిరి. అంతట కాళీవిగ్రహమునకు మోము చెమర్చెననియు, నది కాంచి గుఱుంచు ప్రయత్నముల మాన్పించి, శాసనంబున కర్థము చెప్పఁడని మహారాజు పండితులఁ గోరఁగా వారు ఇదమిత్థ మని నిశ్చయింపఁ జాలకుండిరనియు, మా తండ్రిగారివలననే వింటిమి. ఏదియో విధమగు నర్థముం దీయుదమన్నను పద్యమునం దొకదానికొకటి యసంబద్ధముగ నున్నది. కాని పద్యము మొదటిభాగమున నా కొక్కటి సూచితమగుచున్నది.

లీలావతి—వినెదను.

రుద్రమదేవి—(నవ్వి) అందు సూచింపఁబడిన ద్విజాంగనవు నీవని.

లీలావతి—అది నాయెడ నెట్లు వర్తించును?

రుద్రమదేవి—వర్తించునట్లు చేయు భారము మాది.

లీలావతి—తమ గంభీరోక్తుల యభిప్రాయ మెఱుంగ లేకున్నదానను.

రుద్రమదేవి—తేటపఱతును. మీ యాత్రేయశాఖఁ జెందిన మా కెంచనమంత్రికి పెద్ద కుమారుండును, రాజ్య కోశాధికారియు నగు రాఘవశర్మను గూర్చి వినియుంటివా?

లీలావతి—హాస్యభాషాశీలుం డని వినియుంటిని.

రుద్రమదేవి—వేడుకగ మాటలాడువాఁ డయ్యును మహా మేధావి. నీకుఁ దగిన వయసుగల యువకుఁడు. అతనిపై నీ కహితము లేదని మాయుద్దేశము. నిన్నాతనికి పరిణయ మొనర్చుట మాకు సమ్మత మని మీ తండ్రిగారికిఁ దెలియఁజేసియుంటిమి.

లీలావతి—దేశముఁ బాలించు మహారాజ్ఞి యవివాహితయై యుండఁగా నా పెండ్లికై తొందర యేల?

రుద్రమదేవి—(నవ్వి) ఆ విషయ మట్లుండనిమ్ము. కడమ రెండుపాదములయం దుండు భావ మేమి? వివాహమునకు సంసిద్ధమైన కాంత వేయిమందిని బలియిచ్చుటెట్లు? మఱల నామె బ్రహ్మచారిణి యగుటెట్లు?

లీలావతి—ఇదియే యసంభవముగ నున్నది. అమ్మా! సెలవైనచో నీ పద్యమునందలి గూఢార్థము మా నాన్నగారి నడిగెదను.

రుద్రమదేవి—అటంక మేమి? వారి యభిప్రాయమును వేగమే మాకుఁ దెలియఁజేయుము.

లీలావతి—విధేయను.

రుద్రమదేవి—ఈ చీటి నెప్పటియట్ల భద్రపఱిచి, తాళపుచెవి నిట్లిమ్ము. (లీలావతి అట్లు చేయును.) చోళరాజ్యసహాయమునకై బసవదండనాథుఁడు ససైన్యముగ నెల్లి ప్రొద్దునఁ బంపఁబడుచున్నవాఁడు. అతఁడు నేఁటిసభలో సెలవుఁ గైకొనుటకై వచ్చును. కావున సభాయోగ్యమగు వస్త్రధారణ మొనర్చుకొన సమయ మైనదేమో ప్రక్క గదిలోని హోరాయంత్రమును చూడుము.

లీలావతి—(చూచి వచ్చి) ప్రభూ! సమయ మైనది. స్త్రీస్వభావంబుఁ గలిగిన పూర్ణచంద్రుండు తారామండలంబునం బ్రకాశించునట్లు కామినీమణియైన తాము ఖడ్గాదులతోడ వీరపురుషోచిత సపరివారంబుగ సింహాసనంబున నుండుటఁ జూడ నా కెంతయో కన్నుల పండువుగ నుండును. కాని తల్లీ! క్షమింపఁబడుదునుగాక! నీ ముఖవైఖరి యంతర్గత సంతాపంబును సూచించుచున్నదే?

రుద్రమదేవి—(నిట్టూర్పు విడిచి) సామ్రాజ్యవాహకులకు సంతాపముల కేమికొఱంత?

లీలావతి—ప్రభువుల సంతాప ముపశమించునుగాక.

రుద్రమదేవి—(కొంచెము విరమించి) లీలావతీ! మన మాట వినని వారినిగూర్చియే మనస్సు అంతగ సంకటపడునేమి?

లీలావతి—తల్లీ! అది స్త్రీస్వభావ మని గ్రంథములలోని పెద్దల చరిత్రలే తెలుపును.

గీ. జడత నీటిలోఁ బడి పోవు జడుని కంటె
ఈది పెనఁగెడు వానినే యేరు కాచు
వంగి తనమాట వినుచుండు వాని కంటె
వినక తను నేలు మగవాని వనిత మెచ్చు.

గీ. తమకు భిన్నమౌ నన్యోన్య తత్త్వములకు
తమకపడుటయే స్త్రీపుంస తత్త్వమేమొ
లలితవల్లిక ఘనశాఖ నలము కొనఁగ
నవ్యతరుశాఖ లతికకై నమ్ర మగును.

రుద్రమదేవి—బసవన్నతో వోళయుద్ధములకు......తానుకూడ పోయెద ననుచున్నాఁడు.

లీలావతి—మల్లికార్జునవర్మయుఁ బోయెద ననుచున్నాఁడా!

రుద్రమదేవి—అవును. వారింపు మని రేచర్ల ప్రసాదాదిత్యునకు సూచింపఁబడినది.

లీలావతి—పూర్వులగు గణపతిచక్రవర్తినాఁటినుండియు కాకతీరాజులకు కుడిభుజ మగు రేచర్ల ప్రసాదాదిత్యులవారి మాట నాతఁడు వినక నిరాకరించునా?

రుద్రమదేవి—వినవలెననియే నా కోరిక. మఱియు రాఘవశర్మకూడ నేఁటిసభలో సెలవుఁ గైకొని ధాన్యవతీనగరమునకుఁ బోవనున్నాఁడు.

లీలావతి—(ఉద్వేగముతో) ధాన్యవతీనగర మాతని మేనమామగారి యూరఁటకదా తల్లీ!

రుద్రమదేవి—(నవ్వి) నిజమే. ఐనను భయపడకుము. ఆతని మేనమామకు కొమార్తలు లేరఁట. మఱియు నాతఁడు మా ప్రియసోదరి గణపాంబకు మా లేఖను గొని పోవుచున్నాఁడు. ఆయమయొక్కయు, ఆమె భర్తయొక్కయు క్షేమము తెలిసి చాలకాల మైనది.

[మహారాజ్ఞి లేవఁగా తెర దిగును.]

---

తృతీయాంకము—ప్రథమ రంగము—సంపూర్ణము.

## తృతీయాంకము.

### ద్వితీయరంగము.



ప్రదేశము:—ఓరుగంటిరాజుల కొలువు కూటములో నొక భాగము.

ప్రవేశము:—మల్లికార్జున వర్మ, రాఘవ వర్మ, బసవన్న, ప్రసాదాదిత్యులు.

మల్లికార్జునవర్మ—బసవన్నా! నేనుకూడ నీతోడ చోళయుద్ధంబుల కేల రాఁగూడదు?

బసవన్న—మల్లికార్జునా! నీవు రాకుండుటకుఁ గారణము లున్నవి. నీ మిత్రుఁ డగు రాఘవశర్మ నడుగుము.

రాఘవశర్మ—అడుగకముందే చెప్పెదను. మల్లికార్జునా! ఎవ్వరియాజ్ఞను శిరసావహించి ఈ దండనాథు లందఱు సమరములఁ గట్టి పోరికి నడచుచున్నారో యట్టి ప్రభువే యనుమతింపనప్పుడు సుఖముగ నొడలు కందకుండ నింటఁ గూర్చుండక కత్తివ్రేట్ల కనకము వంటి శరీరము నాయాసపెట్టుకొనఁజూచుటకు నెట్టివాఁడవా?

మల్లికార్జునవర్మ—మిత్రమా! నీ వెప్పుడు నిట్లు హాస్యము లాడుచుందువు. ప్రసాదాదిత్యా! తామైన మహారాజ్ఞితో విన్నవించి, నాకు సమరంబున కేగ ననుజ్ఞ నిప్పింపుఁడు. కీర్తిశేషులగు గణపతిచక్రవర్తివారి కాలంబునం దింక పిన్నవాఁడ నయ్యు నిట్టి నిర్బంధ మెఱుఁగను.

రాఘవశర్మ—ఇప్పుడు పెద్దవాఁడ వగుటచేతనే నిర్బంధము కావలసివచ్చె ననుకొనుము.

ప్రసాదాదిత్యుఁడు—మల్లికార్జునా! నా వచనము నాలింపుము. ఆంధ్రసామ్రాజ్యము నిప్పుడు నీ మఱఁదలగు రుద్రాంబామహారాజ్ఞి పరిపాలించుచున్నది. ఆమె యింకను అవివాహిత. ఈ కాకతిసింహాసనముపై నధివసింపఁదగిన పురుషసింహకిశోరము ఆమెకు జనించునప్పుడే కాకతివంశంబునకు భూలోకంబునను, దివంబునను కీర్తి నిలిచిన ట్లగును. ఇఁక నీవు మా రాణికి మేనత్త కుమారుఁడవు. భర్తవు గానున్నావు. అట్టి నిన్నిప్పు డనావశ్యకముగ నపాయంబునఁ బెట్టుట ఈ త్రిలింగాంధ్రసామ్రాజ్యక్షేమము కోరు మా కెవ్వరకు నిష్టము కాదు.

మల్లికార్జునుఁడు—అట్లయిన నా కెప్పుడీ పురుషరాణివాస మేనా!

రాఘవశర్మ—ఓహో! మహారాజునంతటివానికేకాక పురుషరాణివాసము సామాన్యులకు సిద్ధించునటోయి మిత్రమా!

మల్లికార్జునుఁడు—మిత్రులారా! వినుఁడు.

చ. పురుషులచే సతుల్ ప్రియపూర్వకరక్షణఁ బొందుచుండుటల్
సరియగుఁగాని కామినులచాటున, సాహసహీనవృత్తి, సం
గరవిముఖత్వ మూని, సుకరారణ మేదియొ కల్గునంచు, నే
పురుషవరుల్ రణస్థలికిఁ బోవఁగ నింట వసింప నేర్తురే!

ఉ. నిక్కువ మేను రుద్రమయ నెమ్మికఁ శైశవమాది యుండుటల్;
నిక్కువ మామె తండ్రి యది నెయ్యముగం గను; మైన శౌర్యముల్
దక్కి, మగల్ సముల్ సగువిధంబునఁ—గాకతిరాజ్యలక్ష్మి తా
నెక్కువ యానుగాక—యిటు లింతుల చాటున డాఁగి యుందునే!

ప్రోలాదిత్యుఁడు—తొందరపడక నా వచనము పూర్తిగ నాలింపుము. నీవు మా మహారాణికి భర్త కాఁదగినవాఁడవు. బాంధవ్యముచేతనేగాక బలమైన ప్రేమానుబంధము చేతఁ గూడ మీ యిరువురు నొకరి కొకరే తగియున్నారు. మగవాఁడవైన నీ మనస్థితి మెట్లున్నను మా మహారాజ్ఞి నిన్నుఁ దప్ప మఱియొకని—వివాహము మాట యట్లుండ—కన్నెత్తియైనఁ జూడదు. పూర్వపు సంధిబంధనలఁ బట్టి బసవన్న యేఁగవలసివచ్చును గాని నిజముగా దోశయుద్ధములలో మన కెక్కువ ప్రమేయమే లేదు. ఇఁక స్వారాజ్యమున కావశ్యకము కలుగునెడల నిన్నాఁగుమనువా రుండరు.

మల్లికార్జునుఁడు—ఈవిషయమై నా మనస్థితి మీ కెఱుఁగనిది కాదు. త్రిలింగసామ్రాజ్య సముద్ధరణమునకై అత్యంత శౌర్యరస ప్రదర్శన మొనర్చు మీ యుద్ధముల మధ్యను ఊరక తిని కూర్చుండుట నా కిష్టములేదు. నిర్వీర్యుఁడనై తనకై వేచియుండు నన్ను మీ మహారాజ్ఞి హర్షించిన హర్షించుఁగాక! మెచ్చుటకును, మెప్పునకుం దగినట్లు ప్రేమించుటకును అవకాశ మేది?

బసవన్న—మిత్రమా! తెలుచుగ పై కెగిరించి పావురంపు టెక్కలిరిగి పరీక్షింతుము కాని నాటివడేగకు ఎర చూపునప్పుడేకదా కనుమూఁత తీయుట.

రాఘవశర్మ—మా మహారాణికి ఆమాత్రపు భేదము తెలియునులెమ్ము.

మల్లికార్జునుఁడు—ఏమో! మీ యిచ్చవచ్చినట్లు కానిండు. ఐనను యుద్ధంబున కేగుటకు సెలవు నేఁటి సభలో సింహాసనాసీనుల నడిగెద. (అటుచూచి) అదిగో వెలమనాయకు లందఱును వచ్చుచున్నారు. సభాసమయ మైనట్లున్నది.

[ తెలుగునాయకులు ప్రవేశింతురు. ]

ప్రసాదాదిత్యుఁడు—నయముచేయుఁడు. అందఱును దయచేసి, సభ నలంకరింపుఁడు. ప్రభువులు విచ్చేయు సమయముగూడ నైనది. బిరుదావళి పఠించు భట్టులు వచ్చిరా?

భట్టుమూర్తులు—(ప్రవేశించి) అయ్యా! సిద్ధముగా నున్నాము.

సీ. నీకీర్తి నీమూర్తి నీశౌర్య సంపూర్తి............

ప్రసాదాదిత్యుఁడు—ఆఁగుఁడు డాఁగుఁడు. ప్రభువు సింహాసన మలంకరింపనున్నారు. ముందుగ నుతింపఁబడవలసినది ప్రభువులు.

[ తెరలో ] జే! కాకతీయవంశమునకు జే! ఆంధ్రసామ్రాజ్యలక్ష్మికి జే!

ప్రసాదాదిత్యుఁడు—మహారాజ్ఞి సభ నలంకరింపనున్నారు.

(మంగళవాద్యములు మ్రోఁగును. అందఱును వరుసగ నిలుతురు. స్వపరివారముతో స్త్రీవేషధారిణులగు చేలాదులపై పురుషవేషధారిణులగు కవచకిరీట ఖడ్గాదుల ధరించిన రుద్రాంబా మహారాజ్ఞి ప్రవేశించి, సింహాసనాసీన యగును. రాణి యాజ్ఞానూచనతో నందఱు నుచితాసనములఁ గూర్చుందురు. సింహాసనము ముందు రెండుప్రక్కల పద్మనాయకవీరులు కూర్చుందురు. వారి వెనుక ఈఁటెలుపట్టియుండు భటులు నిలుతురు భట్టుమూర్తులు ప్రభువునకు ఎదుర నొకప్రక్కగ నిలుతురు మహారాజ్ఞికి ఇరుప్రక్కల చామరగ్రాహిణులుందురు. వారితరువాత కొల్వుకూటంబు వెనుకప్రక్క దరుల స్త్రీపరివారము నిలుతురు. వాద్యములు నిలుచును.)

భట్టుమూర్తులలో—ఒకఁడు కుడిచేయి పైకెత్తి)

* శ్లో. యోయం జాతః త్రిలోకీప్రథితసుచరితే కాకతీయాన్వవాయే
యస్మై శ్రేయాం స్యజస్రం వితరతి భగవాన్ దేవదేవ స్స్వయంభూః
యస్యాజ్ఞా సర్వ పృథ్వీపతి మకుట మణిశ్రేణి కేళీనయస్యా
సోయం భూపాలమార్గ జ్జయతి గుణమహాన్ రుద్రదేవో నరేశః.

ఇంకొకఁడు— * శ్లో. యో రుద్రో రజతాచలేస్థితి మగా దర్ధాంగ నారీః పురా
సోయం సంప్రతి కాకతీశ్వరకులే సర్వాంగనారీ స్థితః
స్థానే యద్విషమావలోకనకళామాత్రేణ భస్మీకృతా
న్యాసన్ వైరిపురాణి చిత్రమధునా ఖడ్గే విషం ధార్యతే.

ఇంకొకఁడు— * శ్లో. సైషా సోమాచేతి నిర్దిష్టా
సోమాచేతి ప్రథామగాత్

---

* ప్రతాపరుద్రీయము లోనివి.

తవ మాతా శివా సాక్షా
ద్దేవో గణపతిః పితా.

ముకిసౌలికుఁడు—సీ. జయ నభోమణికుల సదమలాలంకార
జయ కాకతీంద్రవంశప్రదీప!
జయ బాహువీర్య సంస్థాపిత సామ్రాజ్య!
జయ రాజసామంత సంప్రపూజ్య!
జయ ఖడ్గశాసిత సకల శాత్రవ జాల!
జయ మిత్రనృపబద్ధ సమయపాల!
జయ శాస్త్రనిగదిత సద్ధర్మ పరిపోష!
జయ పద్మనాయకశౌర్య భూష!

గీ. జయ యనంతసేనాయుక్త! నయ నియుక్త!
జయ సకలసౌమ్యమహిత! సాధు సహిత!
జయ నిజాశ్రితజన పక్ష! సత్య రక్ష!
జయ యశఃకామ! శ్రీ రుద్ర సార్వభౌమ!

ఇంకొకఁడు—సీ. విక్రమార్కునితోడ వెలసి తాతకు తాత
మాన్యుఁడౌ త్రిభువనమల్లనృపుఁడు
అణఁచె తాతకు తండ్రి యరులైన చాళుక్య
భూపుల కాకతిప్రోలరాజు
మహిత త్రిలింగసామ్రాజ్యంబు నెలకొల్పె
తాత ప్రతాపరుద్ర ప్రభుండు
భిల్లమ యాదవ ప్రబలసేనల గెల్చె
తండ్రి శ్రీ గణనాథ ధారుణీశుఁ

గీ. ఇట్టి మీపూర్వులు గణించినట్టి యశము
పెంపు గాంచంగ శాత్రవుల్ భీతిలంగ
వెలయు నేకశిలారాజ్య విపుల విభవ
భద్ర పదభావ! కాకతి రుద్రదేవ!

వేరొకఁడు—సీ. లలిత కోమలమైన లలనాప్రకృతితోడ
వీరపూరుషసాధ్య ధీర ఫణితి
వరతరాంతఃపుర వాస సమ్మతితోడ
కదనభూవిహరణ కౌశలంబు

నునుచేతి తమ్మిమెత్తని కేల నసి తోడ
భూభార సంవాహ భుజబలంబు
మృదుల సుస్నిగ్ధ దృక్ప్రేమని ప్రభతోడ
నరి భీకరేక్షణ పాటవంబు

తే. గలుగ నానూంకసంప్రాప్తిఁ గాంచఁ నిలఁచి
భువిని సోమాంబ కీనయ్యె శిశువు పుట్టి;
నింక నినుఁ బౌరుషాఖ్యచే నెన్నఁ దగదె!
దివ్యగుణసాంద్ర! కాకతిరాజచంద్ర!

(మహారాజ్ఞి కుడిచేయి కొంచెము ఎత్తఁగా భట్టుమూర్తులు ప్రభువునకు నమస్కరించి, విరమించి, వెనుకకు తగ్గి, నిలుతురు.)

రుద్రమదేవి—ప్రసాదాదిత్య దండనాథా! మహామంత్రి శివదేవయ్యగారింకను సభకు రాలేదా?

ప్రసాదాదిత్యుఁడు—వ్యవహారాంతర నిమగ్నులై యుండి నేఁడు నా మూలమున సార్వభౌములకభివందనంబుల నంపిరి.

రుద్రమదేవి—పద్మనాయకవీర బిరుదపాఠము కానిచ్చును.

(ప్రసాదాదిత్యుఁడు సింహాసనము చెంత కేగి, తదభిముఖుఁడై, కొంచెము ప్రక్కగ నిలుచును.)

(భట్టుమూర్తులు మరల ముందుకు వచ్చి ఒక్కఁడు కుడిచేయి యెత్తి, బిరుదులు చదువుచుండఁగా తక్కినవారు జయశబ్దములు చెప్పుచుందురు. ఒక్కొక దండనాథుఁడు సింహాసనముచెంత కేగి, ఎడమచేతిలో కత్తిపరను కుడిచేతితో కత్తిపిడిని పట్టుకొని, నిశ్చలుఁడై మహారాజ్ఞికి అభిముఖుండై నిలువఁగా, బిరుదపాఠము భట్టుమూర్తి పఠించుచుండును. ఒక్కొక దండనాథుని బిరుదపాఠము "వంశపయః పారావార సుధాకర" అను పదముతో ముగిసినతోడనే ఆ దండనాథుఁడు కుడిచేతిలో కత్తిని, పరనుండి తీసి, పైకెత్తి, మహారాజ్ఞికి అభివాదన మొనర్చి, కత్తిని పరలోనికి దింపి, వెనుకనడకతో తన చోటును చేరి కూర్చుండును. ఇది అభివాదన క్రమము.)

1 వ భట్టుమూర్తి—పంచ వాద్యోయ దళ విశాల!

తక్కిన భట్టుమూర్తులు— ... ... ...జయ,

1 వ భట్టుమూర్తి—కాకతిరాజ్య స్థాపనాచార్య!

తక్కిన భట్టుమూర్తులు— ... ... ...జయ,

1 వ భట్టుమూర్తి—చలమర్తిగండా!

తక్కిన భట్టుమూర్తులు— ... ... ...జయ,

1 వ భట్టుమూర్తి—జల్లికట్టి పరక్షేత్ర శోభాపాత్రీకరణ!

తక్కిన భట్టుమూర్తులు— ... ... ...జయ,

1 వ భట్టుమూర్తి—సోమకుల పరశురామ!

తక్కిన భట్టుమూర్తులు— ... ... ...జయ,

1 వ భట్టుమూర్తి—యంబిరుదగండ సర్వబిరుదాంకుమార!

తక్కిన భట్టుమూర్తులు— ... ... ...జయ,

1 వ భట్టుమూర్తి—రాయవేశ్యా భుజంగ!

తక్కిన భట్టుమూర్తులు— ... ... ...జయ,

1 వ భట్టుమూర్తి—అమరగండ పురవరాధీశ్వర!

తక్కిన భట్టుమూర్తులు— ... ... ...జయ,

1 వ భట్టుమూర్తి—రాయగోపాల!

తక్కిన భట్టుమూర్తులు— ... ... ...జయ,

1 వ భట్టుమూర్తి—కంచి కవాట చూరకార!

తక్కిన భట్టుమూర్తులు— ... ... ...జయ,

1 వ భట్టుమూర్తి—చేచన్నవంశ పయఃపారావార రాకాసుధాకర!

తక్కిన భట్టుమూర్తులు— ... ... ...జయ విజయీభవ!

(ప్రసాదాదిత్యుఁడు కత్తిని యెత్తి, ప్రభువులకు అభివాదనము పట్టి, వెనుకనడకతో తన స్థానమునకు తిరిగి వచ్చును. ఇట్లీ కొలువునందు పద్మనాయకవీరు లందఱును ఒకరితర్వాత నొకరు వారివారి గోత్రబిరుదములు పఠింపఁబడునప్పుడు అభివాదనము పట్టుదురు. తక్కినవారి బిరుదముల కొఱకు అనుబంధమును చూచునది. బిరుదపాఠములు ముగియఁగనే భట్టుమూర్తులు ప్రభునకు మఱల నమస్కరించి, ఒకప్రక్కకు, ఒదిగి, నిలిచెదరు)

రుద్రమదేవి—నేఁటి సభావిషయ మేమి?

ప్రసాదాదిత్యుఁడు—బసవన్నా లెమ్ము.

బసవన్న—శ్రీమన్మహారాజాధిరాజ సార్వభౌముల యానతిని చోళరాజ సహాయార్థమై ససైన్యముగ వెడలుట కనుజ్ఞఁ గోరుచున్నాఁడను.

రుద్రమదేవి—దండయాత్రకు వలయు సాధనము లన్నియు సమకూర్పఁబడినవా!

బసవన్న—అన్నియు సంసిద్ధము లను విషయము నేఁటి యుదయమున తీరినిలిచిన సైన్యములను అశ్వారోహులై పరీక్షించిన సార్వభౌములకు విదితమే. అయినను వివరముగ విన్నవింతును.

సీ. శస్త్రసాధనముల సానలఁ దీర్పించి,
దుస్తు ముస్తీనుల సిస్తు పఱచి,
వ్యూహముల్ కట్టించి యుద్ధపద్ధతి నేర్పి,
సైనిక పటిమంబు చక్కఁ జూచి,
చిన్న చీకులు లేని శిబిరముల్ సమకూర్చి
భండారము ధనంబు నిండఁ జేర్చి,
బండ్ల నొంటెలమీఁద బరువుల నెత్తించి,
తనగంపు టెడ్ల సంతన యొనర్చి,
తే. చారులను గాంచి సంబార సాధకులను
మార్గకారుల ముందంపి, మన పురంపు
దైవములఁ గొల్చి, తమ యాజ్ఞ తల ధరించి,
నడుములం గట్టి, నాయకుల్ నడువఁ గలరు.

రుద్రమదేవి—మీకు సంపూర్ణవిజయంబు చేకుఱి, ఇదివఱకు గడించిన "స్వాధిరాజ్యస్థాపనాచార్య" బిరుదంబును సద్వితీయంబుగా నొనర్చుకొనవలయును.

బసవన్న—ప్రభువుల యుద్దేశముతో పెద్దల యాశీర్వచనము, దైవ సహాయము తోడై, తావకాజ్ఞాపరిపాలనమును నిరవశేషముగ నెఱవేర్పఁగలవు.

ప్రసాదాదిత్యుఁడు—సందేహమేమి? పరభయంకరు లగు విప్పర్లగోత్ర వీరులు శౌర్యనిధియు ననుభవశాలియు నగు బసవన్న వెంట నేగుచోఁ బ్రభువుల యాదేశపూర్తికిని చోళ నృపాలవాంఛాపూర్తికిని ఏ యంతరాయమును గలుగదు. విప్పర్లవారి ఘనత మన మెఱుఁగనిదా!

సీ. చండ దోర్దండ ప్రకాండ మండిత రణ
పాండిత్య ఘనులు విప్పర్లవారు
సకల శాత్రవ భీత సమర కేళీ లోల
పటు శౌర్యనిధులు విప్పర్ల వారు

గజ వాజి యాన సక్రమ విక్రమోత్సాహ
సార ధీయుతులు విప్పర్లవారు
సర్వ సైన్యవ్యూహ సార భేదోపాయ
పరమమర్మ విదులు విప్పర్లవారు

తే. అట్టి విప్పర్లగోత్రజు లాదియైన
వీరనికరంబు చతురంగ విభవ మెసఁగ,
దనదు యాజ్ఞానువర్తనఁ దనరి నడువ,
బసవ దండనాథున కలభ్యంబు కలదె!

బసవన్న—వాత్సల్యముచేత నన్నుత్సాహపఱుచుటకు తా మనిన సర్వ మంత్రియు సార్వభౌముని యాజ్ఞాబలములో నున్నది. కాని మాలో నేమున్నది!

రుద్రమాదేవి—విప్పర్లగోత్ర వీరులయొక్కయు, బసవదండనాథులయొక్కయు శౌర్య సాహసములు మే మెఱిఁగినవే! వారి దక్షిణ దండయాత్రా విజయము మా కానందకరమైనట్లే! మఱియు నట్టి విజయంబు ధర్మానుసారంబుగ జరుగవలయును.

బసవన్న—ప్రభువుల యుద్దేశ మెఱింగితిని. నా విజయంబుచేఁ దమకుఁ జేకుఱు యశంబు ధనాతిమంబై యుండఁగలదు.

సీ. దండులో సైనికుల్ బాటె పల్లెలయందు
చూఱగొట్టకయుండఁ జూచువాఁడ
స్త్రీ బాల వృద్ధులఁ జెందఁగిన రణకోపు
లలఁతి పెట్టఁగనీక యాఁపువాఁడ
తురగాది సైన్యజంతువుల కన్నింటి నాదు
సహజన్ములటు రక్ష సలుపువాఁడ
చేఁ జిక్కినట్టి యే చెనఁటి శాత్రవునైన
సర్వ గౌరవమున నరయువాఁడ

తే. శత్రుశుల్కంబు, భవదీయ సైన్యవిధుల
బలఁగములపాలు బంట్లకుఁ బంచి యిచ్చి,
రాజభాగం బిచటి కంపి, మీ జయంబు
తెలుపు శాసన మెల్లెడ నిలుపువాఁడ.

ప్రసాదాదిత్యుఁడు—మేలు! బసవన్నా! లెస్స నాడితివి.

రుద్రమదేవి—మా. మనస్సంకోచంబుఁ బోఁగొట్టు వాక్యంబు పలికిన బసవ దండనాథు నెడఁ గృతజ్ఞులమగుచు, దక్షిణదండయాత్రకై యనుజ్ఞ నిచ్చుచున్నారము. నేఁటి సభలో నింక విచారణీయాంశము లేమైనఁ గలవా?

రాఘవశర్మ—(ముందుకువచ్చి, ప్రభువునకు నమస్కరించి) రాజ్యకార్యార్థమై ధాన్యవతీనగరంబున కరుగ ప్రభువు ననుజ్ఞను వేఁడుచున్నాఁడను.

రుద్రమదేవి—మా ప్రియసోదరి నభిమానించితి మని తెలుపుఁడు.

రాఘవశర్మ—విధేయుఁడను.

(రాఘవశర్మ వెనుకకు తగ్గఁగా మల్లికార్జునుఁడు ముందుకు వచ్చును)

మల్లికార్జునుఁడు—బసవదండనాథునితోఁ జోళయుద్ధంబుల కేఁగ సార్వభౌము నంగీకారముఁ గోరుచున్నాఁడ.

రుద్రమదేవి—(యోచించి) బసవదండనాథునితో నరుగు సైన్యములో మల్లికార్జునశర్మ కెట్టి యధికారపద మున్నది?

మల్లికార్జునుఁడు—నా కే సైన్యభాగంబుతోడను ప్రమేయము నేర్పఱుపఁబడ లేదు. మన్మాతృమూలమున కాకతీయవీరోత్తముల రక్త మీ శరీరమునఁ గలుగు నా కెట్టి నిర్వ్యాపార స్థితి యహితముగా నున్నది.

రుద్రమదేవి—(యోచించి) బసవదండనాథా! మీతోడ నేఁగు సైన్య మెంత?

బసవన్న—మేమును, మా యనుచరులును, పదివేలమంది. మట్టూన్నాళ్ళ గోత్రవీరులును, వారి యనుచరులును గలిసి మఱియుఁ బదివేలు. సామ్రాజ్యసైన్య మొక పదివేలు. చేరి ముప్పది వేలు.

రుద్రమదేవి—రాష్ట్రసైన్యమునకు మీ యధీననాయకు లెవరు?

బసవన్న—నగరసైన్యాధికారిగ నుండిన వీరమల్లు.

రుద్రమదేవి—ప్రసాదాదిత్యా! నగరసైన్యాధికారమునకు వీరమల్లు దండనాథునకు బదులుగ నెవ్వ రేర్పఱుపఁబడిరి?

ప్రసాదాదిత్యుఁడు—ఇంక నెవ్వరును నియమింపఁబడలేదు. ఇంతవఱకు విప్పర్లవారలును, మట్టూన్నాళ్ళవారును కాచు, రామలక్ష్మణులపేరుగల, నగరోత్తర ప్రాకారభాగంబులం దున్న బురుజులపై యధికారములును నింక నెవరియందు నుంపఁబడలేదు.

రుద్రమదేవి—దక్షిణంబున కేగు దండులో సెట్టిమార్పులును ఆవశ్యకములు కావు. నగర సైన్యాధిపత్యంబునకు మల్లికార్జునవర్మ నియమింపఁబడిరి. రామలక్ష్మణగడీలఁ గాచుటకుఁ బెంపాలవారలను, మీ చేచర్లవారలను, నియమింపుఁడు. వీరోత్తములగు మల్లికార్జునవర్మయొక్క సమరోత్సాహము, సామ్రాజ్యవహనమునఁ బెంపొందుఁగాక. రాజ్యకోశాధికారి మరలి వచ్చువఱకును రెండవమంత్రియే యా యధికారము ను నెఱవేర్చుఁగాక!

ప్రసాదాదిత్యుఁడు—భాగ్యము.

రుద్రమదేవి—స్వయంభూదేవు కరుణ నాంధ్ర సామ్రాజ్యము వర్ధిలుఁగాక!

(మహారాజ్ఞి లేవఁగా సభవా రందఱును లేచి, నమస్కరించి, నిలుతురు.)

భట్టుమూర్తులు—కాకతి సామ్రాజ్యలక్ష్మికి జే!

(తెర దిగును.)



తృతీయాంకము.

తృతీయరంగము.



ప్రదేశము—ఏకశిలానగరములోని భాస్కరాచార్యుని గృహము.

(ప్రవేశము—గ్రంథపరిశీలన మొనర్చు భాస్కరాచారి, గణితమును సాధించు లీలావతి.)

భాస్కరాచారి—అమ్మా! లీలావతీ! ఆ పద్యమునకు నేఁ జెప్పిన యర్థమును మహారాజ్ఞికి విన్నవించితివా!

లీలావతి—విన్నవించితిని.

భాస్కరాచారి—ఎట్లు విన్నవించితివి? వినవలయుఁ జెప్పుము.

లీలావతి—నిన్న సభానంతరమున మహారాజ్ఞి నన్నుఁ గాంచుటతోడనే "నీ తండ్రి భాస్కరాచారి యీ కట్టుపద్యమున కర్థ మేమైనఁ జెప్పఁగలిగెనా?" యని యడిగెను. అప్పుడు నేను ఆపద్యమును జదివి, తాము చెప్పిన యర్థమును విన్నవించితి.

భాస్కరాచారి—మఱల నా పద్యముఁ జదివి తాత్పర్యము చెప్పుము. నేను చెప్పిన దంతయు సరిగ ప్రభుసన్నిధిలో విన్నవించితివో లేదో చూచెదను.

లీలావతి—“ఆ. గ్రంథ ములను గోరు కన్య ద్విజాంగన
పెండ్లి వేళఁ దనదు ప్రియునిఁ గూడి
వేయి మంది నాకు వేడుక బలి యిచ్చి
బ్రహ్మచర్య దీక్షఁ బూనియ వలయు.”

కాళికాలయములోని గుప్తంబులగు గ్రంథములఁ దీయించు ప్రయత్న మొక ద్విజ కన్యకచేఁ జేయింపవలె ననియు, అట్టి కన్యక వివాహసమయంబుననే వరునితోఁ గూడి అట్టి యత్నమునకుఁ బూనుట కాళికి ప్రీతికర మనియు, మొదటి రెండుపాదముల తాత్పర్య మని మనవిచేసితిని.

భాస్కరాచారి—ఆ భావము సరి యని మహారాజ్ఞి యంగీకరించెనా?

లీలావతి—“అంతవఱకు సులభమే. కడమ రెండుపాదముల భావ మేమి?” అని యడిగెను.

భాస్కరాచారి—నీ వేమని బదులు చెప్పితివి?

లీలావతి—“వేయిమంది నాకు వేడుక బలియిచ్చి” అనుచో జీవబలుల నిచ్చుటకు వీలులేని సమయమున మంత్రబలంబున జంతువులఁ గల్పించిన నారికేళఫలంబులను వానికి బదులుగా బలిగా నుపయోగించుట శాస్త్రమర్యాద యని విన్నవించితిని.

భాస్కరాచారి—ప్రభు వేమనెను?

లీలావతి—“కాళి నింత సులభముగా మోసపుచ్చెదవా?” యని నవ్వెను.

భాస్కరాచారి—సరే! తరువాత?

లీలావతి—నాల్గవపాదములో సూచింపఁబడిన బ్రహ్మచర్యదీక్షకుఁ గాలమితి పద్యమునఁ జెప్పఁబడియుండకపోవుటచేత ఒకసంవత్సరము మాత్రమె యా నియమము పాటింపఁ బడుట పద్యభావ మని చెప్పితిని.

భాస్కరాచారి—మంచిది. నీపైఁ బెట్టిన పని నెఱవేర్చితివి. మహారాజ్ఞి యీవిధమగు ప్రయత్నమునకు సమ్మతించెనా?

లీలావతి—ఆలోచించి యుత్తరువు పంపెదననియు, ... ... (సందేహించును.)

భాస్కరాచారి—నీ తండ్రినగు నాముందు సందేహ మేల! చెప్పుము.

లీలావతి—ఆ పద్యమునఁ జెప్పఁబడియుండు కన్యక నీవేయగుటకు సిద్ధముగా నుండునని యుఁ బలికెను.

భాస్కరాచారి—(సంతోషముతో) తల్లీ! మహారాజ్ఞి మనయెడ సుముఖయై పలికెను. కావున మన మదృష్టవంతులమే.

(తెరలో) భాస్కరాచార్యా!

భాస్కరాచారి—అమ్మా! ఎవరో పిలుచుచున్నారు. చూడుము.

(లీలావతి నిష్క్రమించును.)

భాస్కరాచారి—(తనలో) నేను వచ్చిన జ్యోతిర్గ్రంథ సంపాదన కార్యముతో పాటుగ నన్ని కార్యములును సానుకూలముగ నున్నవి. మహారాజ్ఞి వివాహమునకుఁ గూడ ముహూర్తము విచారించుటకు జాతకములు నాకడకుఁ బంపఁబడినవి. ప్రకృత సందర్భములకు తోడుగా మహారాజ్ఞి వివాహముతో నా కొమార్తయగు లీలావతియొక్క వివాహమును, అందుమూలమున జ్యోతిర్గ్రంథ సంపాదనమును గలిసివచ్చునట్లు తోఁచుచున్నది. ఇవన్నియుఁ ద్వరలోనే సమకూడఁగలవు.

ప్రవేశము—లీలావతి.

లీలావతి—తండ్రీ! ప్రసాదాదిత్య దండనాథులు వచ్చియున్నారు.

భాస్కరాచారి—వెంటనే లోనికిఁ దీసికొని రమ్ము.

(లీలావతి నిష్క్రమించును.)

భాస్కరాచారి—(తనలో) మహారాణిగారి వివాహముం గూర్చి విచారించుటకై ప్రసాదాదిత్య దండనాథుఁడు వచ్చియుండనోపు. కొన్ని రాజ్యకార్య సందర్భములఁ బట్టి మహారాణిగారి వివాహము త్వరలోఁ జేయింప నీ రాజ్యసామంతులు, దండనాథులు, ప్రజలును వేగిరపడుచున్నారు.

ప్రవేశము—లీలావతి వెంట ప్రసాదాదిత్యుఁడు.



ప్రసాదాదిత్యుఁడు—భాస్కరాచార్యా! నమస్కారము.

భాస్కరాచారి—శుభమస్తు. శుభమస్తు. దయచేయుఁడు.

(ప్రసాదాదిత్యుఁడు చిత్రాసనముపైఁ గూర్చుండును.)

భాస్కరాచారి—తల్లీ! నీ వేగి యీ గణితమును సాధింపుచుండుము.

(లీలావతి ఫలకముతో నిష్క్రమించును.)

ప్రసాదాదిత్యుఁడు—భాస్కరాచార్యా! రాణిగారియొక్కయు, మల్లికార్జునవర్మయొక్కయు
జాతకముల రెంటిని బరిశీలించితిరా!

భాస్కరాచారి—ఆ! చాలవఱకుఁ బరిశీలించితిని.

ప్రసాదాదిత్యుఁడు—అట్లయిన జాతకములఁబట్టి చూడ వారి కిద్దఱకు ననుకూల దాంపత్య యోగములు కనిపించినవా?

భాస్కరాచారి—దండనాథా! అట్టి యోగము భగవంతుఁడే నిశ్చయించినాఁడు. లేకున్నచో వారిద్దఱను సమరూపయౌవనులుగ, అన్యోన్యానురాగ పాత్రులుగ, బావమఱఁదండ్రుగా నీ కల్లోలసమయములం దొక్కచో విధి పుట్టించియుండునా?

ప్రసాదాదిత్యుఁడు—సందర్భముల యనుకూల్య మట్లే యున్నది. చిరకాలమునుండి యీ రాజకుటుంబమునందుఁ గల భక్తిచే మా కందఱకును సంకల్ప మట్లనే యున్నది. త్వరలో మహారాణిగారికి వివాహము చేయించి, ఏకశిలానగరసింహాసనముపై పురుష సింహకిశోరము నధివసింపఁజేయవలయు నని ముచ్చటపడుచున్నాము.

భాస్కరాచారి—అయిన నా కొక సందేహము. మన మహారాజ్ఞిని పరిణయంబు కాఁగోరు స్వతంత్రరాజ్యాధిపతు లనేకు లుండరుకదా. వా రందఱకంటెను యిల్లటపుటల్లుఁడగు మల్లికార్జునునే మీరు కోరుటేల?

ప్రసాదాదిత్యుఁడు—దానికి ప్రబలమైన కారణము లున్నవి. కీర్తిశేషులగు గణపతిచక్రవర్తిగారి యాదేశ మట్లే యుండెడిది. కావున తమ మేనల్లుఁడగు మల్లికార్జునిని, కొమార్తెయగు రుద్రాంబను, వారు తమతోఁగూడ దండయాత్రలఁ ద్రిప్పుకొనుచు వచ్చిరి. అప్పటినుండియు తన హృదయఫలకమునందుఁ జిత్రించుకొనిన మల్లికార్జుననృపునేకాని రుద్రమాదేవి వేఱొక రాజకుమారుని పాణిగ్రహణం బొనర్చుటకు ఒప్పనేరదు. పోనీ. ఆమెను వేఱొక స్వతంత్ర రాజ్యాధిపతి కుమారునికి వివాహము చేయుద మనుకొన్నను, ఆతఁడు మా రుద్రమతోపాటుగ ఓరుగంటిరాజ్యమును గూడ స్వీకరించి, తన రాష్ట్రములోఁ గలుపుకొనుటకుఁ బ్రయత్నించును. అందుచే నింతకాలమునుండి నిరంకుశస్వాతంత్ర్యము నొప్పిన యీ త్రిలింగమహాసామ్రాజ్య మొక మాండలిక రాష్ట్రమగును. మఱియు నింతకాలమును ఈరాజ్యపదవిమూఁ, పౌరుషముతో బ్రతికిన మే మందఱమును మాచే పలునాళ్లోడింపఁబడిన యే రాజులనో యాశ్రయించుట కొప్పుకొనవలసివచ్చును. లేదా రాజ్యకల్లోలమునకైన సిద్ధపడవలెను. అవిప్రులఁబట్టియైన పోదురుగాని యిట్టిపద్ధతికి ఆంధ్రవీరులు ఒప్పుకొనరు. కావున నీ కాకతిరాజకుటుంబమునకు సమీపబంధువుఁడగు మల్లికార్జుననృపుఁడే మా రాణికిఁ దగిన వరుఁడుగ మా కందఱకును దోఁచినాఁడు. ఇఁక నాతని జాతకవిషయ మెట్లున్నదో తాము సెలవీయవలయును.

భాస్కరాచారి—ఎట్లుండుటేమి! దివ్యముగ నున్నది. అయ్యా! చూచితిరా! దీనిలో నొక్క రహస్య మున్నది.

తే. ఆత్మలో దృఢతరమగునట్టి పూన్కి-
మంచి యోచించి మీవంటి మనుజవరులు
చేయఁదలఁచిన కార్యంబు శీఘ్రకాల
ఫలితమై తీరు గ్రహయోగబలముకలిమి.

తే. మంచిచెడుగుల సూచించు మహితయోగ
కారులౌ గ్రహపూరుషుల్ కలుగఁజేయు
మిశ్రఫలముల వివరించి మేలుకీళ్లు
సూఁచి యితమిత్థ మనుటయు దుర్ఘటంబు.

తే. మదిని మీ రెంచు కార్యంబు మంచిదైన
సద్గ్రహానుకూల్యంబును, శత్రుయోగ
కరణ శాంతియు, యోచించి కార్యసుఫల
సరణి నెఱిఁగింత్రు జ్యోతిషశాస్త్రవిదులు.

ప్రసాదాదిత్యుఁడు—(నవ్వి) అట్లయిన "మనోజయఁతు మాండవ్య" మనియే తమయుద్దేశమా?

భాస్కరాచార్యు—కాదా? తమయభిప్రాయమో?

ప్రసాదాదిత్యుఁడు—నా యభిప్రాయమును నాచేతిలోని కత్తి యెఱుఁగును. నే నెఱుంగను. కాని యేదియెట్లున్నదో జాతకములఁ బరీక్షించుట మర్యాదకదా?

భాస్కరాచార్యు—అవును. కావుననే యిటు చిత్తగింపుఁడు. ఇది రుద్రమాదేవి జాతకము.

| | | | |
|---|---|---|---|
| గు | రా | | |
| ల. చం | రాశిచక్రము. | | |
| | | | ర |
| | కు | శ కే | బు శు |

మహారాణీవారిది కుంభలగ్నము. అందే చంద్రుఁడు. రెండవది యగు వాక్స్థానమున తదధిపతియు విద్యాకారకుఁడును నగు గురువు. మూడింట, ధైర్యస్థానమున, విజయకారి యగు రాహువు. సప్తమంబున సప్తమాధిపతి యగు రవి. అష్టమంబున అష్టమాధిపతి బుధుఁడు ఉచ్చ. ఆయుర్వృద్ధికరము. అతనితో శుక్రుఁడు. తొమ్మిదవది యగు తులారాశి యందు లగ్నాధిపతి యగు శని; ఉచ్చ. ఆతనితో కేతువు. రాజ్యస్థానం బగు దశమంబున క్షేత్రకారకుం డగు కుజుండు.

ఆ. జన్మలగ్నమునకు సప్తమంబు వివాహ
భావ మధిపుఁ డైన భానుఁ గూడె;
నదియు సింహరాశి యగుట జాతకకాంత
ప్రియుని శౌర్యనిధిని బెండ్లి యాడు.

ఆ. సతికి లగ్నమందు సంపూర్ణ శుభచంద్రుఁ
డలరుఁ; బుత్రకారుఁ డయిన గురువు
తనదు నింట రెంటఁ దనరుఁ బంచమనాథు
నుచ్చగతుని చూడ్కి- నొప్పు కలిగి.

కావున మహారాణికి శుభదాంపత్య సంతానయోగంబు కలదు.

ప్రసాదాదిత్యుఁడు—ఎట్టిసంతానము!

భాస్కరాచారి—(కొంచెము సందేహించి) ఆవిషయమే సరిగ లేదు.

ఆ. పుత్ర భావ భర్త బుధుఁడు షండుఁడు చేరె
నీచ గతుని శుక్రు నెలతగోనము
లిచ్చు వాని నెన్మిదింట; మీ రాణికి
నాఁడుబిడ్డ లిద్ద ఱనఁగ వలయు.

ప్రసాదాదిత్యుఁడు—సింహాసనముపై మగబిడ్డను గూర్చుండఁబెట్టి, నేత్రోత్సవముగఁ దిల కింపఁదలఁచు మాకు మజిల స్త్రీప్రభుత్వమునే సూచించుచున్నారే!

భాస్కరాచారి—అట్లుకాదు. మీ రాణిగారి ఆయుస్థానాధిపతి యగు బుధుండును, ఆయుష్కారకుఁ డగు శనియు నుచ్చయం దున్నారు. కావున మీ రాణిగారు దీర్ఘాయుష్మతియై వర్ధిల్లును.

ప్రసాదాదిత్యుఁడు—అదియే మే మెప్పుడును కోరునది.

భాస్కరాచారి—అట్లామె వర్ధిల్లుచుండఁగనే వంశోద్ధారకుండైన మనుమఁడు కలుగు నని ఈ యోగంబువలనఁ దెలియుచున్నది. కావున ఈ రాజ్యమున కింకొక స్త్రీప్రభుత్వము కలుగదు.

ఆ. పుత్ర కారి గురువు పురుషుండు కుజు రాజ్య
నాథు భావవర్తి నవమదృష్టిఁ
జూచుచుండు కలిన శుభమూర్తి యీ రాణి
పౌత్రుఁ డగును మీకు భావి రాజు.

ఆ. పంచమంబునకును పంచమం బగు తుల;
దీని భర్త గురుని దృష్టి నుండి
ఘన కుటుంబ భావ గతుల నాతనిఁ జూడ
వనిత కుసుతుఁ డగును వంశకర్త.

ప్రసాదాదిత్యుఁడు—సంతోషమే! మా రాణికిఁ బుత్రుఁడైనను, పౌత్రుఁడైనను, కాకతి సింహాసనముపైని బురుషుఁడు కూర్చుండవలెను. ఇఁక మల్లికార్జున నృప జాతక మెట్లున్నది?

భాస్కరాచారి—అదియు నిట్టిఫలంబులనే సూచించుచున్నది.

ప్రసాదాదిత్యుఁడు—ఏవిధముచేతనైన నేమి! ఏకశిలానగర రాజ్య సింహాసనంబున పురుషసింహ కిశోరముం జూడఁగోరు మా సంకల్పములు ఫలించినఁ జాలును.

భాస్కరాచారి—తప్పక ఫలింపఁగలవు.

ప్రసాదాదిత్యుఁడు—ఇంకొక్క సంతోషవార్త మీ కెఱింగింప వచ్చితిని.

భాస్కరాచారి—వేగమె సెలవిండు.

ప్రసాదాదిత్యుఁడు—మీ కొమార్తయగు లీలావతి వివాహము కూడ వారి పాణిగ్రహణ సమయముననే కావలె నని మహారాజ్ఞి యాదేశము. అది మీకు సమ్మతమా?

భాస్కరాచారి—అంతకంటె మేము కోరఁదగిన దేమున్నది? మహారాజ్ఞి వివాహ మహోత్సవ సమయంబున శుభంబుగా లీలావతీవివాహముఁ గూడఁ జేయింపుఁడు.

ప్రసాదాదిత్యుఁడు—లీలావతికి వరుని నిశ్చయించితిరా?

భాస్కరాచారి—ఆవిషయమై మహారాజ్ఞి యాజ్ఞయు, మీ యందలి యనుమతియు, నాకు సమ్మతము. ఐనను మా యాత్రేయశాఖవారైన రెండవమంత్రిగారి పెద్దకుమారుఁడగు రాఘవశర్మను గూర్చి యిదివఱకే యాలోచించుచుంటిమికదా.

ప్రసాదాదిత్యుఁడు—సరియే. కానిమ్ము. అతఁడు ధాన్యవటీపురమునుండి వచ్చెనా!

భాస్కరాచారి—త్వరలో రాఁగలఁడని తెలియుచున్నది. అయ్యా! దండనాథా! నాకొమార్తె పెండ్లితో సంబంధించియున్న వేఱొక ప్రయత్నమును గూర్చి మహారాణిగారు తమతో నేమైన సెలవిచ్చిరా!

ప్రసాదాదిత్యుఁడు—జ్యోతిర్గ్రంథసంపాదనమును గూర్చియా! ఆ. సెలవిచ్చిరి. మీ లీలావతి మహారాజ్ఞితో విన్నవించినరీతిగ మిమ్ములను దేవికి పూజావిధానములఁ జేయించు యత్నంబున నుండుఁడని వారి యాజ్ఞ.

భాస్కరాచారి—మిగుల సంతోషము. అన్నిప్రయత్నములు సానుకూలములును, శుభప్రదములును కాఁగలవు.

ప్రసాదాదిత్యుఁడు—ఈ వివాహములకు ముహూర్తంబు లెప్పుడుకుదురునో యేమైన విచారించితిరా!

భాస్కరాచారి— ఈవిషయ మిదివఱకే యాలోచించి కొన్నిముహూర్తంబులఁ జూచితిని. అవన్నియు త్వరలోనే కుదురఁగలవు. ఈ సందర్భములోఁ గొంచెము గణితసాధనముచే నిర్ణయింపవలసిన యంశములు కలవు. గణితమునఁ బ్రవీణయగు నాకొమార్తెతో ఆ గణితమును పూర్తిపఱుచు మంటిని. ఈపాటికిఁ బూర్తిచేసియుండును. అమ్మా! లీలావతీ!

(ప్రవేశము:—లీలావతి ఫలకముతో.)

భాస్కరాచారి—అమ్మా! ఆ గణితమును బూర్తిగ సాధించితివా!

లీలావతి—పూర్తిపఱచితిని.

భాస్కరాచారి—ఏదీ! ఫలక నిటు తెమ్ము. (ఫలక పరీక్షించి) ఏమీ! ఇంతత్వరలోనే కుదిరినదా! ఇంకఁ గొంత సావకాశముగాఁ జూడకపోతివా? ఇది మిక్కిలి యనవకాశముగ నున్నది.

లీలావతి— ఇన్ని శుభంబులకును విశేషమయిన త్వరితో వేఱొకటి లేదు. పరీక్షింపుఁడు.

భాస్కరాచారి—సరే చూచెదను. నీ వేగి లోపల విశ్రమింపుము.

(లీలావతి నిష్క్రమించును.)

ప్రసాదాదిత్యుఁడు—"ఇంతత్వరగా" ననుచున్నారు. ఎన్నాళ్ళకు వీలుగనున్న దేమి!

భాస్కరాచారి—ఈ శుభముహూర్తంబు పండ్రెండు దినములకే కలదు.

ప్రసాదాదిత్యుఁడు—అయిన నేమి!

భాస్కరాచారి—మహారాజ్ఞి వివాహమునకు దగునంతటి ప్రయత్నముల కీమాత్రపు గడువు చాలునా!

ప్రసాదాదిత్యుఁడు—చాలునది చాలనిది మహారాజ్ఞియే నిర్ణయింపఁగలదు. నే నొక్కదానిఁ జూచి మాత్రము చెప్పఁగలను. ప్రభువులు తలపెట్టిరేని పండ్రెండుదినములకే కాదు; రేపటికే యీవేళకు నన్నియు సిద్ధపఱుపఁగల పరివారము, సామగ్రి, ధనమును, గలిగి సామ్రాజ్యము పెంపొందుచున్నది.

భాస్కరాచారి—అంతేకాక యీ శుభవార్త విస్తీర్ణమైన యీరాజ్యమం దంతటను దెలిసి, మహోత్సవ సమయంబునకు రాఁదగిన ముఖ్యులందఱును వచ్చుటకుఁ దగినంత యవకాశము కావలయుఁగదా.

ప్రసాదాదిత్యుఁడు—ముఖ్యులందఱును నుత్సవములఁ జూడవత్తురేని రాజ్యపరిపాలన మెట్లు నెఱవేఱును. రాజ్యపు సరిహద్దులఁ గాచు కోటలనుండి గాని, దండయాత్రలనుండి గాని, యెడతెగని జాగ్రత్తతో నుండవలసిన దండనాథులు వచ్చుటకు వలనుపడదు. ముఖ్యమగు రాజకార్యముల నియుక్తులగువారును రాఁజాలరు. ఎవరెవరి వంతుల వెంట వారువారు పనులయందును పండుగలయందును కష్టసుఖములఁ బడక తీరదు.

భాస్కరాచారి—అట్లయినచో "శుభస్య శీఘ్ర" మ్మను వచనము ననుసరించి వెంటనే మహారాజ్ఞీ వివాహ శుభకార్యములఁ బ్రారంభింపుఁడు.

ప్రసాదాదిత్యుఁడు—మహారాజ్ఞితో విన్నవించి, వంశవృద్ధుల యొక్కయు, కులగురువుల యొక్కయు, ననుమతిఁ బడసి, వారి యాజ్ఞ తెఱఁగున వర్తింతును. నే నిఁక సెలవు పుచ్చుకొందునా! (నమస్కరించును.)

భాస్కరాచారి—శుభ మస్తు.

(ప్రసాదాదిత్యుఁడు నిష్క్రమించును.)

భాస్కరాచారి—జోతిశ్శాస్త్రములోని యొక్క విషయముం గూర్చి నాకు సందేహము కలదు. గ్రహచార బద్ధులై యగుచు జీవకోటి సకలవిషయంబులందును ప్రవర్తించు నెడల వ్యక్తిస్వాతంత్ర్యమున కవకాశ మేది? పాపపుణ్యకార్యసమాచరణంబున జీవకోటికి యెట్టిస్వాతంత్ర్యమును లేనిచో ధర్మశాస్త్రంబులకు ప్రయోజనము లేదే! ఎవ్వండేపని చేయునో ఆపనియొక్క పర్యవసానమునకు నాతఁడే యుత్తరవాది కావలెను. కాని "ఏగ్రహముయొక్క ప్రేరేపణచేతనో యట్లు చేసితి" నని వాఁడు జవాబు చెప్పు నెడ మనము హర్షించి యూరకుండవలసినదేనా! కావున ఆలోచింపఁగా వ్యక్తిస్వాతంత్ర్యమునకు సంపూర్ణావకాశము తప్పక యుండితీరవలెను. ఈ పర్యవసానము స్థిరపడుచుటకై నా మనంబు ఏకారణంబుననో మిగుల నుత్సాహపడుచుండును. కాళీకాలయములోని గ్రంథములు సాధించి, ఈవిషయమును గూర్చి వానిలో నేమైన చర్చింపఁబడెనేమో చూచెదఁగాక.

(నిష్క్రమించును.)

తృతీయాంకము సంపూర్ణము.





శ్రీ

# జ్యోతిర్లీల.

## చతుర్థాంకము.

### ప్రథమ రంగము.



ప్రదేశము—ఏకశిలా నగరములోని వీధి.

ప్రవేశము—రాహుకేతువులు, వేఱుదిక్కులనుండి.

కేతువు—అన్నా! రాహూ!

రాహువు—ఎవరది? కేతువా?

కేతువు—అవును. నీవుకూడ ఈ యోరుగంటి నగర వీధులఁ దిరుగుచున్నావే!

రాహువు—ఈ నగరమునఁ గల వింత లారయుటకు మనవారిచేత నంపఁబడితిని. నీవో?

కేతువు—నేను వేడుకపడి మీయందఱికంటె నొకింత ముందుగనే యీ పురంబునకు వచ్చితిని. కాని ... ... ఏమంత తొందర? కొంచెము నెమ్మదిగా నడువుము.

రాహువు—అవు నట్లే నడువవలెను. పారములేని యాకాశమున పరుగిడునంత తొందరగ నడుచుటకీ భూమిపై నవకాశ మేదిరా తమ్ముఁడా?

కేతువు—అదికాదు. ఆకాశంబున మన కిద్దఱకును వెనుకనడచుట యలవాటు. ఈ భూమికి వచ్చినప్పటినుండియు మానవులకు విపరీతముగఁ గన్పింపకుండుటకై ముందునకు నడువ వలసివచ్చినందుకు నేను చిక్కుపడుచున్నాను.

రాహువు—(నవ్వి) ఇదియా! అలవాటులేని క్రొత్తపద్ధతులలో నుండు చిక్కు ఇట్టిదే. సరేకాని కేతూ! ఏమిభూగోళమురా!

కేతువు—అవునురా అన్నా! పై పేరునకు మాత్రము మన గోళము లన్నిఁటిని గొప్పగఁ జెప్పుకొందుము. నిజముగ కొన్ని వైశాల్యమునమాత్రము పెద్దవే. కాని అవన్నియు నీ చిన్ని భూగోళము పైని దిగదుడుపునకైనఁ బనికిరావురా!

రాహువు—అవును. వీరిపైనే.

కేతువు—మనము వీరిని గెలువఁగలమా?

రాహువు—గెలువఁగలమా యను సందియ మందు కోటనే పోరి గెలుచుట వినోల్లాసకరము కాని నీవంటి పిఱికి పెద్దమ్మల నెందఱు బెదరించిన నేమికీర్తిరా?

కేతువు—ఏమో. అది వినాయిష్టము. దేవగిరిరాజగు మహాదేవుని సైన్యము లన్నియు నీ కాకతీయ నగర ప్రాంతములకుఁ జేరినవా?

రాహువు—ఓరుగంటి ప్రాంతారణ్యములఁ బ్రవేశించినవి. కొలఁది కాలములోనే కోట పట్టుకొను ప్రయత్నము జరుగును. ఇది యిట్లుండ మన కార్యసాఫల్యమునకుఁ గొంత యనుకూల్య మేర్పడినది.

కేతువు—ఏమది? త్వరగఁ జెప్పుము. ఈ నగరవాసులతోఁ బోరుట యను నాకు మిగుల నిరుత్సాహముగ నున్నది.

రాహువు—పద్మనాయక వీరశ్రేష్ఠులలో నొక్కఁడగు విష్ణ్వభినవసింహనాథుఁడు కొంత సైన్యముతో మిత్రరాజ సహాయార్థము దక్షిణదిక్కునకు కొలఁదికాలముక్రిందటనే బయలువెడలి పోయె నఁట.

కేతువు—సంతోషము. సంతోషము. తక్కిన వీరవరులు కూడ కోట విడిచిపోవు నుపాయము గల్పింపరాదా? అప్పుడు స్త్రీజనముతోడ మాత్రమె యుండిన కోటఁ బట్టుకొనుట మనకు సులభము.

రాహువు—ఈదేశపు స్త్రీలయినను కంచుకములపైని కవచములు తొడిగి, బాలురఁ దించి, బల్లెముల కత్తులఁ బట్టి పోరి దేవసైన్యముల నైనను వెనుకకుఁ గొట్టుదురఁట.

కేతువు—ఓహో! మనకే స్వల్పసహాయ మేదో చిక్కఁ జెప్పుచున్నట్లున్నదే. అది యట్లుండ నగము సైన్యము పైకి వెడలిపోయిన తర్వాత సీ కోట యెక్కువంత విశ్రాంతిగ నుండుటకు మాఱుగ నింత క్రిక్కిరిసిన జనముతో మిగుల సందడిగా నున్నదేమి?

రాహువు—ఎఱుఁగవా! ఈ రాణికి కొలఁది దినములలోనే వివాహము కానున్న దని వాడుకగ నున్నది. అందుకై యీ రాజధాని చుట్టుపట్లఁ గల పల్లెలనుండి ప్రజలు నిజ మెఱుంగుటకై కోటలో గుమిగూడుచున్నారు. ఆజనములోఁ గలిసియే నే నీ నగరములోఁ బ్రవేశించితి.

కేతువు—ఓహో! మంచిసమయమునకే వచ్చి చేరితిమే! ఈవార్త మన గోళాధిపు లందఱకుఁ దెలియునా

రాహువు—నిరంతర వైరాగ్యచింత గల నీకుఁ దక్క తక్కినవా రెందఱకుఁ దెలియును. కావున నీ సందడిసమయమునసే మనసైన్యముల నీకోటలోఁ బ్రవేశపెట్టి, యప్రమత్తులగు దేశ్యవీరుల లోఁబఱచుకొను తలంపుతో మనవా రున్నారు. ఏమి జరుగునో చూచెదము రమ్ము.

కేతువు—సరే పదము. (కొంత నడచి) ఆఁగుమాఁగుము. ఈ వీధివెంట నెవ్వరో తప్పెటలఁ గొట్టుచు వచ్చుచున్నారు. వారినిఁ జూచి పోవుదము. (ప్రక్కగ నిలుతురు)

(ప్రవేశము—తప్పెటలవారు)

తప్పెటలవాండ్లు—(తప్పెటలు వాయించుచు) మా మా మహారాణిగారికి, మమ్ముఁ గాచు తల్లిగారికి, పెండ్లివేడుకలు, రేపటినుండి, మొదలు. కాఁబట్టి, ఈపట్టణములో, పల్లెలలో, ప్రజ లందఱు, పురుషులు, స్త్రీలు, బాలురు, కోటలోనికి రావలిసిందోహాయి. (అనుచు చాటింతురు)

రాహువు—కేతూ! వింటివా? మహారాణి వివాహకార్యములు రేపటినుండియే ప్రారంభమఁట.

కేతువు—అయ్యో! మన ప్రయత్నములచే నీ శుభములు భంగపడును కాఁబోలు.

రాహువు—ఏమో! భావికాల పరిస్థితులు మనము మాత్రము నిశ్చయముఁగాఁ జెప్పఁగలమా?

కేతువు—సరికాని యీ తప్పెటలు వాయించు మాల లందఱు చెడత్రాగి యున్నారు. మనపైఁ బడుదు రేమో!

తప్పెటలవాండ్లు—తొలఁగు. తొలఁగు. మావోడులా గుండావయ్యా! ఇదిగో సారాకాయి. (అని రాహువునకు సారాకాయ నిచ్చి, తప్పెటలు వాయింపుచు, మహారాణీ వివాహవార్త చాటింపుచు, నిష్క్రమింతురు.)

కేతువు—ఆ పాత్రలోని రసము కొంచెము రుచిచూడుము. ఈ లోకపు మత్తుపదార్థము లెట్టివో తెలియును.

(తెరలో మేళములు)

రాహువు—ఆఁగుము. ఇవ్వైపునుండి కొన్ని మేళములు వచ్చుచున్నవి. వీనితోఁ గొందఱు పెద్ద లున్నారు. ఈ పానపాత్ర మనచేత నుండరాదు. (పాఱవైచును.)

కేతువు—అయ్యయ్యో! సోమసుధవంటి పానీయమును వృథచేసితివే!

(ప్రవేశము—మేళములు, వేశ్యలు, విప్రులు, భటులు, సర్దారులు. వేశ్యల నాట్యము జరుగుచుండును.)

కేతువు—(జనాంతికముగా) అన్నా! యీ సంబరమును గూర్చి యీ భటుల నడుగుము.

రాహువు—(ఒక భటునితో) ఈ యుత్సవములు మీ రాణి వివాహమును దెలుపునవేనా?

భటుఁడు—కనకతప్పెటలు వినలేదో! చెవులు లేవో! రాణి యనెడ వేల? మహారాణి యనలేవో! నోరు తిరుగదో?

కేతువు—మేము ఈయూరికి క్రొత్తవారము. కావున ... ... ...

భటుఁడు—క్రొత్తవారా! క్రొత్తవారైనచో, కోటలోనికి వచ్చుటకు సెలవుచీటి యేదీ? చూపుఁడి. త్వరగ.



రాహువు—అది మావద్ద లేదు. నగరద్వారముల వద్ద సెలవుచీటి కొఱకు మమ్మెవ్వరు నడుగ లేదు.

భటుఁడు—హో! నాయకా! వీ రెవ్వరో క్రొత్తవారు. సెలవుచీటి లేదు. లన్నాదునా?

కేతువు—అన్నా! మన మంతర్ధాన మగుటకు సమయ మైనది.

నాయకుఁడు—ఈ మహోత్సవసమయమున సెలవుచీట్లు నడుగవలదను ప్రభువు నానతి త్రాగుడుచే మఱచితివా? వానిని చిక్కఁబెట్టక వదలుము. (రాహు కేతువులతో, అయ్యా! ఆ త్రాగుబోతులతో మీ కేల? ఇటురండి. కాకతిరాజవంశకులదైవమగు శ్రీ స్వయంభూదేవుని కరుణచే మా ప్రభువైన రుద్రాంబామహారాజ్ఞికి పాణిగ్రహణమహోత్సవము జరుగును. ఆమె మేనత్తకుమారుఁ డగు మల్లికార్జునవర్మ వరుఁడు. మఱియు మహారాజ్ఞిగారి కృపకుపాత్రురాలగు లీలావతి యను విప్రకన్యకను మా దండనమంత్రిగారి పెద్దకుమారున కిచ్చి యించుమించుగ నదేసమయమున వివాహము సేయుదురు. తామేగి, నగరమున నాగంతుకులకునై యేర్పఱుపఁబడిన భోజనశాలలో సాపడి, యచ్చేచ్ఛగఁ బురంబునం గల వినోదములఁ దిలకింపుఁడు. మే మింకఁ బెద్దల నాహ్వానింప నేగవలెను. ఆఁ! పదుఁడు. నడువుఁడు. (మేళతాళములతో నాయకుఁడు నిష్క్రమింతురు)

రాహువు—కేతూ! గ్రహగోచరాధిపులకుఁ దెలుపవలసిన విశేషము లెన్నఁటి నెఱింగితివో చూచితివా!

కేతువు—స్వర్గలో వారిని గలిసియుంటిమి గనుక. ఇక్కడ విశ్రాంతిగ నూపిరివదలుటకే నాకు భయముగనున్నది.

రాహువు—ఈవైపునకే యొకఁడు ముసలిబ్రాహ్మణుఁడు వచ్చుచున్నాఁడు. ఈతనినుండి యేమైన విశేషములు గ్రహింపఁగలుగుదుము. తాళుము.

(ప్రవేశము—ముసలి పూజారి బ్రాహ్మణుఁడు.)

బ్రాహ్మణుఁడు—ఈ సంబరములు చూడకుండ నాకిప్పు డీ గ్రహచార మేమి!

రాహువు—అయ్యా! గ్రహచార మనుచున్నారు. జ్యోతిష్కుఁడవా?

బ్రాహ్మణుఁడు—జ్యోతిషము, గ్రహములు నాశిరోఁ బడుఁగాక! జ్యోతిషమే నన్నీ సంబరములఁ జూడనీక కోటవెలికిఁ దోయుచున్నది.

రాహువు—అట్లనుట కేల? గ్రహములచే మీ కెట్టి యపకారము జరిగినది?

బ్రాహ్మణుఁడు—లేదా? జరుగలేదా! మాతల్లి మహారాజ్ఞి యొక్క పెండ్లివేడుకలు చూడకుండ కోటవెలుపలనున్న కాళిగుడికి "దేవుఁడా" యని పోవుట సంభవమా! ఆ గుడి పూజారినైనఁ గనుకనుగాక. పెండ్లిసమయములందైన సానిమేళము చూడఁగూడదఁటయ్యా!

రాహువు—చూడవల దని మిమ్ముల నిర్బంధించిన వా రెవ్వరు?

బ్రాహ్మణుఁడు—తెలియనట్లు యడిగెదవేమయ్యా! మహారాజ్ఞి వివాహములోనే లీలావతి పెండ్లి కూడ కావలెనా! ఆమె వరుఁడగు రాఘవశర్మ యింక నగరంబునకు తిరిగి

రాదైన లేదు. అయినను లీలావతిపెండ్లికిని కాళికాలయములో నున్న జ్యోతిర్గ్రంథములకును ఏల సంబంధము ముడిపెట్టవలెను? అవి తీయించునప్పుడింకొక విప్రకన్యకకుఁ బెండ్లి చేయింపఁ గూడదా? బాగుగనున్నది. తొలఁగనయ్యా! ఆ లీలావతమ్మ దేవిపూజ కిప్పుడే గుడికి వచ్చునఁట. నేను ముందుగఁ బోవలెను. (నిష్క్రమించును.)

రాహువు—వినఁదగిన దీ ముసలివాని నుండి వింటిమి.

కేతువు—ఏమది!

రాహువు—రుద్రాంబవివాహముతోపాటుగ లీలావతిపెండ్లియు జరుగుచున్నది. లీలావతి వివాహమునకును కాళికాలయములోని జ్యోతిర్గ్రంథములకును ఒకవిధమగు సంబంధము కల్పింపఁబడినది. మనము దివిపై నూహించినట్లే యిచ్చటి సందర్భములు సమకూడుచున్నవి. మనవారికి వీనిఁ దెలుపవలయును. మఱియు కోటలోనికి వచ్చువారికి సెలవు చీటి యక్కఱలేదనెడి సందడిసమయమునందే మనసేనలను కోటలోనికిఁ బ్రవేశపెట్టుచో మనకార్య మతిసులభముగ నెరవేఱును. కావున త్వరపడుము. రమ్ము.

కేతువు—ఇట్టి సమయమును పోఁగొట్టుకొనరాదు. పదుము.

(ఇద్దఱును నిష్క్రమించుచుండఁగా తెర దిగును.)

## చతుర్థాంకము.

### ద్వితీయరంగము.

ప్రదేశము—ఓరుగంటి రాచనగరు. మహారాజ్ఞి మందిరప్రాంతము.

ప్రవేశము—స్త్రీజనము పెండ్లిపనులయందు సందడిగాఁ దిరుగుచుండగా పెండ్లిసింగారములో చేతిలో పూజాద్రవ్యములు గల పళ్ళెరముఁ బూని లీలావతి.

లీలావతి—వకుళా! వనమాలి! ఈసందడిలో నామాట నెవరును వినుపించుకొనునట్లు లేదు. చేటీ! వకుళా!

(ప్రవేశము—చేటి.)

చేటి—లీలావతీదేవియా? పెండ్లికూఁతురై వచ్చినదే!

లీలావతి—ఈనాఁటి మీ యలంకారము చూచిన అందఱును పెండ్లికూఁతులవలెనేయున్నారు. మహారాజ్ఞి దర్శనమునకు సమయమా?

చేటి—ఇప్పుడే యభ్యంజన మైనది. కురు లార్చుకొనుచు నలంకరించుకొనుచున్నారు.

లీలావతి—ఈ పూజాద్రవ్యములను మంగళస్నానమొనర్చిన మహారాజ్ఞిచే స్పృశింపఁజేసి, దేవిగుడికిం గొంపోవలెను.

చేటి—కోనికిరమ్ము. ఒకసారి నిన్నుఁ గూర్చి ప్రభువు ప్రశంసించిరి.

(తెర తొలఁగఁగా అభ్యంజనస్నాన వస్త్రధారణానంతరము మేడ డాబాపై రుద్రాంబ యలంకరించుకొనుచుండును. స్త్రీపరిజన మామె కురు లార్చుచుందురు.)

రుద్రమదేవి—లీలావతీ! నీకు అప్పుడే గుడికిఁబోవు సమయ మైనదా!

లీలావతి—సమయమునకు ఒకింత ముందుగనే వచ్చితి.

రుద్రమదేవి—పెండ్లికై యింతి తొందరయా?

లీలావతి—తల్లీ! అదికాదు.... ...

రుద్రమదేవి—నిగ్రహింపుము. జీవితపరిస్థితులలో కోరుకొను మార్పు నేల కలిగింపు మని యాసపడుట ప్రకృతిసైజము. అది యట్లగుట అదృష్టవిశేషము. కానిమ్ము. (దాదులతో) సాంబ్రాణివెచ్చలఁ దెండు.

దాదులు—అనుజ్ఞ! (నిష్క్రమింతురు.)

రుద్రమదేవి—మఱచితిని. రాఘవశర్మ నేఁటి సాయంతనమునకే నగరమునకు మరలి రావలసి యుండెను. అతఁడు వచ్చెనా?

లీలావతి—(సిగ్గుతో) ఇంకను రాలేదఁట. కొంచెము సేపటికే వచ్చుననుకొనుచున్నారు. మహారాజ్ఞీ! పెక్కు నాళ్ళ కోరిక నేఁడు సమకూడెను.

రుద్రమదేవి—(నవ్వి) అట్లగుటయే మా యుద్దేశముకదా.

లీలావతి—తల్లీ! నేఁ జెప్పు కోరిక యదికాదు.

రుద్రమదేవి—మఱేది?

లీలావతి—అసామాన్యంబైన తమ కురుల విలాసము చూడవలెనని.

రుద్రమదేవి—(నవ్వి కురులార్చుకొనుచు) ఇం దసామాన్యం బేమున్నది? చూడుము.

లీలావతి—అనుజ్ఞ! (రుద్రాంబ కురు లార్చుచు) తల్లీ! కాంతకుఁ గబరీభారమే మేలైన యలంకారము సుమా!

ఉ. నీలపు టుంగరాలవలె నిద్దపు ఫాల మలంకరించి, పైఁ
దేలి, శిరంబుఁ గ్రమ్ముకొని, తీరగు నంసయుగంబు, మధ్యముం
లీలఁగ దాఁటి, శ్రోణి విపులీకృతలంబలిలోలవిభ్రమం
వ్రేలెడి పెన్నెఱుల్ భ్రమరవేణికిఁ జేకుఱు భాగ్యరేఖలై.

ఉ. చిక్కఁగ శీర్షభాగమునఁ జేరు కురుళ్ళను రెండు మూఁడు నిం
కెక్కువగా జనించి, మలినేతరనైల్యముతోడ సోగలౌ
నొక్కులతోడ రాజిలి, మనోహరనిర్మిత జానుసీమముం
జిక్కఁగ బాఱు పెన్నెఱుల చెల్వమె చెల్వము కాంత కెయ్యెడన్.

రుద్రమదేవి—దృష్టిబెట్టుచుంటివా!

లీలావతి—మన్నింపవలెను. తమకురులం దగులు దృష్టి నాది కాదు.

రుద్రమదేవి—(కొంచెముగ నవ్వి) దాదుల త్వరగా సాంబ్రాణి తెమ్మనుము.

లీలావతి—(చూచి) ఇదే తెచ్చిరి.

(ప్రవేశము—దాదులు సాంబ్రాణి బొచ్చెలతో)

రుద్రమదేవి—ఇటు తెండు. (అని చూపును.)

(దాదులు నిప్పుల పెట్టఁగా, లీలావతి సాంబ్రాణి వైచును. మఱియొకదాది వేణి సవరించును.)

దాది—లీలావతీ! మాతల్లి కురుల సౌరు చూచితివా!

రుద్రమదేవి—లీలావతి వాని మెచ్చలేదు దాదీ!

లీలావతి—మెచ్చకపోవుటే! మహారాజ్ఞీ! నేను వివిధదేశస్త్రీల వేణీసౌందర్యముల బాగుగఁ బరీక్షించితిని.

సీ. బంగారుమెఱుఁగుల పట్టుమెత్తని కురుల్
యవన పాశ్చాత్య హూణాంగనలకు
గౌరవర్ణపు నిగ్గు గల మృదుకేశముల్
గాంధార సౌరాష్ట్ర కామినులకు
లాలిత నీల రోలంబ కుంతలములు
పాంచాల మగధాంగ భామినులకు
ఘన కాలకాంతి సంగత కచభారముల్
కొంకణ ద్రవిడాంధ్ర కోమలులకు

లీలావతి—ఆ. అదిగో! యుత్తరమున నచలుఁడౌ ధ్రువు చెంతఁ
దిరుగు వారు సప్త దేవ మునులు;
వారి వలెనె నిఖిల తారా గణమ్మును
నింగి నెలవు లందు నిండి వెలుఁగు.

రుద్రమదేవి—(శిర కేశముల ముడుచుకొని, త్రిశూల చిహ్నముగల శిరోభూషణమును ధరించి) హా ... స్తుపుల నిటు లెమ్ము.

లీలావతి—(పళ్ళెరము రాణిచే స్పృశింపఁజేయుచు) మహారాజ్ఞీ! శ్రీ రుద్రాంబికాదేవి కృపచే స్వయంభూదేవు ననుగ్రహమ్మున వీరోత్తముఁడగు మల్లికార్జునుని భర్తగాఁ బడసి వర్ధిల్లుము.

అందఱు—మేలు! మేలు! వర్ధిల్లు. వర్ధిల్లు తల్లీ!

రుద్రమదేవి—(స్మృతి నయించి) జ్ఞప్తికి వచ్చెను. లీలావతీ! నీ విప్పు డేగుచున్న కాళిగుడి వద్ద నుండి యేదో వింత ధ్వని వినిపించుచుండె వినవచ్చెను.

లీలావతి—అమ్మా! ఏమి ధ్వనులు?

రుద్రమదేవి—ఏమి ధ్వనులో చెప్పఁజాలను. అట్టి విదివఱ కెన్నఁడును వినలేదు. దూరమున తుమ్మెదల రొదలవలె—పక్షుల కలకలము వలె ... ... ...

లీలావతి—(వినయముతో నవ్వి) అది నీ వివాహ మహోత్సవమును దెలుపు ప్రజల కలకలము. తల్లీ! క్షమింపవలెను. నా కొక్క విషయము స్ఫురణకు వచ్చినది.

రుద్రమదేవి—ఏమది?

లీలావతి—సీ. కలికి కోకిల పాటలోఁ గన్నెతనెయు,
చందమామలో వేడిమి, మంద పవను
గంధు శోభనా భావమ్ము, చెందఁ జేసి
కవులు విరహిణులకు నార్తిఁ గల్గు చుంద్రు.

గీ. కాని, కవిమన్మథుండు నీ ఘనత నరసి
నిశను షట్పదగీతంబు నిఖిల పక్షి
రవము విని నీకు వింత విభ్రమము గూర్చె
నూత్నకవి భావకల్పనా యత్న మట్లు.

రుద్రమదేవి—(నవ్వి) అప్పటి కింక చీఁకటి పడలేదు కదా. మఱియు నంత సులభముగ భ్రమపడుదుమా! అది యట్లుండె. నీవిఁకఁ బోవచ్చును. వెంటఁ దగు భటరక్ష యున్నదా?

లీలావతి—భటరక్షను మార్గమునఁ గలిసికొనఁ గలను. సెలవుఁ గైకొందును.

రుద్రమదేవి—మంచిది.

(లీలావతి నిష్క్రమించును.)

రుద్రమదేవి—(పరిజనముతో) వలయునప్పుడు పిలిచెద.

(పరిజనము నిష్క్రమించును)

రుద్రమదేవి— అధికసించి నేఁ డేలొకో మా మనంబు వింతరీతి సందేహమునకుఁ బాలగు చున్నది. ఇట్టి తెన్నెన్నఁడును లేదు. కులదైవముల నిత్యార్చనలలో లోప మేమియు లేదుకద. విచారింతము. చేటీ!

(చేటి ప్రవేశించును)

రుద్రమదేవి—స్వయంభూదేవు నాలయమునుండి, తీర్థప్రసాదములు వచ్చినవా?

చేటి—ఇప్పుడే పూజరులు ప్రసాదములఁ దెచ్చి యిచ్చి, దేవపూజలు సరిగ నెఱవేర్పఁబడినట్లు తమకు విన్నవింపు మని మాతో చెప్పి, సెలవుపుచ్చుకొనిరి.

రుద్రమదేవి—మంచిది. మొన్న లీలావతి లిఖించిన నక్షత్రపట మా గోడకు వ్రేలుచున్నది. తెమ్ము.

చేటి—ఆజ్ఞ! (తెచ్చి, ఒల్లనైనుంచి, నిష్క్రమించును.)

రుద్రమదేవి—(పటమును ఆకాశమును పరీక్షించుచు) అల్లదే సప్తర్షి సమితికి తిన్నగ పైనాందోళి కాకృతిగఁ గనఁబడు నైదు చుక్కలే మఘా నక్షత్రము. తరువాత పూర్వోత్తర ఫల్గుణీ నక్షత్రములు. ఆపై నైదును హస్త కాఁబోలు. అటుపై తూర్పుగ మాణిక్యమువలె దివ్యతేజస్సున నెల్గునదే చిత్రాతార. (వినుట నభినయించి) అదిగో! మఙ్గల నా వింతధ్వని వినఁబడుచున్నది. నేఁ డేవియో విపరీతములు జరుగునట్లు మా మనమున నొక సందియము కలుగుచున్నది. ఏమీ! సందియమా! కాకతిసింహమునకు సందియమా! ఏవంకఁ జూచినను శతయోజనదూరంబునం గాని పరిరాష్ట్రంబే లేని ఆంధ్ర సామ్రాజ్య లక్ష్మికి సందియమా! (నవ్వి, తిలయూచి) అల్లదే యేకశిలానగర ప్రాకారము. డెబ్బది యేను బురుజులతో నెలయుచున్నది. ఒక్కొక బురుజునకు వేయేసి మందె మన్నె దొరలు ... కోటను దమ ప్రాణంబులతో సమంబుగ గాచు డెబ్బదియేను గోత్రంబుల పద్మనాయక వీర నికరములు ను గలవు. శత్రుదుశ్ఛేద్యంబుగ నొప్పుచున్న ఓరుగంటి మేటి కోటయొక్క నగ్దత్తయు నదిగో. ఇటకు దగ్గఱనున్న యీ ప్రాకారభాగంబున గస్తితిరుగు రక్షకభటుల యీఁటె మొదళ్లఁ బొన్నుకట్లు గోడరాళ్ళపైఁ దగిలి యదె కంగు కంగున మ్రోగుచున్నవి. (యోచించి నవ్వుకొనుచు) నేఁడు నామనం బింత భ్రమ పడుచున్న దేమి! పెండ్లివేడుకఁ జూడవచ్చు జనుల సందడి కింత యోచనయేల?

(తెరలో యుద్ధసంబంధమైన కలకలము.)

అదేమి! ఉత్తరప్రాకారపు బురుజులకడ నేదియో కలఁత జరుగుచున్నట్లున్నదే! పెండ్లిసంబర మను నెపమున కడుఁ ద్రాగి, యొడలు తెలియక, మా భటులు వారిలోవారు కలహించుచున్నవారేమో, విచారింతము. దాదీ!

(ప్రవేశము:—దాది.

రుద్రమదేవి—దాదీ! ఉత్తరద్వారముచెంత నేదో కలకలము వినవచ్చుచున్నది. ప్రతీహారిణిని గుఱ్ఱముపై నంపి యదేమో తెలిసికొని రమ్మనుము.

దాది—ఆజ్ఞ! (నిష్క్రమించును.)

(తెరలో గడితలుపులు మూయుచప్పుడు.)

రుద్రమదేవి—అదేమి! నగరద్వారములు అప్పుడే మూయఁబడినవే! చేటీ!

(చేటి ప్రవేశించును.)

రుద్రమదేవి—నేఁటినుండి వేడుకలఁ జూడవచ్చు జనుల సౌకర్యమునకై నగరద్వారముకడ సెలవుచీటినే యడుగవలదనియు, రాత్రి సగము కడచువఱకును గడీతల్పులు తెఱచి యుంచుఁడనియు మే మాజ్ఞాపించియుండఁగా నిప్పుడే వానిని మూయు చప్పుడు వినఁబడు చున్నది! (తెరలో కలకలము.) అదిగో! సంబరములో నుత్సాహముగఁ దిరుగుట మాని స్త్రీజన మీ వైపునకు వేగముగా వచ్చుచున్నది. వీధిలోని కరిగి, యీ వచ్చువారి నుండి విశేషముల నరసి రమ్ము.

చేటి—ఆజ్ఞ. (నిష్క్రమించును.)

రుద్రమదేవి—అదిగో! ప్రతీహారిణి తొందరతో మఱలివచ్చుచున్నది.

(వేఱొక చేటి ప్రవేశించును.)

చేటి—అమ్మా! ప్రతీహారిణి దర్శనముకొఱకు వచ్చియున్నది

రుద్రమదేవి—తోడుకొని రమ్ము.

(చేటి నిష్క్రమించి, ప్రతీహారిణితో వచ్చుచున్నది.)

ప్రతీహారిణి—జయము. జయము. కాకతిసామ్రాజ్యలక్ష్మికి.

రుద్రమదేవి—విశేషములు చెప్పుము.

ప్రతీహారిణి—ఉత్తరద్వారమునొద్ద నొక విపరీతము జరిగినది.

రుద్రమదేవి—విపరీతము!

శ్రీలంకేఖ — నగరద్వారములన్నియు మూయఁబడినవి. మా యమ్మగారైన నీయొక్క పెండ్లిసంబరమునకై అంగళ్లలోఁ దిరిగి వస్తువులఁ గొనుచున్న మ మ్మందఱ నిండ్లకుఁ బోవలసిన దని నగరసేనాని యుత్తరువు లిచ్చినాఁడఁట. వీధులలో మన బంట్లటు నిటు పరుగులెత్తుచున్నారు.

రుద్రమదేవి — ఛీ! కలవరపడ వలదు. ఇదే నగరసేనాని రాఁగలఁడు. అతనివలన వివరము లెఱుఁగ వచ్చును.

(ప్రతీహారిణి ప్రవేశించును)

ప్రతీహారిణి — మహారాజ్ఞీ! నగరసేనాని వచ్చియున్నారు.

రుద్రమదేవి — లోనికి రమ్మనుము.

(ప్రతీహారిణి నిష్క్రమించును)

(ప్రవేశము — మల్లికార్జునవర్మ.)

మల్లికార్జునుఁడు — (కత్తి యెత్తి యభివందనము పట్టుచు) ఆంధ్రసామ్రాజ్యలక్ష్మికి జయ మగుఁగాక! కాకతిసింహాసనమునకు భద్ర మగుఁగాక!

రుద్రమదేవి — దాదీ! అధివసింపఁజేయుము.

(దాది పీఠిక చూపను.)

మల్లికార్జునుఁడు — సన్మానింపఁబడితిని. నావచ్చిన కార్యము సామ్రాజ్యమున కత్యావశ్యకము. కాలము మిక్కిలి యపాయప్రదము.

రుద్రమదేవి — (ఉద్వేగముతో) అత్యావశ్యకమా! అపాయమా! సామ్రాజ్యమునకా! ఎట్టి మాటలు! విశేషములు?

మల్లికార్జునుఁడు — మహారాజ్ఞిగారి హృదయోద్వేగ ముపశమించుఁగాక. అత్యావశ్యకము తీరినది. అపాయప్రదము కాకపోవచ్చును. మన కోటచుట్టును ప్రబలసైన్య మొకటి యరికట్టియున్నది.

శ్రీలంకేఖ — దేవీ! మా తల్లి పెండ్లిసమయము! ఇప్పు డీ విపరీత మేల దాపురించెను. మహారాజ్ఞీ! మహారాజ్ఞీ! నగరంబును గాపాడుము.

రుద్రమదేవి — ఆఁగుము. ఆఁగుము. ఆంధ్రవీరుల గని పెంచు మీర లిట్లలజడి నొందఁదగునా? స్వయంభూదేవు ననుగ్రహంబున కాకతిసింహంబు కత్తి ధరింపఁగల్గు నంతవఱకును మీ కేమియు భయము కలుగదు. (మల్లికార్జుననితో) నగరద్వారములు?

మల్లికార్జునుఁడు — కోటలోనికి శత్రువులు ప్రవేశింపకుండ మూయఁబడినవి.

రుద్రమదేవి—మేలు! నగరము రక్షింపఁబడినట్లే. నగర రక్షణ సైన్యము నిదురించుటలేదు. మన సైన్యంబులను కూడఁబట్టుకొనుట కవకాశ మేర్పడినది. (పురస్త్రీలతో) మీరా లేఁగి వెనుకగదులలో నుండుఁడు. పొండు. మీరా కేయిక్కట్టును రానీయను.

(స్త్రీలు నిష్క్రమింతురు.)

పెద్దదాదీ! నీవు అక్కడ నాయెదుట నుండుము.

పెద్దదాది—అనుజ్ఞ! (ద్వారమున నిలుచును.)

మల్లికార్జునుఁడు—స్త్రీలను బాలురను ఇట్లలజడి పడుదురనియే వేకువలోఁ దిరుగు జనుల నిండ్లకుఁ బొమ్మని యాజ్ఞాపించితిని. సేనలు నిరాఘాటముగ నడచుటకు వీధులు వట్టివిగ నుండుట యావశ్యకము కదా.

రుద్రమదేవి—అది సరియే. కాని సైన్యమా? ఎవ్వరిసైన్యము? ఎక్కడిసైన్యము? ఎట్లు రాఁగలిగెను.

మల్లికార్జునుఁడు—మిత్రసైన్యము మాత్రము కాదని తెలిసికొని తొలుత నగరద్వారములు మూయించితి.

రుద్రమదేవి—శత్రుసైన్య మగునో రాజ్యమునం దెవ్వ రెఱుంగకుండ రాజధానిచెంత కెట్లు రాఁగలిగెను. బావా! నేనుకూడ బురుజుపైకి వచ్చి చూచెదను. నా స్వారియశ్వ మును సిద్ధపఱుచుమనుము.

మల్లికార్జునుఁడు—(తనలో) ఉద్వేగముచే నీయమ తన రాజఠీవి నేమఱి, చిన్ననాఁటివలె, నన్ను 'బావా' యని పిలుచుటచే నెంత యానందముగ నున్నది.

రుద్రమదేవి—(కోపముతో) అడిగినమాటకు మాఱుపల్కక యేదియో తలంచుచు నూరక నిలిచెదవేమి? మమ్ము వేళకపఱుచుటకై వచ్చితివా?

మల్లికార్జునుఁడు—క్షమింపఁబడుదునుఁగాక. మహారాజ్ఞి బురుజుపైకిఁ బోవుట యనావశ్య కము. ఏలయన ఈ ప్రాసాదభాగంబు ను ఇంచుమించుగ ఆబురుజునంత యెత్తుగలదే. కావున నిచటికిఁగూడ నా సైన్యముల సూచనలు కనఁబడఁగలవు. ఆ పరిఖాభాగం బున కావల వెన్నెలలోఁ గనిపించు బయలున కావలనున్న కొలఁది యడవిపైకి మహారాజ్ఞి దృష్టిఁ బఱపినచో నా వాక్యముల నిజస్థితి విశదమగును.

మ. ఇటు నా యంగుళిచాయఁ జూడు; మదిగో యెత్తైన ప్రాకార; మిం
కటుపై నీడను పల్లమే పరిఖయా; నా నీడకుఁ గ్రిందు చెం

గట కాంతినిలయంబు; నాపయి నవే కాన్పించు నందెల్ల న
స్ఫుటమా బాలశశాంకు వెన్నెలలలోఁ జూపట్టు లోహప్రభల్.

కం. లోహంబుకాంతి సైనిక
దేహత్రాణాసి కుంత దీపిత; మిఁక నీ
వూహింపు మచటి జనసం
దోహము విస్తార మనుచుఁ దోఁచునో లేదో.

రుద్రమదేవి—ఆ కనిపించు వింతకాంతులు సైనికుల యాయుధములపై వా?

మల్లికార్జునుఁడు—అవును. ఆ యడవితోఁ గలసినట్లు కనిపించు వైరిసైన్యములను మహారాజ్ఞీ
వివరముగా పరికింపఁగను.

సీ. హిమబిందు సిక్త పర్ణములట్లు తళతళల్
గలవి బల్లెంబుల కటకు మొనలు,
పుష్పాడి నిండిన పొదరిండ్ల యట్టివి
సేనాను లుండెడి శిబిర తతులు,
వనపుష్ప చిత్రాంశు వర్ణ మొప్పునవి
ఘన హయానన మీఁది కంబళములు,
ఛాయాసమేత సంచారవృక్షంబుల
సరణి నందం దవే సామజములు,

తే. వివిధ వల్మీక బహుశిలావితతి రీతి
సమ విశాల కోణము లవి సైనికోప
కరణ పేటికా నివహముల్ గలుగు బండ్లు;
కానడవిఁ బోలు రిపుసేనఁ గాంచు మదిగో!

రుద్రమదేవి—నేఁ డీ విపరీతములు కలుగనై యుండుటచేతనే కాఁబోలు మా మనంబు విగుల
సవిశ్రాంతిఁ జెందినది. ఆ వినిపించు సందడి కూడ నీ వింతసైన్యమదేనా?

మల్లికార్జునుఁడు—సందేహమేమి? దానిదే. ఆ ధ్వనుల నొక్కొక్కటిం బ్రత్యేకముగ వినఁ
దగును.

సీ. తుమ్మెదరొదలట్లు జుమ్మను వేనవేల్
మనుజు లొక్కటఁ బల్కు మాటల సడి
పాలపిట్టల జీర్ల భంగి మంద్రత నొందు
కొరలు నేనుంగుల ఘీంకృతములు

పక్వఫలంబులు పసు చప్పనగఁ దోఁచు
ధర మోఁదు హయఖుర తాడనములు
ఉరియు గూబల వలవలపు టార్పులఁ బోలు
నుబ్బు నాలుకఁ జాచు నుష్ట్రరవము
గీ. వీచు పెనుగాలి నొంగొంగి రాచుకొనెడి
వెదురు గుమ్ములు కట్టు విధముఁ దెలుపు
సమర సంభార భరముతో శకట తతుల
వేఁడి యిరుసులు రాపాడు వింత మ్రోఁత.

రుద్రమదేవి—(వినుఁగుతో నవ్వి) వర్ణన లిట్టివేనా? నగరద్వారము లన్నియు భద్రముగ మూయఁబడినవికదా?

మల్లికార్జునుఁడు—మూయఁబడినవి.

రుద్రమదేవి—అపాయము నెఱుఁగక ద్వారి తెరచినది. ఇఁక మనకోటను ముట్టడికై సిద్ధముచేసికొన వలసియున్నది. దాసీ!

దాది—అమ్మా.

రుద్రమదేవి—ఆ కలమును, కాగితములను ఇటు తెమ్ము.

దాది—అనుజ్ఞ. (తెచ్చును)

రుద్రమదేవి—వాని నీ బల్లపై నుంచి, బల్లను సేనాని యెదుటికి జరుపుము.

దాసి—అనుజ్ఞ. (అట్లు చేయును)

రుద్రమదేవి—ప్రతీహారులను నిద్దఱ నిటు పిలుచుకొని రమ్ము.

దాసి—అనుజ్ఞ. (నిష్క్రమించును)

రుద్రమదేవి—మల్లికార్జునునితో, తాము ఈ బల్లవద్ద కూర్చుండి కొన్ని యాజ్ఞాపత్రముల వ్రాయుఁడు.

మల్లికార్జునుఁడు—ఆజ్ఞ. (బల్లవద్ద కూర్చుండును)

రుద్రమదేవి—కోటలోని సైన్యంబు లన్నింటిని వేగమే సిద్ధపఱిచి, కోటగోడల మీఁదను బురుజులందును కాల్బలములను — నగరద్వారంబుల చెంత వీధులలో గుఱ్ఱపుదండును, ఏనుఁగులను — తీర్చి, నిలుపు మని సర్వసేనాధ్యక్షులకు వ్రాయుఁడు.

మల్లికార్జునుఁడు—(లిఖించి) వ్రాసితిని.

రుద్రమదేవి—అట్లు సేనల నిలిపిన తరువాత —— సైన్యాధ్యక్షులలో ముఖ్యులను —— మంత్రివర్గముతో గూడ ప్రాసాదమునకు ఆలస్యములేకుండ రమ్మని నేటాకయాజ్ఞ మహామంత్రికి వ్రాయుఁడు.

మల్లికార్జునుఁడు—లిఖించి వ్రాసినాఁడను. మహారాజ్ఞి వీనిని పరిశీలింపనగును.

రుద్రమదేవి—(కాగితములఁ బుచ్చుకొని చదివి) కలము నిట్లింపు.

మల్లికార్జునుఁడు—ఇచ్చును.)

ప్రవేశము—దాది, ఇద్దఱు ప్రతీహారిణులు.

ప్రతీహారిణులు—జయము. జయము. మహారాజ్ఞికి.

రుద్రమదేవి—(కాగితములపై సంతకముచేసి, ఒక ప్రతీహారిణితో) నీ వీ యాజ్ఞాపత్రమును త్వరితముగను భద్రముగను గొంపోయి సర్వసేనాధ్యక్షుల కిమ్ము.

1వ ప్రతీహారిణి—అనుజ్ఞ. (త్వరగున నిష్క్రమించును.)

రుద్రమదేవి—(రెండవ ప్రతీహారిణితో) నీ వీ యాజ్ఞాపత్రమును మహామంత్రికి అందఁజేయుము. త్వరగ.

2వ ప్రతీహారిణి—అనుజ్ఞ. (నిష్క్రమించును)

దాది—(మౌనముగ నిలుచును)

రుద్రమదేవి—ఈ సైన్యము మన యాహ్వానముపై వచ్చిన యే మిత్ర రాజుల దో యై యుండదుకదా? వైరుల దైనట్లు మన కేమి నిదర్శనము?

మల్లికార్జునుఁడు—స్వానుభవమే నిదర్శనము. కోటవెలుపల నున్న కాళీనిలయమునకు నేఁడు పూజకై యేఁగు లీలావతికి ... ... ...

రుద్రమదేవి—అవునౌను. లీలావతి యా సైన్యమున్న బయలులోని కాళిగుడికై కదా బయలుదేఱెను. ఆమె యాసైన్యములలోఁ జిక్కుకొనినదా యేమి?

మల్లికార్జునుఁడు—లేదు. కాని యంతపని కావలసినదే.

రుద్రమదేవి—ఎట్లెట్లు! మీరు చూచితిరా?

మల్లికార్జునుఁడు—లీలావతికి భటరక్షకనుప సార్వభౌము లగు మీ యానతి నేను ఆయుత్తర ప్రాకారంబుపై కొలఁదిమంది భటులతో నుండఁగాఁ దెలిసెను. అప్పుడే పూజకై

యేగు లీలావతి యచ్చటికి వచ్చెను. అప్పుడు భటరక్షను సైనికహజారంబునుండి తెప్పించు టాలస్యమగునని తలంచి, నాతోనున్న కొలఁదిమందినే రక్షగా నేర్పఱిచి, పురద్వారము వెడలనున్న లీలావతికిని ఆమె తండ్రిగారికిని తోడుగాఁ బంపించితి.

రుద్రమదేవి—తరువాత?

మల్లికార్జునుఁడు—అంత నాపనిపై బురుజులయందలి కాపుల పరిచూచుకొనుచు, గడి తలుపులు మూయుట కింకను సమయము కాకుంటచే నొంటిగ పురద్వారము వెడలి, లీలావతి రక్షకభటులతో నేగిన కాలిగుడిబాటనే, కందకము చేరువ నేటి దరి దాఁక నడచి, ఆ యిసుకదరి నొకింత నిలిచితిని.

రుద్రమదేవి—ఏ యిసుకదరిని?

మల్లికార్జునుఁడు—చిన్ననాఁడు మన మిరువురమును స్వారిచేయుచు నీటికై వచ్చు జంతువులఁ జూడ నిలుచుచుండిన యిసుకదరినే.

రుద్రమదేవి—అందు నిలిచి చూడఁదగు విశేష మేమున్నది?

మల్లికార్జునుఁడు—చిన్ననాఁటి సందర్భములను మనసులోనికిఁ దెచ్చుకొను సంతోషము ...

రుద్రమదేవి—(నవ్వి) సరిసరి. దాదీ!

దాది—అమ్మా.

రుద్రమదేవి—వేఱొక ప్రతీహారిణి నిటు రమ్మనుము.

దాది—అనుజ్ఞ. (నిష్క్రమించును)

రుద్రమదేవి—అంతట?

మల్లికార్జునుఁడు—అంత నాశ్చర్యమగునట్లు, కొంతమంది విదేశసైనికులు నీళ్ళగంబుల మోచు నెడ్లమంద నొకదానిని నీటిదరికి తోలుకొనివచ్చి, తొనగంబులలో నీరు నింపఁ జొచ్చిరి.

(ప్రవేశము:—దాది ప్రతీహారిణితో.)

ప్రతీహారిణి—జయము. జయము. ఆంధ్ర సామ్రాజ్యలక్ష్మికి.

రుద్రమదేవి—నగరంబునందలి కంచరులను వడ్లబత్తులను పరికరములతో నిప్పుడే చేర్చి, నగర ద్వారంబుల తలుపుల నన్నింటిని లోపలినుండియే పరీక్షించి, ముట్టడికిఁ దగనట్టి లోపము లున్నయెడల బాగుచేయింపు మని నగరశిల్పాధికారికి మా యాజ్ఞ వేగమే పోయి తెలుపుము.

ప్రతీహారిణి—ఆజ్ఞ. (నిష్క్రమించును.)

(దాది దూరముగ నిలుచును.)

రుద్రమదేవి—(మల్లికార్జునునితో) అట్లు సనగపు పెద్దమంద కనిపించుటలో విపరీత మేమున్నది?

మల్లికార్జునుడు—సాధారణముగ నుండఁ గూడదు. కాని వారి వేషభాషలఁ జూచిన నా కొకరీతి సందియము తోఁచినది. అందుకుఁ దగినట్లు ఇంతలో లీలావతియేగిన గుడి చెంతనుండి కత్తులమ్రోఁతయు, పోరాటపు సందడియు వినవచ్చెను.

రుద్రమదేవి—అప్పుడు?

మల్లికార్జునుడు—అప్పుడు నే నా వైపునకుఁ బరునెత్తఁగా పెక్కుమంది క్రొత్తవారలు లీలావతీరక్షకసైన్యమును చుట్టుముట్టి పోరాడుచుండిరి.

రుద్రమదేవి—(ఉద్వేగముతో) అప్పుడు నీ వొంటరిగనే పోయి, వారితోఁ గలియఁబడితివా యేమి?

మల్లికార్జునుడు—నే నేగి కంటఁబడునరికి కొంతమంది క్రొత్తవారు నాపైకి వచ్చిరి. తమ్ము నొత్తిడిచేయువారిలో నిట్లు కొంతమంది తగ్గఁగా మన సైనికులు లీలావతీ భాస్కరాచార్యులను నడుమ నుంచుకొని, సూచీవ్యూహముగ నేర్పడి, దర్పముతో వైరి సమూహమును భేదించుకొని, దాపుననున్న కాళిగుడిం బ్రవేశించి, తలుపుల మూసి కొనిరి.

రుద్రమదేవి—అట్లయిన నిప్పటికి లీలావతి కపాయము తప్పినట్లే యెంచఁదగును. ఈ యల జడిలో పురమునకై చేరవచ్చు రాఘవశర్మ యెక్కడ చిక్కుకొనియెనో! వైరు లందఱొక్క మొగి నీపైఁ బడలేదుకద?

మల్లికార్జునుడు—నా వెంటఁ బడిరి. కాని చీఁకటిలో పొదలమాటున నే నుండుచోటును సరిగ గుర్తింపనేరక, నాకొఱకై వెదకుచు, వేఱొకదిక్కునకు దాఁటిపోయిరి.

రుద్రమదేవి—(వేడుకగ) బావా! దాఁగుకొంటివా!

మల్లికార్జునుడు—నగరంబుఁ గాచు పూచి నాయందుఁ బెట్టియు దాఁగుకొనినందుకు హేళనము సేయఁదగునా?

రుద్రమదేవి—(నవ్వుచు) బావా! కోపింపకు. నీతో వేడుకసేయుచుంటిని. తరువాత?

మల్లికార్జునుడు—వా రట్లు పోవఁగనే నేను కోటకై మరలితిని. ఉత్తరద్వారంబు చేరితినో లేదో! ఆ క్రొత్తవా రనేకులు సాయుధులై లోపలఁ బ్రవేశింపఁబోవుట జూచి, వారి నాఁపుమని ద్వారపాలురగు మన భటులకుఁ గేకలువైచితిని. మనవార లాఁగుమనినను వా రాఁగక బలవంతముగ లోనఁ బ్రవేశింపఁ జూచిరి. ఉభయులకు నొకింత కత్తులాట జరిగెను.

రుద్రమదేవి—ఇంతకుముందు ఉత్తరద్వారముతట్టున వినిపించిన కలకల మిదియా? తరువాత?

మల్లికార్జునుఁడు—ఒకంతసేపటిలో నా క్రొత్తవారలలోఁ గొంతమందిని పట్టుకొని, కొదువ వారల వెలుపలకుఁ దఱిమి, గడితల్పులు మూయఁగల్గితిమి.

రుద్రమదేవి—పురంబును, కాకతీయుల యశంబునుఁ, గాచితివి బావా! తరువాత?

మల్లికార్జునుఁడు—అంతట దుర్గద్వారము లన్నియు మూయించుచు కోటగోడలపై బురుజులను ఎక్కి చూడఁగా నేమిచెప్పుదును! ఎక్కడఁజూచినను వైరిసేనాపారావారమే! ఏదిక్కుచూచినను శాత్రవకోటులే!

రుద్రమదేవి—ఈ విషయము సేనాధిపులకు హెచ్చరిక చేసితిరా?

మల్లికార్జునుఁడు—అట్లొనర్చి సర్వసేనాపతి యగు ప్రసాదాదిత్యునకుఁ గబురంపి, నేను మహారాజ్ఞి సందర్శనమునకై వచ్చితిని.

రుద్రమదేవి—వేఱొక యాజ్ఞాపత్రమును వ్రాయుఁడు. కోటలో మన భాండారంబులనేమి వర్తకులయొద్దనేమి భోజనసామగ్రులు, తైలాదులు, గ్రాసము, ఎంత నిలిచియున్నదో లెక్కింపఁజేసి, వివరముగ వ్రాయించిన పట్టికనొకటి మా కంపుమని మహామంత్రికి వ్రాయుఁడు.

మల్లికార్జునుఁడు—అనుజ్ఞ. (వ్రాయుచుండును.)

రుద్రమదేవి—మఱియు మా యుత్తరువు అగుదనుక వాని నెవరును ఉన్నచోటునుండి కదలింపకుండునట్లు భద్రముచేయింపుమని కూడ వ్రాయుఁడు.

మల్లికార్జునుఁడు—అనుజ్ఞ. (లిఖించి) వ్రాసితిని.

రుద్రమదేవి—ఇయ్యుఁడు. (కాగితము పుచ్చుకొని, చదివి, దానిపై సంతకముచేసి,) దాసీ! దీనిని వేత్రాక ప్రతీహారి కిచ్చి, వేగమే మహామంత్రికి అందఁజేయు మనుము.

దాసి—అనుజ్ఞ. (కాగితము పుచ్చుకొని నిష్క్రమించును.)

రుద్రమదేవి—(మల్లికార్జునునితో) ఈసేన లెవ్వరివని మీ యూహ?

మల్లికార్జునుఁడు—కోటవెలుపల చీఁకటిలో సరిగ పోల్చుటకు వీలులేకుండెను. ద్వారమునొద్ద జరిగిన పోరులో పట్టుపడినవారిని అడిగితిమి. బలవంతపెట్టఁబడియు వారు జవాబు చెప్పలేదు. కాని దుస్తులను బట్టి చూడఁగా (వక్రోక్తిలో) మన పూర్వమిత్రులగు ☞ దేవగిరివారివలె నున్నారు.

రుద్రమదేవి—(నవ్వి) పూర్వమిత్రులే యైనచో వారికి తగిన యాతిథ్య మిచ్చితీరుదుము. కాని ముట్టడి ముగియకముందు ఒక్క కార్యము నెఱవేర్పఁబడవలెను.

మల్లికార్జునుఁడు—అవహితుఁడను.

రుద్రమదేవి—కోటలో నిపుడున్న సైన్యము వీరోత్తంసులతో నిండియున్నను సంఖ్యలఁ గూర్చి యోచించునెడ మనస్సునకు తృప్తిగ లేదు.

మల్లికార్జునుఁడు—కొలఁదినాళ్ల క్రిందటనే ముప్పదివేల సేనలు బసవన్నతోఁ గూడ నేగెనుగదా.

రుద్రమదేవి—మేము తలంచునది ఆసైన్యభాగమును గుఱించియే. దూరప్రయాణము చేయవలెను కావున, బసవన్న సైన్యములను అలసటఁ జెందనీక, నెమ్మదిగఁ, గొంపోవుచుండును. కావున నిప్పటికి విశేషదూర మేగియుండఁడు.

మల్లికార్జునుఁడు—కాకతిలక్ష్మి యాజ్ఞ యేమి?

రుద్రమదేవి—మనకోటను ముట్టడించియున్న వైరుల సైన్యములలో నెవ్వరైన నొంటరిగఁ బ్రవేశించి, వారి నెలవుపట్లఁ గనిపెట్టవలెను. అట్లు కనిపెట్టిన తర్వాత వీలగునంత వేగముతోఁ బోయి, బసవదండనాథుని సైన్యముతోఁ గూడ వెనుకకుఁ బిలుచుకొని వచ్చి, అట్లువచ్చిన సందర్భము కోటలోనుండు మేమెఱుంగుటకై దక్షిణముగఁ గనిపించు నా గుట్టపై మూఁడువోట్ల పొగ లేవింపవలెను. అటు తర్వాత శత్రువుల నెలవుపట్లు వెడలునట్లు నెలవులనుండి వారిపై డీకొనవలెను. అట్లు డీకొన్నచో వైరుల సైన్యము రెండుముఖంబులై పోరవలసివచ్చును. అందుచే కోటపై నొత్తిడి తగ్గును. అప్పటి సందర్భముల ననుసరించి, కోటలోని సైన్యమును మేము నడపుదుము.

మల్లికార్జునుఁడు—ఈప్రకారముగ ఒక యాజ్ఞాపత్రము బసవన్నకు వ్రాయు మని మహారాజ్ఞి యానతియా?

రుద్రమదేవి—(యోచించి) వలదు. అట్టి యాజ్ఞాపత్రమునుఁ గొంపోవునాతఁడు వైరులచేఁ జిక్కునేని ఆ పత్రము కూడ వైరులచేఁ బడును. అప్పుడు వారు మన ప్రయత్నముల నెఱింగి, ప్రతిగా ప్రతివ్యూహములను బన్నుదురు. కావున శత్రువుల బలఁగముల నడిమినుండి బసవన్నకుఁ బంపఁబడు ఆజ్ఞ లిఖితరూపముకంటె వాగ్రూపమునఁ బంపుటే క్షేమకరము.

మల్లికార్జునుఁడు—అట్లయినచో ఎవ్వరిమాటనైతే రాజాజ్ఞగా బసవన్న తప్పక విశ్వసించునో అట్టివారే యీపనికై పోవలెనుగదా!

రుద్రమదేవి—అవును. అట్టివారే పోవలయును. ఇక్కడనుండి ... ఎవ్వరైన ముఖ్యులే పోవలెను. కాని యీపని చాల అపాయముతోఁ గూడినది. కోటలో ముఖ్య సేనా నాథులు ఎక్కువమంది లేరు. దండనాథుల పట్టిక అందున్నది. అందుకొనుఁడు ... ఆ పొడవు కాగితము.

(కొంచెము దూరమున బల్లపైనుండు నొక కాగితమును మల్లికార్జునుఁడు ఇచ్చును.)

రుద్రమదేవి—(ఆ కాగితము పరీక్షించుచు) ఎవ్వరిని బంపుదుము?

మల్లికార్జునుఁడు—ఆజ్ఞయైనచో నేనే పోవుదును.

రుద్రమదేవి—(సంభ్రమపడి) నీవా! బావా! ఇట్టిసమయమున నీవా! (విస్మయముతో నవ్వి, తలను అడ్డముగ నూఁచి) వేడుకగ మాటాడుచుంటివి.

మల్లికార్జునుఁడు—వేడుకమాటల కిది తరుణము కాదని యెఱుఁగనంతటి మూఢుఁడనా?

రుద్రమదేవి—(ఉద్వేగముతో) నిజముగ.

మల్లికార్జునుఁడు—విధేయుఁడను.

రుద్రమదేవి— నగరపాలక సేనాధికారివి. నీవెట్లు పోవనగును?

మల్లికార్జునుఁడు—ముట్టడివేళల సర్వసేనానియే నగరపరిపాలకుఁ డగును గదా!

రుద్రమదేవి—(విముఖముగ) నీవు పోవుటకు మేము అంగీకరింపము.

మల్లికార్జునుఁడు—అట్లంగీకరింపకపోవుటకు నా యసమర్థతయే కారణమగునా?

రుద్రమదేవి—(విముఖియై యూరకుండును.)

మల్లికార్జునుఁడు—నే నసమర్థుఁడ నని చెప్పుట కిష్టములేక మహారాజ్ఞి మాఱుపలుకుట లేదేమో. అట్లైనచో నాంధ్రసామ్రాజ్య లక్ష్మీసంసేవకుఁ డగు నీ ఖడ్గము ఈ దుర్బలుని చేతిలో నుండఁగూడదు.

(వరతోఁ గూడ కత్తి నియ్య బోవును)

రుద్రమదేవి—ఆఁగుము. ఆఁగుము. బావా! నీ సామర్థ్యమును గుఱించి సంశయ మెప్పుడును నాకు లేదు. లేదని నీవును ఎఱుంగుదువు. అట్లు సంశయించు మహారాజ్ఞి నిన్నాజ్ఞాపించుటయు లేదు. ఈ యపాయప్రదమగు పనిపై నీ వేగుట ఇష్టములేని నీ మఱఁదలు నిన్నాఁగుమనుచున్నది.

మల్లికార్జునుఁడు—మహారాజ్ఞి కేవలము మఱఁదలై మాటలాడుచున్నదా?

రుద్రమదేవి—అబ్బ! ఎట్లుమాట్లాడిన నేమి? ఈపనిపైఁ బోవుటకంటె కోటలోనేయుండి, నేను చూచి మెచ్చుకొనునట్లు పోరు సల్పరాదా?

మల్లికార్జునుఁడు—కోటలో నున్నచో పోరుసల్పు నవకాశము నాకు దొరకదు.

రుద్రమదేవి—ఏల దొరకదు?

మల్లికార్జునుఁడు—దొరకనీయకుండుట కీవు ప్రయత్నింతువు. (కోపముతో) రుద్రదేవీ! మఱఁదలి వలె మాటాడితివి. కావున బావనై నా యభిప్రాయమును తెలిపెదను. వినుము. కాకతివంశంబున జనింపకున్నను మన్మాతృమూలమునకైన కాకతీయనృపాలుర రక్తము ఈ నా శరీరమున ప్రవహించుచున్నది. ఇఁక మా వంశము ఐశ్వర్యమున కాకున్నను, ధైర్యసాహసములలో పేరుపొందనిది కాదు. అట్టి నన్ను మొదటి నుండియు వీరోత్తంసులకు తగునట్టి సాహసకార్యములందు చొరనీక నీవు ఆటంకపెట్టుచున్నావు. ఇట్లు కోఁతగొట్టువలెఁ గూర్చుండి తినుచు, క్రొవ్వుపెంచుకొనుట నా కిష్టము లేదు. ఇట్టి నన్ను తలఁచుకొని నేనే అసహ్యపడుచుందును. ఇతరులకు హాస్యాస్పదుఁడ నేల కాకుందును? అనావశ్యకముగ నిట్టి సంరక్షణ నీచే పొందుట కేను పసి బాలుఁడనా? భీరునకే కాని ధీరునకు తగనట్టి యీ బహిరంగ రాణివాసము చే నన్నేల యవమానపఱిచెదవు? మహారాజ్ఞివైన నగుదువుకాక. నీ కొఱకైన నన్నిట్లు వీరలోకముచే నవ్వించుట న్యాయముకాదు. నేనింక నిట్టి నిర్బంధమును సహింపను.

రుద్రమదేవి—(ఉత్తిష్ఠయై కోపగర్భితములగు శాంతవచనములతో) వీరవరులగు మీకుఁ గల సమరోత్సాహమును మేము వారింపము. మాకొఱకు ఒకరు నిర్బంధింపఁబడుటేల? మీ యిచ్ఛవచ్చినట్లు ఒనర్పుఁడు. (కొంచెము దూర మరిగి, విముఖియై కూర్చుండి, క్రొమ్ముడి స్పృశించుచు) దాదీ! తడిగనున్నవి. కురు లార్చుము. (కురులు విడఁబాఱునట్లు క్రొమ్ముడి వదల్చును.)

మల్లికార్జునుఁడు—కోపంబుగనున్న ముఖభావమున క్రమముగ నాశ్చర్యమును, ఆహ్లాదమును సూచించుచు తనలో) ఆహా! ఈమె కబరీభార విలాస మెంత శోభాకరముగ నున్నది! ఇప్పటికదా యీయమ సౌందర్యము కన్నులపండువుగఁ జూడఁగలిగితిని.

తే. నీలనీరమ్ము తరఁగల నిండి పాఱు
సమయముననె కృష్ణాపగా సారకళలు;
నిడుదనొక్కుల కురుల పెన్ముడిని విప్పి
జారవిడిచిన యప్పుడే చాన సొగసు.

తే. కనుము కోసల సోపాన పథములందు
వలికెనులఁ బాఱు కృష్ణాప్రవాహమట్లు
మరకతాదిక మేఘులా మణుల దాఁటి
నెలత నీలంపు నిగ్గుల నిమురు కురులు.

తే. వాలుజడ, జడచుట్టయు, కీలుజడయు,
త్రిప్పుముడి యను ఘనవేణి తీర్పు లన్ని
కూర్ప నత్యంత విభవంబు కోమలులకు
వరలి విడబాఱు పెన్నెఱి కురులు వోలె.

(దగ్గఱ కేగి, ప్రకాశముగా వినయముగా) దాది యింకను రాలేదు. మహారాజ్ఞీ సాహసచే మన్నింపఁబడుదునుగాక. బాకిని నెఱికురులు ఒడ్డాణపు గజ్జెలలోఁ జిక్కుపడునేమో. సరి చేయుదునా? (చేయి చాఁచును. చాఁచఁగా చేతిపైనుండు గాయము కనిపించును)

రుద్రమదేవి—వలదు. రాజసేవయందు సమయ తారతమ్య జ్ఞానముతో నుండవలెను. (తిరిగి చూచి) కాని యిదియేమి? నీ చేతిపై గాయ మున్నదే!

మల్లికార్జునుఁడు—(గాయముమీఁద వస్త్రముఁ గప్పి) నగరద్వారము మూయించు తొందరలో నేదో యినుపముక్క గీచుకొని యుండవచ్చును.

రుద్రమదేవి—బావా! గడెకల్లువులు మూయునప్పటి పోరులో శాత్రవుని కత్తిచే నైన గాయ మిది.

మల్లికార్జునుఁడు—(వినఁగను సూచించి) అయిననేమి! రాజ్యసంసేవలో ఈమాత్రపు గాయము తగిలిననే ... ... ... ...

రుద్రమదేవి—వివరములు నెమ్మదిగఁ దెలిసికొందును. కాని యిటురమ్ము. గాయముపై రక్తగ నిదే నా చేతి రుమాలుతో కట్టు కట్టెదను. చేయి చాఁచుము.

మల్లికార్జునుఁడు—సన్మానింపఁబడితిని. కాని వలదు. మహారాజ్ఞి యనుజ్ఞయిచ్చిన సమయ తారతమ్యజ్ఞానము ... ...

రుద్రమదేవి—(చిఱునగవుతో) బావా! ఊరకుండుము. పరిజనుల నిబంధనలు మా పట్ల వర్తింపవు. (చేతి గాయమునకు తన రుమాలును కట్టుచు, బావా! అపాయప్రదమగు నిట్టి

పనికై నీవే పోవలెనా? ... ... ... ప్రస్తుత సందర్భములఁ గూర్చి యాలోచింపుము. ... ... ... నీ చేతిపై బలమైన గాయముకూడ నున్నది. ఇంకొకరిని బంపనిమ్ము.

మల్లికార్జునుఁడు—(సందేహించుచు ప్రతి చెప్పకుండును.)

రుద్రమదేవి—(కట్టకడపట ముగించి) బావా! చెప్పవేమి? ఈపనిపై నెవ్వరిని బంపుదము?

మల్లికార్జునుఁడు—క్షమింపఁబడుదును గాక. రాజసేవా తత్పరత మహారాజ్ఞి యాజ్ఞకు వ్యతిరేకముగా నున్నది.

రుద్రమదేవి—రాజసేవ యన మహారాజ్ఞి యాజ్ఞానువర్తనమేకదా.

మల్లికార్జునుఁడు—మహారాజ్ఞి కేవలము మఱఁదలివలె మాటాడునప్పుడు కాదనియే చెప్పవలెను.

రుద్రమదేవి—నీకు మఱఁదలికంటె మహారాజ్ఞియే యెక్కుడయా?

మల్లికార్జునుఁడు—మఱఁదలు ప్రేమస్వరూప. మహారాజ్ఞి యాజ్ఞాస్వరూప. అదియుఁగాక నాకంటె సమర్థతతో నీ నగర పాలనాధికారము నెఱవేర్పఁగలవారు చాలమంది నాయకులు కలరు.

రుద్రమదేవి—నే దానిఁగూర్చి తలంచుట లేదు.

మల్లికార్జునుఁడు—తలంపనప్పుడు నా కనుజ్ఞ నొసంగిన నేమి? ... ... సాహసకార్యము నుండి నివారింపఁబడ నని సింహాసనమునుండి నాకు వాగ్దానము కూడ వచ్చినది.

రుద్రమదేవి—(కోపముతో) పలుమారులు పోయెదనన్నవారి నుంచుమనుటయు, వాగ్దానము నిచ్చి యనంతరము వెనుకాడుటయు, రెండును తప్పులే. కావున పొమ్ము. (కనులు వంచి) ఇతరు లాక్రమింపఁజాలని యింకొక పదవి నీ కుంచుట మఱచితివి కాఁబోలు.

మల్లికార్జునుఁడు—స్వారాజ్యమున కావశ్యక మగునప్పుడు ... ... ...

రుద్రమదేవి—(పొమ్మని సంజ్ఞ చేయుచు, దగ్గుత్తికతో) అనుజ్ఞ యొసంగఁబడినది.



మల్లికార్జునుఁడు—(కత్తి దూసి, అశ్వపాదనంబు పట్టి) మహారాజ్ఞి కార్యము సానుకూలమగుగాక.

(నిష్క్రమించును.)

రుద్రమదేవి—(ఒక్కింతసేపు విరమించి, విచారముతో) అకటా! కోపములో నొడలు తెలియక ... ఈతని ఆ శత్రుసేనలఁ నడిమికి ఒంటరిగ బోవ ననుజ్ఞ నిచ్చితినే! ... ... దాదీ!

దాది—(ప్రవేశించి) అమ్మా! ఇక్కడనే యున్నాను.

రుద్రమదేవి—త్వరగఁ బోయి, యాతని బిలువుము.

దాది—ఆజ్ఞ. (పోవుచుండఁగా)

రుద్రమదేవి—(తలయూఁచి) దాదీ! వలదు. ... ... పోవనిమ్ము. జన్మదేశసేవ పవిత్ర కార్యములలో మహోత్కృష్ట మైనది. ... ... ... స్వతంత్రబుద్ధి కల పురుషుఁడు ... ... సామంతుఁడై నను మెచ్చఁదగినవాఁడు ... ... ... మక్కువఁ గల చోట ... ... మనసు నిల్పుకొనుట, ... ... మహారాజ్ఞి నై యున్నను, మగువకు సంతృప్తిగ నుండును.

(ప్రతీహారిణి ప్రవేశించి.)

ప్రతీహారిణి—జయము. మహారాజ్ఞికి జయము.

రుద్రమదేవి—వచింపుము.

ప్రతీహారిణి—మహామంత్రి శివదేవయ్య, సర్వసేనాని ప్రసాదాదిత్యుఁడు, మఱియుఁ గొందఱు దండనాథులు, రాజోద్యోగులు ను సందర్శనార్థమై వచ్చియున్నారు.

రుద్రమదేవి—(నిమ్మదిగ) మంచిది. వారితో ప్రసంగించిన పిమ్మట మన సైన్యపరిస్థితులను మేము స్వయముగఁ బరీక్షింతుము. మా స్వారి యశ్వము నాయితపఱచి యుంచు మనుము.

ప్రతీహారిణి—ఆజ్ఞ. (నిష్క్రమించును)

రుద్రమదేవి—దాదీ! దుస్తుల సిద్ధపఱచుము.

దాది—అనుజ్ఞ.

(మహారాజ్ఞి లేవఁగా తెర దిగును.)



## చతుర్థాంకము.

### తృతీయరంగము.

---

ప్రదేశము—హనుమత్కొండవద్ద ఆంజనేయాలయము. సంధ్యచీఁకటి.

ప్రవేశము—రాఘవశర్మ, గుజ్జుపుత్తట్టు నొకటిని చేతఁబట్టుకొని.



రాఘవశర్మ—(హనుమంతునకు నమస్కరింపుచు.)

సీ. ఘనకార్యకరణ దక్షతకు బాల్యమునాఁటి
రవిబింబ కబళ నోత్సవమె సాక్షి
న్యాయైకపక్ష సాహాయ్య దీక్షకు వన
వాస సుగ్రీవ సేవనమె సాక్షి

వీర కారుణ్య ప్రసారంబునకు, జిత
లంకిణీ ప్రాణ పాలనమె సాక్షి
నియత ధర్మ వినమ్ర నిష్ఠా ప్రతిష్ఠకు
బ్రహ్మాస్త్రమునకు లోఁబడుటె సాక్షి

గీ. స్వల్పవాంఛావతీర్ణమౌ సత్యతత్వ
నైజ జిజ్ఞాసకును, రామనామవర్ణ
సాధనోత్సాహ వర వజ్రశోధ సాక్షి
యమరముని గేయ! మహనీయ! యాంజనేయ!

చ. చంగున నొక్కగంతునను సాగరముం గడదాఁటునట్లుగా
సంగవిమోహపాశ భవసాగర మీవవలీల దాఁటి, త
త్సంగమకారకత్వపదసామ్యముఁ గోరుట నిక్కమౌనె? నీ
వుం గనుతత్వవేత్తవు; ప్రబోధమనోంబుజ! మారుతాత్మజా!

సీ. అల దేవతల వరంబులఁ బొంది నీవు స
ర్వాస్త్రాసపాయత నందకున్న
రవిపుత్రునకు రఘురాముసఖ్యముఁ గూర్చి
భూమిజాన్వేషణఁ బూనకున్న
వార్ధి లంఘించి, రావణు లంక శోధించి,
సీతాసతీవార్తఁ జెప్పకున్న
సమరవీరులఁద్రుంచి, సంజీవమునుఁ దెచ్చి,
భూపు మూఁపున మోచి, పోరకున్న.

గీ. భరతునకు రామ జయవార్తఁ బలుకకున్న
రామునకు లోపమౌ! ... యైన నీ మహిమము
విడిచి వాల్మీకి కథ నెట్లు నడపియున్నొ!
యమరమునిగేయ! మహనీయ! యాంజనేయ!

(హనుమంతునకు మొక్కి)

హనుమంతునకు మ్రొక్కితిని. కావున సంకటముల నన్నింటిని సమయఁ ద్రొక్కినట్లే సంతోషింతును. సంతోషించునెడల సర్వార్థములు సిద్ధించు నని నా మతము. ఈ మతము పుట్టుకతోడనే నా కబ్బినది కాఁబోలు. ఎట్లనఁగా ముల్లుఁగ్రుచ్చుకొను నప్పు డెవ్వరికైనఁ గొంచెము కష్టము తోఁచును. కాని సందర్భముల వైచిత్రి చూడ నాకు నోరు పట్టనంత

నవ్వు వచ్చినది. "ధాన్యవతీనగరమునుండి ఈ తట్టుగుఱ్ఱము నమునఁగలుగునంత వేగముతో నిటకు వచ్చితిని. ఇది హనుమకొండ. అదె యోరుగంటి కోటపై దీపముల వెలుఁగు. ఇంకొకింత సేపటిలో కోటలోని మా యిల్లు చేరియుందును. కాని కోటచుట్టును ఈ క్రొత్త బలఁగ మొకటి యుప్పెనవెల్లువవలె క్రమ్మియుండుటచే దారి దొరకక నే నిక్కడనే యాఁగి పోవలసివచ్చెను. అలయుచున్నను గదలఁజాలని యీ నా గుఱ్ఱపుజాతిగాడిద యలసి యున్నదుటచేఁ బాఱిపోవ దనుకొని, దీని నొక పొదచాటున మేయ వదలి, యీ సైన్యముల బాగుగఁ జూచుటకీ గుట్ట యెక్కితిని. ఇంతలో నొక యేమఁ గెక్కడిదో "కుఁయ్యి" యని యఱవఁగా, నీ తట్టువున కెక్కడలేని మహోద్రేకము జనించి, నాతట్టు చూడకయే, తోఁక నెత్తుకొని, దౌడు తీయసాగినది. దీనిని బట్టుకొను ప్రయత్నములో, నాకీ ముల్లు గ్రుచ్చుకొనినది. ఇంతలో చీఁకటి పడినది. మా యిద్దఱకును ఈ యాలయమే యిప్పటికి శరణమైనది. గుఱ్ఱమునకు గడ్డిలేదు. కౌతునకు తిండిలేదు. ఆహా! సందర్భముల సామరస్య మిట్లుండవలెను. దీని కంతకును పర్యవసానము నాకీ ముల్లుదిగుటే కాఁబోలు! ప్రపంచస్థితి యీపాటిది. భగవంతుఁ డొక హాస్యగాఁడు. (గుఱ్ఱమును వదలి) పో నాపాలిఁటి శనివై దాపురించితివి. నీ యిచ్ఛ వచ్చినచోట రాత్రియంతయు పొరలాడి, వేకువ నే ముఖసమ్మార్జన మాచరించి——నా మాటలచే దీనికిఁగూడ నవ్వువచ్చుచున్నది! (పరిక్రమించి చూచి, ఈ దారి నెవ్వఁడో యింటి వాఁడు వచ్చుచున్నాఁడు. నాకువలెనే వీనికిఁగూడ ముల్లు దిగినదేమో! నేను ఈ యరుఁగుపైఁ బరుండి, నిద్రను నటించి, వీని చర్యల నరసెదఁగాక. (గుడి అరుఁగుమీఁద పండుకొనును)

(ప్రవేశము: —శనిగ్రహము.)

శని——ఏమో గ్రహరాజంబు లఁట! మంత్రిగ్రహము లఁట! గణకులఁట! సేనాధిపు లఁట! అందఱు కన్నియుఁ బెద్దపేరులే! చూడఁబోయిన పరాగరేణువంత మగతన మొక్కనికైన లేదు. నాకంటె నీ గ్రహవీరు లందఱును ఘనులా? అంద ఱన్ని పదవుల నాక్రమించుకొని, నాకు దివిపై బానిసతనము ... అట్టిదేయగు వేగువారిపని నిక్కడ నొప్పగించిరిగా! (తలయూఁచి) ఇందఱు మహామహులు చేరి, తగుదు మని, పనిలేనిపని పెట్టుకొని, యీ భూగోళమునకు వచ్చి, దేవగిరిసైన్యముల నీ రాజ్యముపైకిఁ బురికొల్పిరికదా! తమ మహారాజ్ఞీ వివాహమహోత్సవములందు ఈ యాంధ్రవీరు లెల్లరు నియతులై కార్యభారమగ్నులై యుండఁగా వీరల సంభ్రమింపఁజేసి, కోటను లోఁబఱుచుకొందు మని మా మిత్రులు తలంచిరి. కాని వారు జాగరూకులై యుండి యట్టి ప్రయత్నమును సాగనీయ లేదు. మహామహుల మని పెద్దపేర్లు పెట్టుకొని వచ్చిన వీ రందఱిలో ఒక్కొక్కఁడు తన గోళము చేరువఱకును జ్ఞప్తియుండునన్ని తన్నులు తిని పోవునెడ నేను మనస్ఫూర్తిగ సంతసింతును. కాని నా కొప్పగించిన పనిని చేయక తీరదు. ఇ దేదో దేవాలయముగా నున్నది. గ్రంథములుండు కాళి

కాలయము కాదుగద. (పరిక్రమించి చూచి) కాదుకాదు. ఇదేదో దారినిబోవువారు పూజసేయు ఆంజనేయాలయము వలె నున్నది. ఆహా! పరమపూజ్యుఁడా హనుమంతుఁడు. అసామాన్యప్రజ్ఞావంతుఁడు. పరోపకారి. అతనికీర్తి యెల్లలోకముల వ్యాపించియున్నది. నేనీ యాలయమునఁ బరుండి, సమాచారములను కనుగొనఁ బ్రయత్నింతును. (ఆలయపు టరుఁగుపై నెక్కి) ఓహో! ఇం దిదివఱకే యెవ్వఁడో పండుకొనియున్నాఁడు. నావంటి యింకొక వార్తాహారి కాఁడుకదా? ఆలోచించుకొనున దంతయు గట్టిగ గొణఁగుకొను చెడ్డయలవాటున్నదినాకు. వీఁడు నామాటలు వినియుండడు కదా. అయినను విచారింతము. ఒక్. గుఱ్ఱుపెట్టి నిద్రించుచున్నాఁడు. నిజమైన గుఱ్ఱ యింత సుదీర్ఘాన్వాటముగ నుండునా? చూచుటకు పెండ్లికొడుకువలె ముచ్చటగ నున్నాఁడు. ఈతనిని హఠాత్తుగ లేపుదో నిజముగ నిద్రించువాఁడైన కలవఁటఁడి లేచును. (వంగి లేపఁబోయి యరుఁగుమీఁదినుండి క్రిందికిఁ బడును.) అయ్యయ్యో! చచ్చితి. చచ్చితి. కాలు విఱిగినది.

రాఘవశర్మ—(తొందరగ లేచి) ఆఁ! ఆఁ! కాలు చచ్చినదా! కాలు చచ్చినదా! చచ్చుపడినదేమో!

శని—(తనలో) తప్పుమాట లాడుచున్నాఁడు. నిజముగ నిద్రలాగున నున్నది. (ప్రకాశముగ) కాలు చచ్చుట కాదయ్యా! నేను చచ్చితిని. కాలు విఱిగినది.

రాఘవశర్మ—చచ్చుట ముందా? కాలు విఱుగుట ముందా? చచ్చినతర్వాత కాలు విఱిగిననేమి? ముక్కలైన నేమి? నాకు నిజము చెప్పుము. నేను తార్కిక వేదాంతిని.

శని—నేను సిద్ధాంతిని. కాని నన్ను లేవదీయకున్నచో నీది కుతర్క వేదాంతమే.

రాఘవశర్మ—ఓహో! క్రిందఁ బడితివఁటయ్యా! మొదటనే యట్లు చెప్పక పోతివేమి? (పరిశీలించి) అమ్మా! ఎంత దెబ్బ తగిలెను. కాలు బెణికి వంకరపోయిన ట్లున్నది. నరములు బిగియకమునుపే సరిగా లాగనిమ్ము. (లాగును.)

శని—ఆఁ! ఆఁ! అదిమొదలేకుంటికాలు.

రాఘవశర్మ—బెణికిన దీకాలా? (రెండవది లాగును.)

శని—ఆఁ! ఆఁ! ఆఁగుము. ఏదియు బెణకఁ లేదు. బెణఁకునంత దెబ్బ తగిలినది.

రాఘవశర్మ—ఇంతేనా! లేచి యరుఁగుపైఁ గూర్చుండుము. (లేవదీసి) ఇదేమి. నీకు శనిగ్రహమునకువలె నొకటి కుంటికాలున్నది. బాగుగఁ జూడనిమ్ము. (మోము పరీక్షించి) నీవు కావయ్యా!

శని—(తనలో) వీఁడు నన్నెట్లు గుర్తుపట్టెనో! (ప్రకాశముగ) నేనేనయ్యా.

రాఘవశర్మ—కావు.

శని—(తనలో) వీఁ డేమి పిచ్చివాఁడా! (ప్రకాశముగ) నేనే!

రాఘవశర్మ—అట్లయిన నీ వెవరో చెప్పుము.

శని—ముందుగ నేనెవ్వరను కానో చెప్పుము.

రాఘవశర్మ—చెప్పెదను. ఈగుడిలో జ్యోతిషమునేర్చి ప్రశ్నము చెప్పఁగల యొక పూజారి యుండెను లెమ్ము. నీవు సిద్ధాంతి వనుటచే నాతఁడేమో యనుకొంటిని. కావు.

శని—నీవు వేదాంతి వంటివే. నే నాతఁ డేలకానో చెప్పుము?

రాఘవశర్మ—నీ కొక్కటే కుంటికాలు. ఆతనికి రెండును కుంటికాళ్లే. కావున నీ వాతఁడవు కావు. నా వేదాంతము సిద్ధాంతీకరింపఁబడెఁగదా?

శని—అట్లయిన నా సిద్ధాంతము నీచే వేదాంతీకరింపఁబడినది. నీవు పూజారి నేదో ప్రశ్న యడుగుటకు వచ్చితివి. అది నన్నే యడుగరాదా?

రాఘవశర్మ—మరేమియు లేదు. రాత్రి యెంత కడచెనో చెప్పఁగలవా?

శని—చెప్పుటకు నాకడ హోరాయంత్ర మున్నదా?

రాఘవశర్మ—లేకున్నను నక్షత్రముల లెక్కించి చెప్పలేవా?

శని—అదియా! నే నెఱుఁగుదును. శిరోనక్షత్రమును బట్టి యిప్పటి కేరాశి యుదయించుచున్నలగ్న మగునో, దానిలో భుక్తి యెంతయో యెఱింగి, అక్కడనుండి సూర్యుఁడున్న రాశిలోని భుక్తఘటికలవఱకు లెక్కించి, రాత్రికాలఘటికలనుండి తగ్గించినచో రాత్రికాలభుక్తి తెలియును.

రాఘవశర్మ—ఈ గొడవకు పంచాంగము కావలెను. అది చదువుటకు దీపము కావలెను. రెండు నిక్కడలేవు. చిక్కువవలెను.

శని—సరికాని నీవు చాల బుద్ధిమంతుడవు. ఇందాఁక శని కొక్కకాలంటివే! అది నీ కెట్లు తెలిసెను?

రాఘవశర్మ—ఈ లోకములో శని కొక్కకాలనియు, శుక్రున కొక్క కన్ననియు వాడుక కలదులెమ్ము. కాని శనిమాట తలపెట్టకుము.

శని—(నిశ్చేష్టుడై) ఆఁ! శనిమాట వలదందువేమి? శని అంత చెడ్డవాఁడా!

రాఘవశర్మ—ఈ లోకపు సందర్భము తెలియఁగనట్లు నీవు పల్కుచున్నావే! శని దుష్టగ్రహ మను మాట లోకప్రసిద్ధము కాదా!

శని—(తనలో) అరెరే! నన్నుగూర్చి యీలోకమున నిట్లు తలంచుచున్నారు కాఁబోలు. ఈయువకుని ద్వారా సందర్భమునఁ బాపుకొనవలెను. (ప్రకాశముగా) శని చాల మంచి వాఁడు సుమా.

రాఘవశర్మ—కానిమ్ము. మంచివాఁడే కావచ్చును. ఇదిగో చూడుము. మంచివాఁడవు. నా కా సేవలో ప్రవేశముఁ గలుగఁజేయుటకు నీ కం దెవ్వరైన పరిచయు లున్నారా?

శని—వా రందఱును మావారే. వారిలో నెవ్వరి కభిమానపత్రము వ్రాయుమందువు?

రాఘవశర్మ—అందఱకుఁ బనికివచ్చున ట్లొకటియే చాలును. నా కీ సాహాయ్యము చేసినందుకు మఱల నీ కేమి ప్రత్యుపకారము చేయఁగలను?

శని—అంత మంచివాఁడవైనచో నొక చిన్న పని చేసిపెట్టుము.

రాఘవశర్మ—ఏమది? చెప్పుము.

శని—శనిగ్రహమంత మంచివాఁడే లేఁడని యీ లోకమం దంతటను చాటించి రాఁగలవా?

రాఘవశర్మ—ఒస్! అ దెంత పని? ఇంతలో. (చిటికె వేసి) కాని శనిగ్రహమనిన అంత యభిమానము చూపుచున్నావు. అతఁడు నీ కొక విధమగు వేలువిడిచిన మేనమామయా?

శని—వేలు విడువని మేనమామయె.

రాఘవశర్మ—చాల దగ్గఱచుట్టమే! ఆ బయలున కత్తులను తళతళ మెఱపించు వారందఱును మీవా రంటివి. బహుశః వారిలో మీచుట్టమగు శని యుండవచ్చునా?

శని—(తనలో) ఇప్పుడు నిజముఁ బల్కుటే వీని మోసపుచ్చుట. (ప్రకాశముగా) నిజముఁ బల్కెదను. నేనే శనినయ్యా? వా రందఱును మా బంధువులైన రవి శశ్యాది గ్రహ రాజులును, వారి సహచరులును.

రాఘవశర్మ—(తనలో) వీని కబద్ధమాడుటందును నేర్పు లేదు. (ప్రకాశముగా) చాల గొప్ప వారలే. మీ రందఱు నెక్కడనుండి వచ్చితిరి?

శని—గ్రహము లెక్కడనుండి వచ్చును. ఆకసమునుండి.

శని—(తనలో) వీఁడు నన్నెట్లు గుర్తుపట్టెనో! (ప్రకాశముగ) నేనేనయ్యా.

రాఘవశర్మ—కావు.

శని—(తనలో) వీఁడేమి పిచ్చివాఁడా! (ప్రకాశముగ) నేనే!

రాఘవశర్మ—అట్లయిన నీ వెవరో చెప్పుము.

శని—ముందుగ నేనెవ్వరను కానో చెప్పుము.

రాఘవశర్మ—చెప్పెదను. ఈగుడిలో జ్యోతిషమునేర్చి ప్రశ్నము చెప్పఁగల యొక పూజరి యుండెను లెమ్ము. నీవు సిద్ధాంతి ననుటచే నాతఁడేమో యనుకొంటిని. కావు.

శని—నీవు వేదాంతి నంటివే. నే నాతఁ డేలకానో చెప్పుము!

రాఘవశర్మ—నీ కొక్కటే కుంటికాలు. ఆశనికి రెండును కుంటికాళ్లే. కావున నీ వాతఁడవు కావు. నా వేదాంతము సిద్ధాంతీకరింపఁబడెఁదా!

శని—అట్లయిన నా సిద్ధాంతము నీచే వేదాంతీకరింపఁబడినది. నీవు పూజారి నేదో ప్రశ్న యడుగుటకు వచ్చితివి. అది నన్నే యడుగరాదా?

రాఘవశర్మ—మరేమియు లేదు. రాత్రి యెంత కడచెనో చెప్పఁగలవా!

శని—చెప్పుటకు నాకడ హోరాయంత్ర మున్నదా?

రాఘవశర్మ—లేకున్నను నక్షత్రముల లెక్కించి చెప్పఁలేవా?

శని—అదియా! నే నెఱుఁగుదును. శిరోనక్షత్రమును బట్టి యిప్పటి కేరాశి యుదయించు చున్నలగ్న మగునో, దానిలో భుక్తి యెంతయో యెఱింగి, అక్కడనుండి సూర్యుఁ డున్నరాశిలోని భుక్తఘటికలవఱకు లెక్కించి, రాత్రికాలఘటికలనుండి తగ్గించినచో రాత్రికాలభుక్తి తెలియును.

రాఘవశర్మ—ఈ గొడవకు పంచాంగము కావలెను. అది చదువుటకు దీపము కావలెను. రెండు నిక్కడలేవు. చిక్కువచ్చెను.

శని—సరికాని నీవు చాల బుద్ధిమంతుడవు. ఇందాఁక శని కొక్కకాలంటివే! అది నీ కెట్లు తెలిసెను?

రాఘవశర్మ—ఈ లోకములో శని కొక్కకాలనియు, శుక్రున కొక్క కన్ననియు వాడుక కలదులెమ్ము. కాని శనిమాట తలపెట్టకుము.

(రాఘవశర్మ మూర్ఛనుండి గదలించుచు) మిత్రమా! రాఘవశర్మా! మిత్రమా! అరెరే! ఈతని కింతలో తెలివి రానట్లున్నది. ఏమిసేయనగును? (యోచించి) నాకొక్క యుపాయము తోచ కట్టుచున్నది. నేటి సాయంత్రము నగరద్వారమునొద్ద మాకుఁ బట్టువడిన దేవగిరిసైనికుని దుస్తు లివే. ఎందునకైనఁ బనికివచ్చు నని నాతోఁ దెచ్చితిని. ఈ దుస్తుల నీతనికిఁ దొడిగి, కోవెలచాటున నీతని దాఁచెదను. ఈతనికి ప్రియయగు లీలావతి కాళికాలయమున మట్టడింపఁ బడిన విషయము నొక చీటిపై లిఖించి యీతని జేబులో నుంచెదను. కాదు. అట్లుంచిన చీటి నీతఁడు వెంటనే చూచుట తటస్థింపదు. కావున ఈచీటి నీతని మెడకు కట్టెదను. క్రమంబుగ నీతఁడు తెలివిఁ గాంచి, తన మెడకు వ్రేలు చీటి చూచుకొని, లీలావతికిఁ దగిన సాయ మొసర్పఁ బ్రయత్నించును. నేను ఈతని వస్త్రముల ధరించి ఈచోటనే పండుకొందును. దేవగిరివారు నన్నే ఈ బ్రాహ్మణుఁ డనుకొని తమ శిబిరంబులకుఁ దీసికొనిపోవఁగలరు. ఈ కారణమున శత్రువుల శిబిరములలోఁ బ్రవేశించి, వారి పరిస్థితుల బాగుగఁ గనిపెట్టవచ్చును. ఆలయము చాటున నీతని దాఁచి వచ్చెదఁగాక. (రాఘవశర్మ నెత్తుకొని నిష్క్రమించును.)

(ప్రవేశము:— దేవగిరి భటులు)

ప్రథముఁడు—ఓరీ! ఈ కటికి చీఁకటిలో నిదేమి పనిరా మనపాలఁబడినది!

ద్వితీయుఁడు—పనిలేనిపని. ఆతఁడు చెప్పిన చోటిదే యైయుండవలెరా!

తృతీయుఁడు—వెదకండి. ఆ బ్రాహ్మణుఁడు పడియుండు కోవెల యిందే యుండవలెను. వెదకండిరా!

(భటులు చుట్టుపట్ల వెదకుచుండఁగా రాఘవశర్మవస్త్రముల ధరించిన మల్లికార్జునశర్మ భటు లెఱుంగకుండఁ బ్రవేశించును.)

మల్లికార్జునుఁడు—(తనలో) ఈ చీకఁటిలో నన్ను వీరు చూడలేకున్నారు. నాకత్తి ఈ బొక్కసలో పట్టలేదు. కావున దాని నొకచోట దాఁచితిని. సమయమున దీసికొందును. (అరుఁగుపై బరుండి కొంచెముగ దగ్గును.)

ప్రథముఁడు—అరే! ఇక్కడ నున్నాఁడురా. ఇంకా తెలివి లేకయే పడియున్నాఁడు. రండు. రండు. పట్టుకొందము. (భటులు మల్లికార్జునుపైఁ బడి పట్టుకొందురు.)

భటుడు—లే! లే! మాకుఁ జిక్కితివి. మాతోఁ గూడ రమ్ము.

మల్లికార్జునుఁడు—(లేచి, విస్మయము నటింపుచు) మీ రెవ్వరు?

ప్రథముఁడు—ఎవ్వరైన నీకేమి? నడువుము.

మల్లికార్జునుఁడు—వచ్చెదను.

(అందరు నిష్క్రమించుచుండఁగా తెరదిగును.)

చతుర్థాంకము సంపూర్ణము.





శ్రీ

# జ్యోతిర్లీల.

## పంచమాంకము.

### ప్రథమరంగము.

ప్రదేశము—ఓరుగంటికోటముందు విడిసియుండు దేవగిరిసైన్యములోని రాజశిబిరములలో నొకటి.

ప్రవేశము—ఆసీనులగు గ్రహపూరుషులు.

సూర్యుఁడు—గ్రహపూరుషులారా! మనము పారసీకులమని దేవగిరివారికిఁ దెలిపి, వారలను ఈ యోరుగంటి సామ్రాజ్యముపైకి దాడివెడలునట్లు ప్రోత్సాహపఱిచితిమి.

కుజుఁడు—ఔను. అదే యేకశిలానగరప్రాసాదము. పదిదినములనుండియు నుభయసైన్యములకును తీవ్రముగ పోరు జరుగుచున్నది. కోటగోడలపైకి ప్రాకి వానిని సాధించుటకు దేవగిరిసైనికులును, వారి నడ్డగించుటకు గోడలపైనుండి కాకతీయసైనికులును ఒకరితోనొకరు అధికోత్సాహముతో పోరుచున్నారు.

రాహువు—లేదా మఱి! రణము సల్పువారలను పురికొల్పుచు వారితో నడచుచుండుటయే మన కింత యుల్లాసకరముగ నున్నది. ఇఁక వారివలె ఆయుధములఁ బట్టి మనము కూడ రణమొనర్చిన నెంత మహోత్సాహముగ నుండునో!

సూర్యుఁడు—స్వయముగ మనము పోరు సలుపరాదు. మన గ్రహగోళబలమును దేవగిరివారలకు సహాయముగ నిచ్చి యుభయసైన్యముల పరాక్రమములను మనము వేడుకగ చూచుచు మన యీ భూలోకమునకు వచ్చుటకు ముందనుకొంటిమి. అందుకు వ్యతిరేకముగ నడిచినయెడల మన ప్రతిజ్ఞాప్రయత్నమునకు ప్రతికూల మేర్పడఁగలదు.

గురువు—మన కనుకూలములగు సూచనలింకఁ గనిపించుట లేదు.

శని—ఇట్టి సందర్భములలో త్వరపడరాదు.

బుధుఁడు—శనీ! నభస్సంచారమునఁ గల మాంద్యత నిక్కడ నుపపాదింపకుము. సూర్యమండలమునకు నలువదిలక్షల యామడల దూరమున నుండునట్టిదియు, ఒకకోటి నలువదిలక్షల యామడల పొడవు గలదియు, నయిన పరిధిమార్గము నంతయు నెనుబదియెనిమిది దినములకే మన్మండలాధిష్ఠాతనై పరిచలనము సలుపుట నాకు

శ్రమలేకుండెను గాని (దీర్ఘనిశ్వాసము వదలుచు) ఈ భూలోకమునకు వచ్చినదిమొదలు ఈ సేనలవెంటఁ దిరుగుచో గజముమొదలు ఖరమువఱకు నే వాహనము నధిరోహించినను ... ... అబ్బ (బొజ్జ నిమురుకొనుచు) నా కాయాసము కలుగుట తప్ప లేదు. నా కీ యుద్ధముల గొడవ చాలును. త్వరగ మనమన లోకముకు వెడలిపోవుదము.

శని—బుధా! సూర్యమండలమునకు ముప్పదియైదు కోట్ల యోజనముల దూరము లోపుగ సుందస్పష్టనియమిత దిక్చక్రముల వెంట వివృతమండల పరిమాణము గల మే మెల్లరము నుక్షణమునకు వందలు, వేలు, లక్షలు, కోట్లు యోజనంబుల వేగముగ పరిచలనము సలుపుట లేదా? పదునాల్గువందల యోజనములే మండలవేష్టి గల నీవె మహారాజు నాసతిని కొన్నినాళ్ళిచ్చుట తడయఁజాలవా?

బుధుఁడు—మండలపరిమాణముల కేమిలెమ్ము. ఎవరికిఁ దగినంత వారికే యున్నది. మహారాజగు నినికిఁ దగునట్లుగా మూఁడులక్షల యోజనములు మండలము చుట్టుకొలత. గురువునకు ముప్పదినాలుగువేల యోజనంబులు. శుక్రునకు మూఁడువేల యోజనములు. యువరాజగు చంద్రునకు ఎనిమిదివందల యోజనములే. ఇక్కడ నీరు కాని అనూరునకు పదుమూఁడువేలు! నభస్థాణునకు పన్నెండువేల యోజనంబులు మండల మధ్యమరేఖా ప్రమాణము. నామండలమునకు చుట్టుకొలత నీవుచెప్పినట్లు పదునాలుగువందలే. నీకు మండలవేష్టి ఇరువదియెనిమిదివేల యోజనంబులు; నీకు మండలవేష్టి యధికమునకెడ నాకు మధ్యమవేష్టి (బొజ్జ నిమురుకొనుచు) యధికము. కావున మఱియు నాయాసమునకు కారణము.

గురువు—అది యట్లుండనిమ్ము. మనమన మండలముల వదలి యింక విశేషకాలము మన మిక్కడ తడయ రాదు. ఏలయంటిరా ఆయా గోళప్రపంచములోని కాలభేదము ననుసరించి ఒకచోట క్షణము గడచిన వేఱొకచోట చాలకాలము గడచిపోవును. ఈ భూమిపై మన మిప్పటికి నెలదినములు కడిపితిమి. భూమికంటె నధిక కాలమానము గల కుజ గురు శని చంద్ర మండలములలో తక్కువదినములు నడచినను భూమికంటె నల్పమగు కాలమానము గల బుధ శుక్ర మండలములలో నెక్కువదినములు ఇంత లోపలఁ గడచియుండవలెను. ఇన్నిదినములు మన మన మండలములలో ధర్మప్రవర్తన మెట్లు నెఱవేఱుచున్నదో మన మూహింపవలసియున్నది.

రాహువు—కేతూ! ఛాయాగ్రహముల మగు మన కిద్దఱకును మండలములే లేవు కావున మన కేచింతయు లేదు.

కేతువు—అవును. సంసారముండుటే సకలయాతనలకును కారణము.

చంద్రుఁడు—గురువరా! సూర్యభగవానుఁడు మన కెల్లరకు నధిష్ఠాత యైయుండఁగా నెచ్చటను నెట్టి ధర్మలోపమును వాటిల్లదు. ఇఁక, మన మిక్కడకు వచ్చిన కార్యమునకు పర్యవసాన మగు ధర్మము ను తీర్మానించుటకై త్వరపడవలయు ననుటయు సమంజసమే. (సూర్యు నుద్దేశించి) దేవా! దీనిఁగూర్చి దేవగిరిప్రభువగు మహాదేవరాజుతో నుచితరీతిని తా మానతీయవలెను.

సూర్యుఁడు—అవును. అట్లే. కాని, చూచితిరా! ఈ వ్యవహారమున మనకును మన మిత్రులగు దేవగిరివారికిని లక్ష్యస్థానము ఒకింత భేదించుచున్నది. పూర్వవైరమే ప్రధానముగ నెంచు, మనమిత్రుల యుద్రేక మంతయు, ఈ రాజధానీనగరంబుయొక్క కోటగోడలపైఁ జూపఁబడుచున్నది. భాస్కరాచార్యుని ప్రయత్నభంగమునే ముఖ్యముగ నెంచు మనకు ఆ కోటవెలుపలి దేవళములోని గ్రంథసాధనమే లక్ష్యము. దీని గుఱించి మహాదేవరాజుతో నిదివఱకు ముచ్చటించితిని. మఱల నతనితో నాలోచించెదము. అదిగో! అతఁడు నిదే వచ్చుచున్నాఁడు. చంద్రా! పోయి యాతని నెదుర్కొని తోడితెమ్ము.

చంద్రుఁడు—ఆజ్ఞ.

(చంద్రుడు ఎదురేగి, మహాదేవరాజును మఱియు కొందఱు దేవగిరినాయకులను తోడితెచ్చును. గ్రహపూరుషులును, దేవగిరివారలును, కుడిచేతులను నిలువుగా పైకి చాచి యొకరినొకరు సన్మానింతురు.)

సూర్యుఁడు—వీరులారా! ఆసీనులగుఁడు. (అందఱాసీను లగుదురు.) కోటగోడలపై మన ప్రయత్నము లెంతవఱకు నేఁటి పగట జయప్రదములుగ నున్నవి?

మహాదేవరాజు—మిగుల బలమైనవియు, ఎత్తైనవియు, సమరపరిచితులగు వీరులచే సంరక్షింపఁబడునట్టివియు నగు, ఓరుగంటి కోటగోడలను, నాటకములోని కాగితపు తెడకలనువలె, నొక్కసారిగ నణఁగఁద్రొక్కుట దుర్ఘటమగు కార్యము. అయినను, నేఁటి యుదయమున మాసైన్యము లెట్లు డీకొనినవో మీలో చంద్రుఁడను పేరుగల యీ పారసీకప్రభువు నాచెంతనే యుండి చూచుచు, సేనల పురికొల్పుచు వచ్చెను. ఆయననే విచారింపుఁడు.

చంద్రుఁడు—అవును. కోటగోడల సాధించు ప్రయత్నమున దేవగిరివీరులు నేఁటిపగలంతయుఁ జూపిన సాహస మెంతయని చెప్పఁగలను.

సీ. ఘన శిలాతతిఁ దెచ్చి, కందకంబులఁ బూడ్చి,
కోటపై రాల్ రువ్వ మీఁట వదలి,
మ్రోఁకుతునకల మల్చి, మదపుటేన్గుల కిచ్చి,
గడిదార్ల తల్పులఁ బొడవఁ జేసి,

గొప్ప నిచ్చెన లేర్చి, కోటగోడకు వాల్చి,
పండ్లఁ గత్తులఁ బట్టి, పైకిఁ బ్రాకి,
యుఱుకుసీరును తారు పడివాన కురియంగ
ఛత్రంబులటు డాళ్ళఁ జాఁచి పట్టి,

తే. పడిన తమవారిఁ గని, జంకుపడక, సలుక
చెరుఁగు తేనెగుమ్ముల యట్లు పెచ్చుపెఱిగి,
సమర మొనరించు వీరుల సాహసంబుఁ
గనవలెంగాక యింతింత యనఁగ రాదు.

సూర్యుఁడు—సత్యము. సత్యము. మనమిత్రుల ధైర్యసాహసములును మన మండలమును కన్నులారఁ జూచుచునే యుంటిమిగదా.

మహాదేవరాజు—అయినను కోటగోడలపై మా సైన్యములు మఱికొంత యుత్సాహముతోఁ బోరకుండుట కొక కారణ మున్నది.

సూర్యుఁడు—ఏమది?

మహాదేవరాజు—ఈ రాజ్యమునకు గణపతిచక్రవర్తి కొమార్తె యగు రుద్రాంబ యను యువతి రాణిగా నున్నది. ఆమె కిప్పుడు తన మేనత్త కొమారునితో వివాహ మఁట. ఇట్లు వివాహము జరుగుచున్న కోటను ముట్టడించువారికి అపజయము కలుగునను నమ్మకము మాదేశమునందుఁ గలదు.

రాహుతుఁడు—ఇట్టినమ్మకమును ధీరులు ఆదరింపఁదగునా! ఇంతటి వీరులు ఒక్క పెండ్లికూఁతునకు భయపడవలసినదేనా?

మహాదేవరాజు—ఏమో మాదేశపు సేనలకుఁ బెండ్లికోటను ముట్టడించు నాచారము లేదు.

శని—మహాదేవరాజా! అట్లయినచోఁ నిట్లు నిరుత్సాహులగు మన సైనికులను నిట్టి సమయమున, కష్టసాధ్యములగు కోటగోడలపైకిఁ బ్రాకించుటలోఁ శ్రమపెట్టుటకు బదులుగా, సులభముగ సాధింపఁదగిన ఆ దేవళప్రాకారములపైఁ బ్రయోగించి, వాని భేదించి, అట్టివిజయముచే నుత్సాహపూరితులగు వీరిని మరల కోటగోడలపైకిఁ ద్రిప్పుట మంచిపద్ధతిగా నాకుఁ దోఁచుచున్నది.

బుధుఁడు—దానిలోఁ గూడ నింకొక పెండ్లికూఁతు రున్నదేమో!

సూర్యుఁడు—బుధా! హాస్యము వలదు. మహాదేవరాజా సెలవిమ్ము.

మహాదేవరాజు—(కొంచెముగ నవ్వి) ఈ దేవళమును సాధింప నెందుకు మీకు అంతయుత్సాహముగ నున్నదో నే నూహింపఁజాలకున్నాను. అయినను, స్థలపరిస్థితుల నొక్కింత వివరించెదను. చూడుఁడు. ఆ కనిపించునవే [illegible] ఏకశిలానగర ప్రాకారములు, కందకములు. ఆ గోడలకు నించుమించుగ నర్ధక్రోశంబు దూరంబున, నదే, మీరు ప్రస్తావించిన [illegible] కాళికాలయము. లోపలి దేవళ మెంతచిన్న దైనను ప్రాకారములు మాత్రము బలహీనములుగా నగపడవు. ఆస్థలమును సంరక్షించు సైనికులు, సంఖ్యలం దెట్లున్నను సాహసమునందు అల్పులు కానట్లు పోయినకు మొన్నటిదినము దారిలో వారి నడ్డగించిన మ న వా రే చెప్పఁగలరు.

కుజుఁడు—కావున?

మహాదేవుఁడు—కావున కొలఁదిసైన్యముతో నా దేవళమును సులభముగ సాధింపఁజాలము. ఇఁక, కోటగోడలపై డీకొనువారినుండి విశేషసంఖ్యల నచటికిఁ ద్రిప్పితిమేని, కోటపై నొత్తిడి తగ్గును. అప్పుడు కోటలోనివారికి విశ్రాంతి చిక్కును. అట్లు విశ్రాంతిని కలుగనిచ్చితిమేని ... ... అట్లు కలుగనీయ రాదు.

రాహువు—పోరులో నొకంత తెఱపి కలుగునెడ కోటలోపలివారికిఁ గొంచెము విశ్రాంతి కలుగునేకాని అంతలో వారు మరల నేమిచేయఁగలరు.

మహాదేవుఁడు—అవ్వలిసేనాని నిపుణుఁడేని, యట్టివిశ్రాంతిని ఊరకపోనిచ్చునా? ఎవ్విధముగ నైన నుపయోగింపఁగలఁడు.

కేతుఁడు—ఆ గోడలవారు చేసుకొంతెపువానితో తలవంచుకొని కూర్చుండియుండు పెండ్లి కూతురుగ నబలయేకదా వారి సేనాని.

మహాదేవుఁడు—అబల యని తృణీకరింపరాదు. పోరాడు బంటునకువలె పోరాడఁజేయు సేనానికి దేహబలము ముఖ్యము కాదు. ఏ సమయమునకు, ఏ సైన్యభాగమును, ఎటు త్రిప్పవలెనో తెలిసియుండఁ జాలును. మఱియు, నామె దేహ మనోబల సంపన్నురాలని వినుచుంటిమి.

సూర్యుఁడు—మహాదేవరాజా! తా మంతగ సందేహపడవలసిన యవసర మిది కాదేమో యని నా తలంపు. మన సైన్యము లింక నేమూలలను చెక్కు చెదరక యున్నవి.

మహాదేవుఁడు—(నవ్వుచు) అవును. అదియు నిజమే, ... ... మన సైన్యముల కింత వఱకే లోపమును లేదు. నష్టము చాలవఱకు కోటలోనివారికే కలిగినది.

సూర్యుఁడు—కావున, నిట్టిసమయమున, సులభసాధ్యమగు విజయము చేకూర్చి, మనవారికి మఱింత యుత్సాహముఁ గలిగించిన నేమి?

తే. సేవకులచెంత చనవునఁ జేరఁ బోఁడు,
దీనజనులకుఁ దగురీతి దాన మిచ్చు,
కాంచఁగా స్నేహపాత్రుఁడై కానిపించు
మహిత వంశోద్భవుం డైన మానవుండు.

మహాదేవరాజు—ఇట్టి సద్గుణములు కల యాతఁడు ఇప్పుడు వీరితోఁ జెప్పకయే పాఱి పోవునా!

చంద్రుఁడు—అతని నిందు నిర్బంధమున నుంచితిమి కాని, పోననునట్లు అతనివలన విశ్వాసము పుచ్చుకొని స్వేచ్ఛమై తిరుగనీయ లేదు. అతఁడు పోవఁదలఁచినచో, అందఱను బడమోఁదియే పోఁగలఁడు.

(ప్రవేశము:—నీలకంఠుఁ డను దేవగిరినాయకుఁడు దేవగిరి సైనికుని దుస్తులతో, కృత్రిమమగు గడ్డముతో నుండు రాఘవశర్మ, మఱికొందఱు దేవగిరి సైనికులు.)

మహాదేవరాజు—నీలకంఠా! వచింపుము.

నీలకంఠుఁడు—శని యను పేరుగల యీ పారసీకమిత్రుఁడు, యుద్ధ మారంభమగునాఁటి రాత్రి, మన బంట్లచే మోయించుకొనివచ్చిన యాతఁడు పాఱిపోయెను.

శని
చంద్రుఁడు } —పాఱిపోయెనా!

మహాదేవుఁడు—పోవుచుండఁగ మనభటు లాతని నడ్డగింప లేదా!

నీలకంఠుఁడు—అడ్డగించినవారినెల్ల నాతఁడు చిందరవందరగాఁ బడఁగొట్టి, (రాఘవశర్మను జూపుచు) ఈ మహాసైనికుని యశ్వముపైనుండి పడఁద్రోసి, యాతని గుఱ్ఱము నెక్కి మన సేనలను దాటిపోయెను. (రాఘవశర్మతో) ఓసీ! వివరములను విన్నవింపుము.

రాఘవశర్మ—ఏమివివరములు!

నీలకంఠుఁడు—నీ పాటును గూర్చి.

రాఘవశర్మ—నా పాటా! (కడుపు పట్టుక ఏడ్వఁబోవుచు) నడుము విఱిగినది. ఇఁక సాపాటే నా పాటు. అతని పిడికిటిపోటులు గుజ్జురెమ్మలవలె కమ్మగా నుండినవి.

నీలకంఠుఁడు—(తీవ్రముగ) మహారాజులతో వేడుకయా! సరిగఁ జెప్పుము. నిన్నాతఁడు గుఱ్ఱముపైనుండి క్రిందికి బడఁద్రోయ లేదా?

రాఘవశర్మ—అదా! దానినిగూర్చి చెప్పుట కేమున్నది? (చిటికెలు వేయుచు) చిటుక్కున వచ్చెను. తటుక్కున నన్ను గుఱ్ఱముపై నుండి పడద్రోసెను. కిటుక్కున నా గుఱ్ఱముపై నెక్కెను. లటుక్కున పాఱిపోయెను. పెటుక్కున నా నడుము విఱిగెను.

మహాదేవుఁడు—(నవ్వుచు) క్రిందనుండువాఁడు త్రోసినంతనే గుఱ్ఱము పయినుండి పడిపోవు నంతటి చేఁతకానివాఁడు మా సేనలోనుండుట మా కపకీర్తి. బడిగుఱ్ఱము వీఁపున నిన్ను గట్టి, నీకు సరియైన స్వారి తరువాత నేర్పెదను. (గృహపూరుషులతో) మిత్రులారా! మన మింతవఱకు తలంచుచుండిన సమర సన్నాహముల రేపు రేపకడనే చేయింతము. నేఁటి రాత్రి కింక సాపడి విశ్రమింతము. రండు.

గృహపూరుషులు—అట్లే. (అందఱు నిష్క్రమింతురు. రాఘవశర్మ మాత్రము వెనుకకు తగ్గి నిలుచును.)

రాఘవశర్మ—(నవ్వుచు) ఈదుస్తులలోనున్న నన్ను రాఘవశర్మనుగా లీలావతియైన గుర్తుపట్టఁ గలదో లేదో! నా మిత్రుఁడగు మల్లికార్జునుఁడు పుస్తెవలె నామెడకుఁ దగిలించిన యీ చీటిని జూచుకొనువఱకును నన్ను నేనే గుర్తింపలేకుంటిని. అదిగాఁక కృత్రిమ శ్మశ్రువుల నలంకరించుకొంటిని. నన్ను విస్మృతునిగాఁ జేసిన యీ మాంత్రికుఁడుగాని యితరులుగాని వారిబంటుగానట్లు ఇన్నిదినములనుండియు నన్నుగూర్చి యనుమానించి యైన నుండలేదు. ——— ఆ మాంత్రికుఁడు నాకును, నామూలమున మా రాజ కార్యమునకును మిగుల నుపయోగకారి యయ్యెను. ఎట్లనిన నేను విస్మృతునిఁగాఁ జేయఁబడుటచేతనే నావస్త్రములు నామిత్రున కుపయోగకరము లయ్యెను. తరువాత నాతఁడు నాకుఁ దగిలించిన యీ దేవగిరి సైనికుని దుస్తులలో నే నుండుట కారణముననే వీరల సైనికాశ్వము నొకదానిని సాధించుటకు వలనుపడెను. అదియు నాతనికే యుపయుక్తమగుట నాకెంత సంతసముగ నున్నది. కాని, మర్యాదలేక, యెముకలు విఱుగునట్లు గుఱ్ఱమునుండి క్రిందికిఁబడఁద్రోసెను.

(తెరలో గంటమ్రోఁగును.)

అదిగో దేవగిరిసైనికులు సాయుధులై విశ్రమించు సమయమైనట్లున్నది. వారలలోఁ జేరి నిదురించి, మావారి కెట్లు సాయపడఁగలనో రేపుదయము చూచెదఁగాక.

(నిష్క్రమించుచుండగా తెరదిగును.)



## ద్వితీయరంగము.

---

ప్రదేశము—తెరలో యుద్ధసంబంధమైన కలకలము. రణభూములకు కొంతదూరమున నొక గుట్ట.

(ప్రవేశము—మల్లికార్జునుఁడును, బసవన్నయు, అలసిన గుఱ్ఱముల చేతఁబట్టుకొని.)

మల్లికార్జునుఁడు—సైన్యంబుకంటె మనము ముందుగ నుడాయించుకొని వచ్చుటచే నశ్వము లెంత యలసినవి.

బసవన్న—అదియుఁగాక పొద్దెక్కి యెండతీవ్రమగుచున్నదికదా! అశ్వములమాట కేమి కాని, మల్లికార్జునకుమారా! నీవు ధైర్యశాలివైనను, పెండ్లికుమారుఁడవు కానుండిన సమయమున, నింతసాహసము చేయఁగూడదనుసుమా! మహారాజ్ఞి నీ కొఱ కెంత పరితపించుచున్నదో!

మల్లికార్జునుఁడు—సమయము వచ్చినప్పుడు నీవు మాత్రము ... ... ...

బసవన్న—ఏమీ! శత్రువుల సమూహము నొంటరిగినా? నిరాయుధుఁడవు! తొమ్మిదిదినములే!

మల్లికార్జునుఁడు—ఇంతకుముందే వారినుండి రాఁబయల్వెడలితినిగాని, రాత్రియైనాకు గుఱ్ఱము దొరకుటకు వీలుచిక్కినది. గుఱ్ఱము లేనిదే, యంతశీఘ్రముగ నిన్ను గలిసికొనఁగలిగి యుందునా? కాని బసవన్నా! నేను చెప్పిన నమ్మకుంటివి. అదిగో! చూడుము.

బసవన్న—(పాఱఁజూచి) ఆశ్చర్యాశ్చర్యము. అబ్బురము.

మల్లికార్జునుఁడు—నిన్నరాత్రి త్వరపెట్టి ససైన్యముగ వెనుకకుఁ బిలుచుకొని వచ్చుటందునుఁ గారణము కలదందువా! లేదందువా?

బసవన్న—కన్నులఁ గనఁబడుచుండఁగ నెట్లు లేదందును. కాని యేమి విపరీతము! నేను బయలుదేఱి పూర్తిగ పదునైదు దినములు కాలేదు. అప్పుడే కబురేలేని యీ శాకీమూఁకయంతయు నింతలో నెటనుండి ప్రత్యక్షమైనది!

మల్లికార్జునుఁడు—కొంచెము పాణినీకమునుండియు, విశేషముగ దేవగిరినుండియు నని వారి వల్లనే వింటిని. కాని సైన్యముతో మే మిట వచ్చియుంటిమట కోటలోనివారికిఁ దెలియుటకు ఈ గుట్టపై మూఁడుచోట్ల పొగ లేఁగునట్లు చేయుమని నా కాజ్ఞయైనది. రమ్ము. ముందుగ నట్లొనరింతము.

బసవన్న—అట్లేని ఆ యెండుకట్టెలను విఱిచి, మూఁడుచోట్ల పోగులుగఁ బెట్టెదను. (అట్లుచేసి, గుఱ్ఱముపైనుండు నా బొక్కసములోని చెకుముకిరాలి నిటు తెమ్ము. నేను

కొన్ని యెండాకులను, కొన్ని పచ్చియాకులను తెచ్చెదను. ఎండాకులు రగులుటకును, పచ్చియాకులు పొగను దట్టముగ జేయుటకును బనికివచ్చును. (అట్లొనరించును.)

మల్లికార్జునుడు—చాలు. చాలు. అంతకంటె నెక్కువ యగునేని కోటవెలుపలి శత్రువుల కనుమానము తట్టును.

బసవన్న—(అటు చూచి) ఒకడా! యిద్దఱా! సముద్రమంత సైన్యము. సకలాంగయుతము. రాష్ట్రింపు హద్దులఁ గాపాడు దుర్గములలోనివారు నిద్రపోవుచుండిరా? లెక్క కెక్కువ యగు వార్తాహరు లేమూలనుండిరి? ఇంతసైన్యము వచ్చునప్పుడు తప్పక రానుండిన యుపద్రవమునుగూర్చి దారి పల్లెల, పట్టణముల వారందఱును తుపానునకు ముందు గాలివలె బయలుదేఱి దేశమునంతను ఏల కల్లోలపఱుపలేదు?

మల్లికార్జునుడు—ఈసైన్యములను పల్లెలఁ బట్టణముల సంటనీయక, యరణ్యమార్గముల రాత్రివేళల నడుపుచు, నెవ్వ రెఱుంగకుండ, రాజధానీప్రాంతములకుఁ గొనివచ్చిరఁట.

బసవన్న—ఎవ్వరు కొనివచ్చిరి? విదేశీయులకీ దుర్గమారణ్యమార్గము లెట్లు తెలిసెను.

మల్లికార్జునుడు—మన రాజ్యముపై నీర్ష్యతోనుండు దేవగిరివారలే వారికి దారి చూపి యుండవలెను.

బసవన్న—దేవగిరివారికిని మనకును పూర్వవైరమున్నది కాని ఈ పారసీకులకు మనపై వైర మెందుకు?

మల్లికార్జునుడు—బసవన్నా! తెలియనివానివలెనే యడిగెదవేల? నిస్సారభూప్రదేశముల నివసించు పశ్చిమోత్తరఖండవాసులీ రత్నగర్భయగు నార్యభూమికి వచ్చు టెందుకు?

బసవన్న—సరే. ఎందుకైననేమి! ఎట్లయిననేమి? వచ్చిరి. కోటను ముట్టడించిరి. ప్రస్తుతము మన మాలోచింపవలసిన విషయము లింకవఱకే.

మల్లికార్జునుడు—కావున నిప్పుడు చేయఁదగిన దేమున్నదో యాలోచింపుము.

బసవన్న—(వెనుకకుఁ దిరిగి చూచి) మన మశ్వంబుల నతిత్వరితంబుగ నుఱికించుకొని వచ్చుటచే మన సైన్య మింకను వెనుకఁబడినది. ఒకంతలో కలియఁ రాఁగలదు. అంతవఱకీ మిట్ట యెక్కి, తలపడు నుభయసైన్యముల పరిస్థితులఁ బరీక్షింతము. పిమ్మట కర్తవ్య మాలోచించెదము. గుఱ్ఱముల నీ పల్లమునందలి వృక్షములకుఁ గట్టుదము. (గుఱ్ఱములఁ గట్టి, మిట్టయెక్కి చూచి) ఔరా! శత్రువుల కెంత పెద్దబలఁగమోయీ! మల్లికార్జునా! ఇటు చూడుము!

ఉ. నేలయె యీనినట్లిచట నిండి, సమీక్ష వివేక విక్రమో
ద్వేల భయానక ప్రకట వీర హృదుత్సవకారణ ప్రభా
జాల సముజ్జ్వలంబు లగు శస్త్రపరంపర లొప్పఁగా, మహా
భీల చమూ సమూహములు పేర్చి, రణాంబునఁ దాఁకెఁ, జూచితే!

మల్లికార్జునుఁడు—కోట నాక్రమింపవచ్చు శత్రుబలంబులను మా వారెట్లు నిరోధించి నరకుచున్నారో చూడుము!

సీ. గడితల్పులను గ్రుమ్ము గజ గండ కుంభముల్
కుంతంపు మొనలచేఁ గ్రుంగఁ బొడిచి,
మేటి నిచ్చెన లెక్కు, కోటగోడకుఁ బ్రాఁకు
బంట్లు తుట్టెగఁ గూల బండ వేసి,
పైన కాలూనిన భటుల కత్తులవ్రేట్ల
డాళ్ళడ్డి, తిరుగుఘుట్టనలఁ జమరి,
ప్రేవుల వెలికీడ్చు పెద్దగాయం బైన
మోము చిట్లని ధృతి మోపి, పోరి,
గీ. "రమ్ము రా! చూత మిటు నైన రా" మ్మటంచు
పరులఁ దరుముచో వ్రేటంగి పడియుఁ, గోట
వీరులన్ బోరఁ బురికొల్పు శూరవరులు
భద్రముగఁ గాచు కోట కేభయము లేదు.

బసవన్న—కాని వైరులుమాత్రము సులభముగా వెనుకాడువారా!

శా. ప్రాకారంబుల నెక్కుచో శతఘ్నులున్ బల్ రాళ్లు దట్టంబుగా
వీకన్ బైఁబడ నేయు దేశ్యభటులన్ విశ్వప్రయత్నంపు టు
ద్రేకం బొప్పఁగ డిగ్గఁద్రోచి యురలన్, ధీరాత్ములై కోటకున్
బ్రాఁకన్ జంకరు శత్రువీరులు జయప్రారంభ సంరంభులై.

మల్లికార్జునుఁడు—ఉభయపక్షములవారును, సమానశౌర్యసాహసములతోఁ బోరుటచే నింకను జయాపజయసూచన లెవరియందును కనిపించుట లేదు.

గీ. సమబలోన్నత సాహస శాలు లైన
వీరు లుభయపక్షంబులఁ బోరు నపుడు
తుల్య భార బాహుద్వయ తులిత మైన
తులను జయలక్ష్మి యిట్లిట్లు తూఁగు చుండు.

బసవన్న—ఐనను వివరముగాఁ బరికించినచో కోటగోడల యుద్ధమున మనవారికే గెల్పుగా నున్నట్లగపడుచున్నది. (సైనికుల నుద్దేశించి)

ఉ. మేలు! బళీ! స్వదేశజన మేదురకీర్తి మహత్వకారులా
రా! లలితప్రపూత మతిరమ్యము నౌ మన మాతృభూమికై
యాలముఁ జేసి, జన్మఋణమం దొకకొంచెముఁ దీర్చు మీరలే
చాల పవిత్రు; లల్లదిగో! జంకఁ దొడంగెను శత్రుకోటులున్.

మల్లికార్జునుఁడు—మిత్రమా! ప్రస్తుతము కోటకువచ్చిన యలజడి తగ్గినది. గోడలపైనుండి శాత్రవులు తరుమఁబడిరి. కాని, వారిలో చాలమంది ఆ కాళికాలయమునకు నడచుచున్నారే! అటు చూడుము.

బసవన్న—(చూచి) అన్నాన్నా! ఈవైపు సందర్భములు మనవారలకుఁ గొంచెము విపరీతముగఁగూడ నున్నవే!

మల్లికార్జునుఁడు—అవునవును. అచ్చటి మన సైనికుల సంఖ్య యత్యల్పము. అదిగో! విశేషసంఖ్యాకు లగు శాత్రవులచేత మనవారలు ప్రాణములఁ గోల్పోవుచున్నారు.

చం. కొలఁదియె రాష్ట్రిసైన్య మరికోటులు కోటులు చుట్టుముట్టి బి
ట్టలమిన బిక్కవోక ఘనులై మనవారలు పేరునిల్పఁగాఁ
దలపడి, పోరిపోరి, తమ దాఁకొనువారల నడ్డియడ్డి, వై
రుల ఘనసంఖ్య మీఱ నుసురుల్ వసివోదురు దేశసేనకై.

బసవన్న—ఔను. అరరే! అచట కోటపైఁ గవిసి యోడిన తమవారిఁ గని సిగ్గుఁ జెందుకొనక వైరులు తగుదు మని యీ దేవళంబుఁ గాచు చిన్నసైన్యంబునే ముట్టడి చేయుచున్నారు.

మల్లికార్జునుఁడు—మందము తక్కువగఁ గట్టబడిన యీ దేవళప్రాకార మింకను నిలిచియుండు టాశ్చర్యము.

చ. అలసుల వన్యజంతువుల కడ్డముగా నిడినట్టి దేవికో
వెల వెలిగోడ వైరిగజవిద్వర మింతకుఁ గాళికామహా
బలమున నాఁగెఁగాక యిఁకపైని గడుంగడు ఘట్టనంబులన్
నిలువదటంచు సందియము నిండెఁ గడుంగడుఁ దూలుచుండుటన్.

వెంటనే మనమేగి తోడ్పడనిచో నచటి మనవార లపాయమునకు లోనగుదురు. ప్రాకార మెట్లదరుచున్నదో చూడుము.

బసవన్న—అదరుచున్నను ఇంతలో పడదు. ఏలయంటివా! ప్రాకారంబులోపలినుండి మన వారలు అగ్నిచక్రంబుల విసరుటచే భీతిల్లి వైరుల యేన్గులు వెంటఁ జేరుకున్నవి. మనుజులింకఁ జేతులతోఁ బడఁద్రోయఁ జాలరు.

మల్లికార్జునుఁడు—అఁగినను ఎంతవఱకు కాఁగును? అరగంట నిలుచుట దుర్ఘటము.

బసవన్న—అరగంటలో ననేకములైన మార్పులు కలుగవచ్చును.

మల్లికార్జునుఁడు—పోరులో పాల్గొనకుండ మన మిక్కడనుండు టిం కెంతసేపు?

బసవన్న—ఆత్రంబుతోఁ గూడిన ధైర్య మన్నివేళలఁ బనికిరాదు. నా వెంట వచ్చు సేనలిదే చేరవచ్చెను. వానిచే రేపఁబడిన పరాగ మదిగో! వారు వచ్చువఱకును గుఱ్ఱముఁ గట్టియుంచుము.

మల్లికార్జునుఁడు—ఈవైపుఁ గోటపైఁ జూడుము. ఒకింత వెనుకకుఁ దగ్గిన శత్రుసేనలు మఱలఁ గవియ సమకట్టుచున్నవి.

బసవన్న—సమరోద్రేకము చూడ ముట్టడి దీర్ఘకాలము సాగించు నుద్దేశము శత్రువుల కున్నట్లు తోఁచును.

మల్లికార్జునుఁడు—మనకు నదియే మేలు. అబ్బ! కనునాళ్లు ముట్టడి సాఁగినచో కోటలోపలి ఘోరములకు మితి యుండదఁట.

బసవన్న—అది సందర్భముల ననుసరించి యుండును. కాని అదేమి! లోపలనుండి కోట యొక్క పెద్దద్వారము తల్పుల నట్లు కదలించుచున్నారే!

మల్లికార్జునుఁడు—అరరే! ఎవ్వరో తెఱవఁ బ్రయత్నించుచున్నారే!

బసవన్న—ప్రయత్న మేమిటి? తెఱవనే తెఱచిరి!

మల్లికార్జునుఁడు—ఇదేమి విడ్డూరము! ఏదైనఁ గృతఘ్నులగు నాతతాయుల కృత్రిమ మనుకొనుటకు ... ...

బసవన్న—అదికాదు! అదికాదు! చూడుము! కోటలోనుండి కొంత గుఱ్ఱపుదండు వెడలుచున్నది!

మల్లికార్జునుఁడు—బసవన్నా! ఏమి యింత! కోటలోనుండి దాడిచేయు నవసర మిదియా?

బసవన్న—అవసరము కాఁబట్టియే వెడలుచున్నా రనుకొనుము.

మల్లికార్జునుఁడు—ఏమి! వైరిబలఁగ మపారమై సంపూర్ణోత్సాహముతో వెలుపల నుండఁగా మన ... ... రాష్ట్రసైన్యము లింకఁ గూడఁబట్టుకొనకుండ ... ...

బసవన్న—కోటపై డీకొను సైన్యములు వెనుకకు మఱలినప్పుడు కోటలోపలినుండి దాడి వెడలుట, గొప్ప సంకల్పము. చూడుము! చూడుము! చిన్నదండే కాదు. దుర్గమందున్న యాశ్వికసైన్య మంతయు వెడలున ట్లున్నదేమి? ఆహా! అశ్వముల యందమితర వాహనములకు లేదు సుమా!

సీ. కలియనంగిన కొనల్ గల చెవుల్ నిక్కించి,
తలయెత్తి దిక్కులఁ గలయఁ జూచి,
మెడ నందముగ వంచి, వెడఁద వక్షం బొప్పఁ
గళ్లెంబుఁ గఱచుచుఁ గాలు దువ్వి,
పల్లంబుపై రౌతుఁ బ్రబలలీలగ మోచి,
వెనుకకాళ్ళను పూని వేడ్క నిలిచి,
నిడువెంట్రుకల తోఁక యడుఁ గొంచెం బెత్తి,
ఘన పృష్ఠపార్శ్వముల్ దనర విసరి;
తే. జంతుసౌందర్య సంపూర్ణజన్మఁ దనరు
గుఱ్ఱములు నూర్లు వేలుగఁ గూడి నడచు
నాశ్విక దళంపు గౌరవం బతిశయంబు
కడమ సైన్యాంగముల కెప్డుఁ గలుగఁ బోదు.

మల్లికార్జునుఁడు—ఎదిరిబంట్లు నివ్వెఱపడి యెట్లు చూచుచున్నారో?

బసవన్న—కాని వారు వైళంబ మొగతీరి దట్టంబగు మూఁడుపంక్తు లేర్పడి, వెనుకవారు నిలిచియు, మధ్యవారు వంగియు, ముందువారు మోఁకఱించియు, ఈఁటె మొనలను తమపైకివచ్చు గుఱ్ఱంబుల వైపునకుఁ జిక్కగ నెట్లుపట్టిరో చూడుము.

మల్లికార్జునుఁడు—పురద్వారంబునుండి నాలుగు వరుసలుగ బయలువెడలిన హయబలంబులు వెలుపలి బయలున నర్ధచంద్రవ్యూహముఁ దాల్చుచున్నవి! అదిగో! కదలినవి! ముందుకు సాగుచున్నవి! కదలికొలంది వేగం బతిశయించుటచే మహా ఝంఝామారుతంబు వలె పరుగిడు హయసమూహంబు ముందు, ఆ వైరిభటుల సన్నని పంక్తులు ఎండుటాకులవలె తెగి, చెల్లాచెదరై పోవా?

బసవన్న—చూచుచుండుము. అంతసులభంబుగఁ బోవు. (తెఱలో నాయుధంబుల చప్పుడు.) అదిగో! ఆశ్వికులును, పదాతులును తలపడిరి! ఓహో! ఏమియుద్ధము! చూచి తీరవలెను.

మల్లికార్జునుఁడు—చేసి తీరవలె ననుము.

మానినీవృత్తము.

నీటి జవాశ్వము లుద్ధృతిఁ బర్విడ, మేదిని బిట్టదరన్, రవ్రుతుల్
వాటపు టీటెలఁ గాల్బవరుల్ బొమవర్, గసుఁకత్తులచే లెరదన్,
నేరుటులు తప్పఁ దొలంగుచు వారలు వేర్లెడి సంకియవన్నెలతో
దాఁటెడ రాశ్వికుల్ బడఁగొట్టఁగ దండి మగంటిమి వాజులపై.

అహరే! ఈ మహోత్సవములో మనము పాల్గొనకుండుట ఇంకెంతసేపు! సైన్యము లెక్కడ నిద్రపోవుచున్నవోయి బసవన్నా!

బసవన్న—ఇదిగో వచ్చినవి. ఇప్పుడే వచ్చినవాని నొక్క యుజనిముసము విశ్రమింపఁజేసికాని పోరిలోఁ జొప్పను. (తెరవంక వెనుకకట్టు చూచి) హా! ఒక బంటు నిట్లంపుఁడు.

(ఒకబంటు పరుగున వచ్చును)

బసవన్న—అక్కడ నుండు మా గుఱ్ఱములను గొంపోయి, ముందుఁ గల సమప్రదేశము నందు నిలుపుము. (బంటు గుఱ్ఱములతో నిష్క్రమించును)

బసవన్న—(తెరవంక ముందునకుఁ జూపి) అదే! శత్రువుల కాలిబంట్లు ముష్వరుసను రెండుదోల్ల త్రెంచుకొని, మనవారి యాశ్వికదళంబు రెండుపాయలుగా శత్రుసైన్యమునం బడి పోరాడుచున్నది. ఒకతెగ కాళికాలయంబునకై సూటిగా వైరులఁ దెగటార్చు కొనుచుఁ బోవుచున్నది. రెండవతెగ యీతట్టునకే వైరుల భేదించుకొని వచ్చుచున్నది. కాని శత్రువులచేఁ బొడువఁబడి మనవారి గుఱ్ఱము లెన్నిపడుచున్నవో చూచితివా!

మల్లికార్జునుఁడు—అరెరే! వేయేసి నిష్కములు వెలగల వాజులు మట్టికఱచుచున్నవే!

బసవన్న—వెలలేని మనుజులే మట్టికఱచుచుండఁగా వెలగల గుఱ్ఱముల లెక్కయేమి? అదిగో! మనవైపునకు వచ్చు నాశ్వికదళంబు వైరిసేనావారంబును గడచినది! ఈదెసకే వచ్చి యాఁగినది. అదిగో! ముందుగ పంచకల్యాణిపై నెత్తురోడియు కత్తిని గుఱ్ఱపు మెడసెంట్రుకలపై తుడుచుచు ప్రసాదాదిత్యుఁడు.

మల్లికార్జునుఁడు—హెచ్చరింపుము. మరల నాతఁడు చూడలేదు. హెచ్చరింపుము.

బసవన్న—హా! ప్రసాదాదిత్యా! హా! (చేతులు తట్టును) ఆతండును, మఱియుఁ గొందఱును గుఱ్ఱంబులనుండి దుమికి పరుగున నిచ్చటికి వచ్చుచున్నారు.

(ప్రసాదాదిత్యుఁడు మఱికొందఱు నాయకులు రక్తసిక్తాంగులై పరుగున వత్తురు.)

ప్రసాదాదిత్యుఁడు—(తొందరగా) బసవన్నా! వచ్చితివా! మల్లికార్జునా! తలఁచినపని సకాలంబునకే నెఱవేర్చితివి. మేలు! కాని, యిం దూరక నిలిచితి రేమి?

బసవన్న—ఇప్పుడే వచ్చిన నా సైన్యమున కొంత విశ్రాంతి నిచ్చుచున్నాఁడ.

ప్రసాదాదిత్యుఁడు—ఇప్పుడేమి విశ్రాంతి! మహారాజ్ఞి అక్కడ పోరుచున్న అశ్వగణంపు తెగలో నున్నది.

మల్లికార్జునుఁడు<br>బసవన్న —మహారాజ్ఞీ?

ప్రసాదాదిత్యుఁడు—కాఱుమబ్బులసందున మెఱయు చంద్రరేఖ కైవడి! ... ... నా ఆవైరిబలంబు నడుమ! ... ... తన సైన్యమునకు ముందుగనుండు శ్వేతాశ్వంబుపై నెవ్వరనుకొంటిరి?

బసవన్న—మహారాజ్ఞియే!

మల్లికార్జునుఁడు—రుద్రదేవియే!

ప్రసాదాదిత్యుఁడు—కాకెవ్వరు? వైరిసైన్యములు మన కోటగోడలపైకి విజృంభించుట మాని, కాళికాలయము వైపునకు మఱలినవి. మహారాజ్ఞి తన చుట్టు నిలిచియుండిన మాకు ఈగుట్టనే చూపెను. దీనిపై మీచే రేపఁబడిన పొగ కట్లు మాకును కనిపించినవి. తోడనే అశ్వబలము నాయత్తపఱిపించి, మహారాజ్ఞి తన స్వీయాశ్వమగు రాజహంసముపై నధిరోహించి, "నగరద్వారము ను తెఱవుఁ" డని యానతిచ్చె.

మల్లికార్జునుఁడు—మేలు! కాకతిసామ్రాజ్యలక్ష్మికిం దగినమాట!

ప్రసాదాదిత్యుఁడు—కాదనఁగలవా రెవ్వరు? మఱియు మమ్ముల నీప్రక్కకు, మరల్చి మీతోఁ గలిసికొని, మఱల గవియుడని, మహారాజ్ఞియే యానతిచ్చెను.

బసవన్న—ఇంక మన మిక్కడ మాటాడుట కవకాశము లేదు. దాదాపు దేవళంబునఱకును శత్రువులఁ జీల్చుకొని యేగినను, మహారాజ్ఞి వెంటనున్న యాశ్వికులు చాలమంది కూలిరి. మహారాజ్ఞికిఁ దోడావశ్యకము. సేనలఁ దీర్చి, పోరులోఁ జొత్తము. గుట్ట దిగినతర్వాత సమభూములలో గుఱ్ఱముల నెక్కెదము. (తెఱవంకఁ జూచి) విన్నారా సేనాధికారులారా! పోరునకు సిద్ధమా!

(తెఱలో సైనికులు)— సంసిద్ధము.

తాంద్రవా రటు! కమదనవా రింక పైకి! ఇంక! పెద్దచింత కావలగ! కలకొండవా రా తాళ్ళ నానుకొని! మాదావా రిట్లు నా చెంతకు! (కొందఱు యోధులు ప్రవేశించి బసవన్న వెనుక నిలుతురు) ప్రసాదాదిత్యా! తా మీ ప్రక్కగ నడచుట నా మనవి.

ప్రసాదాదిత్యుఁడు—అస్త్రు! (ఒక వంకనిలుతురు.)

బసవన్న—(గన సైనికులను గలయఁజూచి) సిద్ధమా!

అందఱు—సిద్ధమే.

బసవన్న—హెచ్చరిక! ఆత్రముతో నడుగు పెట్టవద్దు. పెట్టినయడుగు వెనుకకుఁ దీయవద్దు.
(కత్తిఁదూసి, పైకెత్తి) ఆంధ్ర నాయకులారా! త్రిలింగదేశ వీరులారా!

ఉ. ఓ జగదేకవీర వినుతోద్య దమేయ బలాఢ్యులార! మీ
తేజము లెల్లకాలము సుధీజనగేయములై చెలంగ, నే
డాజిని పద్మనాయక మహాజన శౌర్యరస ప్రదర్శనం
బే జయలక్ష్మినిం దనుప, బీరముతో రణభూమిఁ బోరుఁడీ.

అందఱు—జే! భళాళా! (అందఱు పరుగిడుచు నిష్క్రమించుచుండఁగా తెరదిగును.)



## తృతీయరంగము.



ప్రదేశము—అక్కడక్కడ బొందలుపడిన ప్రాకారముఁ గల కాకతీయుల కోటి బయలు.

దేవగిరిసైనికులు వెలుపలనుండి ప్రాకారము కూలద్రోయుటకుఁ బ్రయత్నించుచుఁ బోరుచుందురు.

ప్రాకారము పైనుండి కాకతీయ సైనికులు వారల నాటంకపెట్టుచు పోరుచుందురు.

ప్రవేశము—మహాదేవరాజు, సూర్యుఁడు, చంద్రుఁడు.

మహాదేవుఁడు—దేవగిరి సైనికులారా! ఇక్కడి ప్రయత్నము నిలుపుఁడు. ఆవైపునుండు గోడఁబడగొట్టుదము. రండు. రండు.

(మహాదేవరాజు దేవగిరిసైనికులతో నిష్క్రమించును.)

కాకతినాయకుఁడు—దేవగిరిసైనికు లటు వచ్చుచున్నారు. మనమును ఆవైపుకే పోయి లోననుండి వారి నెదుర్కొందము. రండు.

(కాకతి సైనికులు ప్రాకారములోనికి నిష్క్రమింతురు.)

సూర్యుఁడు—చంద్రా! సృష్ట్యాదినుండియు ననుదినము నభస్సంచారము సేయుచు నీ ధాత్రిపై విశేషములనుఁ జూచుచుంటిని. కాని నేఁటిదినమున నీయాంధ్రవీరులు చూపిన శౌర్య మప్రతిహతము. అద్భుతము. నాకంటె భూమండలమునకు మిగుల దగ్గఱగ సంచరించు నీ వెప్పుడైన నిట్టి శౌర్యప్రదర్శనమును జూచితివా!

చంద్రుఁడు—లేదు. నేను నన్నఁడును జూచియుండ లేదు.

గీ. ఘనత మున్నది వేల యోజనములందు
ధరను నేఁ జుట్టితిరుగుచు దాపునుండి
కాంచినాఁడను యుగయుగ కదనములను
గాని యిట్టి వేనాఁడును గాంచి యెఱుఁగ.

తే. ఏన్గు ఢీకొన్న వెఱవరు; హెచ్చియున్న
శత్రుసంఖ్యలఁ జిక్కియు జంకుపడరు
పోరునకుఁ బెండ్లికింబోలె కోరి నడతు
రహహ! యేమందు పద్మనాయకుల కడిమి!

ప్రవేశము—కుజ, శని, బుధ, రాహువులు.

కుజుఁడు—ఓహూ! ఏమియుద్ధము! మనస్స్ఫూర్తిగ వీరరస మొప్పారుచున్నది.

శని—యుద్ధకారకుఁడ వగు నీకు మనస్స్ఫూర్తి యన నెంతమంది చచ్చుటో!

రాహువు—సర్వమారకుఁడ వగు నీకంటెనా!

సూర్యుఁడు—హాస్యపుమాటలిప్పుడా! అదిగో విరోధుల యశ్వదళము!

(తెరలో కోలాహలము)—కాకతిరాజ్యలక్ష్మికి; జే! ఆంధ్రసైన్యములకు జే!

(తెరలో వేఱొకతట్టున)—దేవగిరి శౌర్యాగ్నికి జే!

కుజుఁడు—మేలు దేవగిరిమిత్రులారా! అట్లు తలపకుఁడు. ఇంకొక్క తాఁకునకు దేవళంపు గోడ పడఁగలదు.

చంద్రుఁడు—కొలఁదిమందియే పట్టుదలతో ప్రాణంబుల కాసింపక పోరుచున్నారు. ఆ దేవళంబులో నేరైన ముఖ్యు లుండవచ్చును.

సూర్యుఁడు—ఆ యశ్వదళంబునకు ముందుగ ససహాయశూరత్వంబునఁ పగపఱము వారలఁ దెగనఱకుచున్నది స్త్రీ వ్యక్తి లాగున్నదే!

శని—ఆ శ్వేతాశ్వంబుపై నేనా?

సూర్యుఁడు—ఔను.

శని—ఆవ్యక్తియే కాకతిరాణి యగు రుద్రమాదేవి.

సూర్యుఁడు—స్వయంబుగ నామెయే పోరునకు దిగినదే! ఏమిశౌర్యము! ఎట్టియాశ్వికనైపుణ్యము.



(తెరలో) కాకతిలక్ష్మికి జే! రుద్రమదేవికి జే!

సామంతుఁడు—సామ్రాజ్యాధికారిణియె స్వయముగ నీ దేవగిరిప్రాకారంబులోనివారికి సాయమునిచ్చుచున్నది. జ్యోతిర్మండల ముల్కాలతిని వెదఁజిమ్మునట్లు మన సేనలఁ జెడఁగొట్టుచు, మఱికొంద ఱీవైపునకుఁ డిగి వచ్చుచున్నారు. వారు వచ్చులోపల మన సేన లీ ప్రాకారమును గూలద్రోసి, లోనఁ బ్రవేశింపవలయును. (సేనలకై చూచి) మిత్రులారా! అద్దే! అద్దే! ప్రాకారము కూలనున్నది. ఇంకొక్క తాఁకు. ఇంకొక్క నారి. మీలోఁ గొంద ఱిటు రండు. ఈవైపున మఱియొకసారి ప్రయత్నింతము.

(దొంగగడ్డముతో నుండు రాఘవశర్మయును, కొందఱు దేవగిరిసైనికులును ప్రవేశించి కాళిగుడి వెలుపలిగోడ కొంతఁ బడఁద్రోయుదురు. పడిన గోడబండలక్రింద రాఘవశర్మయు మఱికొందఱు చిక్కుకొందురు. పడిన ప్రాకారభాగమునుండ గర్భాలయము, కాళివిగ్రహము, పూజించు లీలావతి, తత్తరపడు భాస్కరాచారి, పూజారి, పడియుండు కొందఱు కాకతిసైనికులును కనిపింతురు)

సామంతుఁడు—గోడ పడినది. లోపలఁ బ్రవేశింతము. ఈఁటెల మొన పట్టుఁడు. గోడచాటు నుండి వారు మనపైఁ బడవచ్చును.

(దేవగిరిసైనికులు మొనపట్టి లోపలి కేఁగ ప్రయత్నములో నుండఁగా.)

(తెరలో)— కాకతీశ్వరునకు జే! రుద్రమదేవికి జే!

(నెత్తురు గాఱు కత్తితో పరుగున రుద్రాంబ ప్రవేశించి, దేవగిరి సైనికులను, రెండు ప్రక్కలకును పడఁగొట్టుచు వారి నడుమనుండి యేగి, పడిన ప్రాకారంబున కడ్డముగ నిలుచును. ఆమెను గాంచి, విస్మయమున, పడఁగా నిలిచిన దేవగిరివారు ఒకింత వెనుకాడుదురు.)

రుద్రమదేవి—(తెరవంకఁ జూచి) నాయకులారా! మీరుకూడ నక్కడనే గస్తులు తిరిగి రండు. ఈ బండలలో నవి నడువలేవు.

(పరుగున నాంధ్రనాయకులు ప్రవేశించి, దేవగిరిసైనికులతోఁ బోరి, వారిని నేపథ్యము లోనికిఁ బాఱఁద్రోలి, మఱలి మహారాజ్ఞి కడకు వత్తురు. గృహపూరుషులు ఒక ప్రక్కగ నిలిచి చూచుచుందురు)

ఆంధ్రనాయకుఁడు—మహారాజ్ఞీ! ఎటు?

రుద్రమదేవి—అటు! (దేవళమువంకఁ జూపి) వైరులావైపునకుఁ బోయిరి. మీ రందఱు కూడ నట్లే పోయి, వారల నింకను దరిమి రండు.

ఆంధ్రనాయకుఁడు—నీవద్ద నెవరి నుండుమందువు?

రుద్రమదేవి—నావద్ద నెవ్వరును వలదు. పొండు! త్వరగా! అదిగో! వైరులు పలుల తెప్పిరిలి, ఆవైపున గోడలకుఁ బ్రాకుచున్నారు. పొండు! పొండు! వారిని నేలఁ గొట్టుఁడు. అదె! నిలిచియుండు రాజహంసము నొద్ద నొకబంటు నుండుమనుఁడు,

ఆంధ్రనాయకులు — ఆజ్ఞ.

(పరుగున నాంధ్రనాయకులు నిష్క్రమింతురు.)

రుద్రమదేవి — (దేవళము వంకఁ జూచి) లీలావతీ! లీలావతీ!

లీలావతి — (లోనుండి తొంగిచూచి) మహారాజ్ఞియేనా? (నిశ్చింతపడి చూచును.)

రుద్రమదేవి — రంగ్రశిగాకని నీకును క్షేమమా! అట్లుచూచెదవేమి?

లీలావతి — ఈ దీనురాలిఁ గావ నీవే వచ్చితివే తల్లీ. అమ్మో! ఎంత ప్రమాదము!

రుద్రమదేవి — పలుమాటలు వలదు. మీ రిద్దఱు సహాయముం బొరయరైరి కదా!

లీలావతి — నీ యండ నుండువారి కపాయమా తల్లీ!

రుద్రమదేవి — చాలు. మీ రిద్దఱును లోపలనే యుండుఁడు. నే నీ చోటును గాచెద.

(పడిన గోడ కడ్డముగ నిలుచును. లీలావతి గడిలోని కేగును.)

శని — కుజా! చూచెదవేమి? మూర్తీభవించిన శౌర్యప్రభ ద్వారమున నడ్డగట్టియున్నది. పోయి కుంభలగ్నజాతకశౌర్య మెట్టిదో ఒకింత పోరి చూపుము!

కుజుఁడు — రాజద్రోహ్యాపదనకు నీ కుంభలగ్నమున కెక్కడిది? పనిని చూచెదము. (సూర్యునితో,) దేవా! ఇట్టి మహోత్సాహ సమయమున నీకమ్మా పార్శ్వమున నుండుట బాగుగ లేదు. పోరుటకు సెలవా?

సూర్యుఁడు — (ఉత్సాహముతో) సౌమ్యా! ఇట్టి యుత్సాహాతిరేకము, అన్నివేళల లభ్యపడదు.

కుజుఁడు — దేవగిరివీరులారా! అక్కడ నిలిచియున్నది కాకతిరాణి. ఆమెను బట్టుకొనుదోఁ దక్కిన సైన్య మంతయు మనకు లోఁబడును. రండు! పట్టుకొందము!

(కొందరు దేవగిరి సైనికులు ప్రవేశింతురు.)

రుద్రమదేవి — రండు! రండు! దేవి కీ నడుమ సరబలు లరుదైనవి.

(కుజుఁడు, రాహువు, దేవగిరినాయకులును మహారాజ్ఞిపై నొక్క పెట్టున తలపడుదురు. వచ్చువారిని కీరనీక పవ నరుకుచు రుద్రాంబ పోరుచుండును.)

శని — (చప్పటలు కొట్టి యెగురుచు) మేలు! తల్లీ! అట్లే! ఊఁ! అగ్గి! మజల! ఆఁ! ఆఁ! అట్లు బీరములు పల్కు నా కుజుఁడుగాని పొట్టఁ బగులఁ బొడుచుము. రాహువుగాని పండ్లు రాలఁగొట్టుము.

(తెరలో) — కాకతీంద్రునకు జే! పద్మనాయక శౌర్యాగ్నికి జే!

(మల్లికార్జునుఁడు, ప్రసాదాదిత్యుఁడు, బసవన్న, విశ్వగ్లసైనికులు ప్రవేశించి, మహారాజ్ఞితోఁ బోరు వారలను అందఱును, గ్రహపూరుషులను, బాఱఁదోలుకొనుచు సేవన్యయునకు నిష్క్రమింతురు.)

(మల్లికార్జునుఁడును, బసవన్నయు, తిరిగి ప్రవేశింతురు.)

రుద్రమదేవి—బసవన్నా! సమయమునకు వచ్చితివే!

బసవన్న—మహారాజ్ఞికి భద్రమా! (కత్తియెత్తి అభివాదము పట్టును)

రుద్రమదేవి—(చిరునగవుతో) అలసటగ నున్నది. ఐనను, వారి కత్తితునుకలచే ... ..., నొడలిపై గీఁతయైనఁ బడలేదు. మీకేమైనఁ గాయము లైనవా!

బసవన్న—విశేషమేమియు లేవు.

రుద్రమదేవి—సరి! యుద్ధమటు తూఁగుచుండగా నిచటికి వచ్చితిరేమి?

బసవన్న—ప్రభువుల క్షేమ మారయవచ్చితిమి. ఇదే పోరున కేగెదను. మల్లికార్జునకుమారా! నీ వొకింత యాఁగి, మహారాజ్ఞి యుత్తరువుల వివరముగ నెఱిఁగి రమ్ము. జే! ఖతాళా! ఆంధ్రసామ్రాజ్యమునకు జే! రుద్రాంబాదేవికి జే! (పరుగున నిష్క్రమించును.)

(మహారాజ్ఞియు మల్లికార్జునుఁడును ఒకరినొకరు ఒకింత సిగ్గుతోఁ జూచుకొందురు.)

మల్లికార్జునుఁడు—(కత్తి యెత్తి అభివాదము పట్టి,) నాపైని బెట్టఁబడిన కార్యభారము శ్రీ రుద్రాంబికాకృపచే శుభంబుగ నెఱవేర్పఁబడినది.

రుద్రమదేవి—ప్రత్యక్షముగఁ జూపఁబడిన సాహసమునకు నాంధ్రసామ్రాజ్యము వీరుల యెడ కృతజ్ఞతతో నిండినది.

మల్లికార్జునుఁడు—సామ్రాజ్యావశ్యకమున నొప్పింపఁబడిన మఱదలి మనంబునుండి మన్ననలఁ గోరుటే కొదువ.

రుద్రమదేవి—(చిరునగవుతో) ధీరోత్తంసుల సమరోత్సాహ మింకొకసారి మాచే నివారింపఁబడు టెందులకు? (పోరువంకఁ జూపును)

మల్లికార్జునుఁడు—నివారింపఁబడుటకు (రుద్రమదేవి తనచేతికి కట్టిన కట్టు చూపి) ఇట్టి ప్రేమానుబంధమే కారణముకదా! ఇదే నాకు రక్షయై నాచే నిన్ని పనులు చేయించినది.

రుద్రమదేవి—(ఉద్వేగముతో) కట్టు సడలి మఱల నెత్తురోడియునట్లున్నదే!

మల్లికార్జునుఁడు—(చేతిపై కట్టుచూపి) ఈ కట్టు సడలునది కాదు. దీనిపై నుండునది వైరుల రక్తము. మఱల సమరంబున పాల్గొన నాకు సెలవా? ఇక్కడ కింక శాత్రవులు రాఁజాలరు.

రుద్రమదేవి—శౌర్యరసప్రదర్శనంబు దిలకింప నుత్సాహపడు ననుమతిని సూచించుచు, నా కత్తి నిదే గ్రహింపఁదగినచేతి కిచ్చుచున్నదానను.

(మహారాజ్ఞి తనచేతి కత్తిని మల్లికార్జునున కిచ్చును.)



మల్లికార్జునుఁడు—(అతివినయముగ వంగి, పుచ్చుకొని, యా కత్తిని ముద్దుఁగొని, నిలిచి, తనకత్తినిఁ జూపుచు) మునివలికి కాపుగ నుండుటకును, మహారాజ్ఞికి సంసేవ నొనర్చుటకును, నాప్రాణ సమంబైన కత్తి నిదే సమర్పించుచున్నాఁడను. (తన కత్తిని మహారాజ్ఞి కిచ్చును.)

రుద్రమదేవి—(నవ్వుచు పుచ్చుకొని) బాలా! త్వరపడుము. వైరులు నీరసిలి పోరు తెలిసి కాక ముందే వారిని గలిసికొనుము. నా గుఱ్ఱము నెక్కి పొమ్ము. నీ గుఱ్ఱ మలసి యున్నది.

మల్లికార్జునుఁడు—(కత్తితో నభివాదనము బట్టి, కాకతిలక్ష్మికి విజయ మగుఁగాక!

(పరుగున నిష్క్రమించును)

(ఇప్పటినుండి యుద్ధవిరామంబునుమార్చి తరువాత మహారాజ్ఞి యాజ్ఞ యగువఱకును, యుద్ధము జరుగుట సూచించు వాద్యములు తెరలో మ్రోగుచు నేయుండును.)

రుద్రమదేవి—(తెరవంకఁ జూచి) ఓరీ భటులారా!

(కొందఱు కాకతీయ భటులు ప్రవేశింతురు.)

రుద్రమదేవి—ఈ రణనిహతులను, గాయపడినవారలను, ఆవలకుఁ దీయుఁడు.

భటులు—ఆజ్ఞ. (అట్లు చేయుదురు)

రుద్రమదేవి—సూర్యకిరణంబులముందు చీఁకట్లవలె మా సైనికులముందు వైరులు క్రమంబుగ వెనుకకుఁ బోవుచున్నారు. ఇంచుమించుగ రణ మింతటిలో ముగిసినట్లే. (కాళిగుడివైపు చూచి) లీలావతీ! వైరులు తెఱుమఁబడిరి. వెలుపలికి రమ్ము.

భాస్కరాచారి—(గుడిలోనుండి లీలావతితో వచ్చి) నిజమేనా! అపాయము తప్పినదా! అమ్మా! మహారాజ్ఞీ! దీర్ఘాయుష్యమస్తు!

రుద్రమదేవి—పెద్దల దీవనలు మాకుఁ జెందినవి.

భాస్కరాచారి—మేము నేఁడు ప్రభువులవలననే మృత్యువు నోటినుండి కాపాడఁబడితిమి. కాని యింకను అక్కడ కత్తులు మ్రోఁగుచున్నవే!

రుద్రమదేవి—మ్రోఁగనిండు. ఇంత పెద్దగ నింతసేపు మ్రోఁగిన వాక్యసారిగ నాఁడునా! లీలావతీ' దేవిపూజ ముగిసెనా!

లీలావతి—మహాభిషేకము కాక యన్నియు ముగిసినవి. తరువాత సహస్ర నారికేళ బలి కావలెను.

రుద్రమదేవి—నారికేళంబు లెందు కింక? దేవికిఁ ప్రీతికరముగ [illegible] నరబలుల వేలు పూర్తియైనవి. తన సమస్యా పూర్తిని తానే కాళిక నెఱవేర్చుకొనినది. జ్యోతిర్గ్రంథ సాధనమున కింక నే యాటంకమును గలుగఁగూడదు.

రణనిహతుల మోయు బంటు—మహారాజ్ఞీ! ఈ బండక్రిందనున్న యొక దేవగిరిభటుఁడు ప్రాణములతో నున్నాఁడు.

భాస్కరాచారి—ప్రభూ! వాని నలిగి చావనిమ్ము

రుద్రమదేవి—అది సరికాదు. ఎదుటఁబడి పోరునప్పుడు శాత్రవుని వధింపఁదగును గాని పోరఁజాలని దుస్థితి యందుండు వానిపై వైర మెందుకు? (బంట్లతో) ఓరీ! ఆ బండల నాతని పైనుండి తొలంగఁద్రోయుఁడు.

బంట్లు—అనుజ్ఞ!

(భటు లట్లు చేయుదురు. బండలను తొలఁగఁద్రోయఁగా దేవగిరి సైనికుని వేషముతో రాళ్ళలో నిఱుకుకొనియున్న రాఘవశర్మ కనిపించును)

రుద్రమదేవి—పాపము! రాలదెబ్బలతో నొడలి యెముకలు విఱిగినవా!

భటుఁడు—(రాఘవశర్మ శరీరము తడవి చూచి) ప్రభూ! ఎముకలు విఱిగినట్లు లేదు. ఒడలు నలిగి సొమ్మసిలిన ట్లున్నది.

రుద్రమదేవి—ఆతని సీగడ్డిగల తెఱపి చోట నెమ్మదిగ పరుండబెట్టుఁడు. (భటు లట్లు చేయుదురు) సరి! మీరు పొండు. (భటులు నిష్క్రమింతురు.) భాస్కరాచార్యా! ఆ దేవళమునుండి తీర్థము గొనితెండు.

భాస్కరాచారి—ఆజ్ఞ! (దేవళములోనికి నిష్క్రమించును.)

రుద్రమదేవి—లీలావతీ! ఈతని మోము బాగుగఁ జూడుము.

లీలావతి—(చూచి) తల్లీ! అనుజ్ఞ యేమి!

రుద్రమదేవి—ఈతని నీ విదివఱకు చూచినట్లు గుర్తు లేదా!

లీలావతి—ఈ దయ్యపుగడ్డము గల దేవగిరిభటుని నే నెఱుంగను!

రుద్రమదేవి—ఆ దయ్యపుగడ్డము కృత్రిమము. నాటకములలో వేషధారులు పెట్టునట్టిది. మఱల చూడుము.

లీలావతి—(చూచి) అవును! అవును! తీఁగెగొలుసులు చెవులసందునఁ గనిపించుచున్నవి. (ఆశ్చర్యముతో) ఎవ్వరిది! ఆతఁడా?

రుద్రమదేవి—సత్య మతఁడే. నీ ప్రియుఁడగు రాఘవశర్మయే!

లీలావతి—(ఉద్వేగముతో) అమ్మో! ఎంత దెబ్బలు తగిలినవో!

రుద్రమదేవి—భయపడకుము. ముక్కు, నోరు, చెవి, కన్నులు, వీనివెంట నెత్తురు వచ్చుట లేదు. తలపై పెద్దదెబ్బ తగిలినట్లు లేదు. శ్వాసము సాధారణముగా నున్నది. కాన గుండెల కేమి యొత్తిడి తగిలియుండదు. ప్రాణాపాయ మగునట్లు బలమైన బండ లీతనిపైఁ బడియుండ లేదు. కొలఁది రాలు తగిలి సొమ్మసిలి నట్లున్నది.

లీలావతి—శాంభవి! కాని తల్లీ! ఈతఁ డీ వింతవేషముతో నిచట నుండుటకుఁ గారణ మేమైయుండును? కృతఘ్నుఁడై శత్రువులలోఁ జేరెనా?

రుద్రమదేవి—కాదు. కాదు. అట్లై యుండదు. అట్టి దుష్టుఁడు కాఁడు. వేడుకఁ గలిగించు నీతని చిత్రచర్యలలో నిది యొకటై యుండవలెను. అదిగో! కదలుచున్నాఁడు.

లీలావతి—అదే! మా నాయనగారు నీరు తెచ్చుచున్నారు.

రుద్రమదేవి—లీలావతీ! ఇటు చూడుము! మన మీతని గుర్తించినట్లు తెలియనీకుము. సందర్భముల పర్యవసానమును బరీక్షింతము.

(ప్రవేశము—భాస్కరాచారి నీటి చెంబుతో.)

భాస్కరాచారి—ప్రభూ! నీరు తెచ్చితిని.

రుద్రమదేవి—నెమ్మదిగ నీతని నోటఁ బోయుఁడు.

భాస్కరాచారి—(సందేహించుచు) ఈతనిని ఏ కులమో!

రుద్రమదేవి—(కొంత తీవ్రముగా) తోడివానికిఁ ప్రాణములు పోవుచున్నను కులభేద విచారము? పోయింపుఁడు. లీలావతీ! కొంచెముగ నీతని తలను ఎత్తిపట్టుము.

లీలావతి—ఆనుజ్ఞ! (లీలావతి తల నెత్తఁగా, భాస్కరాచారి రాఘవశర్మకు నీరు త్రావించును. రాఘవశర్మ తెప్పిఱిల్లి లేచి కూర్చుండును.)

రాఘవశర్మ—(వెఱ్ఱి చూపులతో దిక్కులు చూచి) ఎక్కడ? ... ఏ ... మి ... ఎవ్వరు ...

భాస్కరాచారి—నెమ్మది చెందుము. నీకు వచ్చిన భయము లేదు.

లీలావతి—నీవు శాత్రవుఁడవైనను, మా మహారాజ్ఞి నిన్ను రక్షించెను. భయపడకుము.

రాఘవశర్మ—మహారాజ్ఞియా! (స్మృతి నభినయించి తనలో) ఓహో! అంతయు స్మరణకు వచ్చినది. గొప్పచిక్కు తటస్థించినదే! ఇట్టిస్థితిలో నుండు నన్ను ప్రభువులకుఁ దెల్పుకొనుటకు సిగ్గగుచున్నది. దేవగిరిభటునివలె నటింతును. (లేచి నిలుచును.)

రుద్రమదేవి—ఒడలు నెమ్మదియా?

రాఘవశర్మ—అమ్మా! తలమాత్రము దిమ్ముగ నున్నది.

రుద్రమదేవి—క్షణములోనే యాబాధయు తగ్గఁగలదు. సరి. మాకు లోఁబడిన శాత్రవుఁడవు. లీలావతీ! వీఁడు పారిపోవకుండఁ గనిపెట్టుము. (రాఘవశర్మతో) నీ వామెవెనుక నిలిచి, మా ఖేటమును వహింపుము. (డాలు వాలని చేతి కిచ్చి) అదిగో! కాకతిసామ్రాజ్య వీరులు. నీ మిత్రుల నెట్లు నఱుకుచున్నారో చూడుము.

రాఘవశర్మ—నామిత్రులా?

రుద్రమదేవి—కారా?

లీలావతి—(తెఱవంకఁ జూచి) శివ! శివ! ఏమిఘోరము! అంతయు రక్తమయమే. (కన్నులు మూసికొని) తల్లీ! చూడలేకున్నదానను.

రుద్రమదేవి—అవును. ఎదిరించువారలఁ జంపుట క్షాత్రము. తిరుగఁబడలేనివారల హింసించుట క్రౌర్యము. ఇంక దీని నాఁపెదము. ఓరీ! (తెరవంక చూచి చప్పటులుకొట్టి, రమ్మని సంజ్ఞ చేయును. బాకాబంటు వచ్చును.)

రుద్రమదేవి—యుద్ధవిరామమును ఊదుము.

బాకాబంటు—ఆజ్ఞ! (బాకాను దీర్ఘముగ మూడు సార్లు ఊఁదును. తెరలోని కోలాహలములు నిలుచును.)

(తెరలో)—ఆంధ్రసామ్రాజ్యమునకు జే!

లీలావతి—యుద్ధము విరమించినది. కాళికాదేవి కృపవలన నేఁటి ఘోరములు ముగిసినవి. (గుడివంకఁ దిరిగి నమస్కరించుచు)

ఉ. ఓ! హిమవన్నగేంద్ర జగదున్నత జన్మతపఃఫలంబ! యో
మోహనరూప! యో యభవ మోద కరామల దివ్యదేహ! యో
ద్రోహమనస్క దుర్మత విదూర మహామహిమాఢ్య! యో సము
త్సాహ సతార్త వారిగుణధామ! దయామయి! యోమహేశ్వరీ!

శా. ఉల్లాసంబున నేఁడు యుద్ధమిష వీరోత్తంసులైనట్టివా
రెల్లన్ వేనకువేలు నీకు బలియై; రీ రక్తవర్షంబు నీ
యుల్లంబుం దనివొందఁగాఁ గురిసె; శాంతోద్భాసవై యింక నో
తల్లీ! మారణఘోరముల్ నిలుచుటన్ ధ్యానింతు నీ పాదముల్.

రుద్రమదేవి—లీలావతీ! చూడుము. వైరినాయకులఁ దోడ్కొని మహవార లిచ్చుటకై వచ్చుచున్నారు.

(తెరలో)—త్రిలింగసామ్రాజ్యమునకు జే!

(ముందుగ కాకతీయదండనాథులు, వారివెంట నొకింత దీనవదనమ్ములతో దేవగిరి వీరులు, మహాదేవరాజు, గ్రహపురుషులు ప్రవేశింతురు. వీరిలో గ్రహపూరుషులుగాక కొందఱువారు చాలమంది గాయపడియుందురు. మహాదేవరాజు మిక్కిలి గాయపడి, తనబంటుపై వ్రాలుకొని నడచుచుండును. కొందరు కాకతివీరులు నట్లే గాయపడి నడుచుచు ప్రవేశింతురు.)

ప్రసాదాదిత్యాది కాకతీయవీరులు—(కత్తులను పైకెత్తి అభివాదనములు పట్టుచు) ఆంధ్రసామ్రాజ్యమభివృద్ధి నొందుఁగాక! కాకతిసామ్రాజ్యలక్ష్మికిఁ గల్యాణ మగుఁగాక!

రుద్రమదేవి—మిత్రులారా! గాయములచే నొచ్చియుంటిరిగదా!

ప్రసాదాదిత్యుఁడు—మహారాజ్ఞీ! యావజ్జీవితము, మేము గర్వపడఁదగిన విజయ లాంఛనములు గాని, యివి గాయములు కావు.

మ. నయశాస్త్రోక్త సుధర్మపాలన కళానైపుణ్య పారంగతా
వ్యయ ధీ ప్రేరిత సత్య శౌర్య విభవ వ్యాయామ సంగ్రామ రం
గ యశోవ్యాలిఖితామలాక్షర దిశాగంధేభ దంతస్థలీ
జయతేజోధిక కాకతీయ నృపవంశ ప్రాంశ రాజన్మణీ!

బసవన్న—సీ. మీ కులదైవంబు శ్రీకంఠుఁ డల స్వయం
భూదేవు కరుణానుభూతిచేత
భవ దాహ్వయముగల్గు పరమేశు నిల్లాలు
రుద్రాంబికా కృపారూఢి కతన
మీ వంశపూర్వులౌ మేటి నృపాలుర
వీరమాతల దయావృష్టి వలన
సంకల్పసిద్ధంబు జయశీలమైన మీ
ఘనయత్నపూర్ణతా కారణమున

గీ. నాంధ్ర వీరజనోత్సాహ మతిశయిల్లె;
సకల పరిపంథి గర్వాంధసమితి దొరఁగె;
జగము లెఱుఁగంగ ధర్మసంస్థాప్య మయ్యె;
విజయలక్ష్మికి కల్యాణ విభవ మెసఁగె.

రుద్రమదేవి—మేలు! కాకతికులదైవములకు విశేషార్చనలు సమర్పింపఁబడుఁగాక.

బసవన్న—ప్రభూ! ఇదే జయింపఁబడిన వైరివర్గము. (దేవగిరివారిని చూపును.)

రుద్రమదేవి—(మహాదేవరాజును చూచి, ఈవీరుని యొడలిపైఁ దగిలిన కత్తివ్రేట్లు చూడ, నీతఁడు సులభముగ మనకు లోఁబడినట్లులేదే!

బసవన్న—ప్రభూ! అట్లే. ఒడలినెత్తురు వరదలై పాఱి స్మృతితప్పు సమయమువఱకు నీతఁడు పోరుమానలేదు. ఈతఁడె మన ముఖ్యవైరియగు మహాదేవరాజు. ధీరోత్తముఁడు.

(మహాదేవరాజు, గ్రహపూరుషులు, దేవగిరివీరులు అర్ధంబుగ పంక్తి, వరతోఁగూడ పిడికైదు ముందుఁ బట్టి తమ కత్తులను మహారాజ్ఞికి అందఁజేయఁబోవుదు)



మహాదేవుఁడు—కాకతివీరలక్ష్మీ! రణవిజయ శుల్కంబుల నిదే పరిగ్రహింపుము.

రుద్రమదేవి—భవ్యులారా! కులదైవముల కరుణచే మాకు విజయము చేకూఱెఁగాక! శూరులగు మీయొక్క శౌర్యచిహ్నముల మేము పరిగ్రహింపము. మీ ఆయుధంబులు మీయొద్దనేయుండుట మాకు పరమాహ్లాదకరము. లెండు. విశ్రాంతులగుఁడు.

(దేవగిరివారు, గ్రహపూరుషులు ప్రక్కకు నిలుతురు.)

(కాకతీయవీరులతో) దండనాథులారా! అప్రతిహతంబగు మీ సాహసము మనకు సంపూర్ణ విజయము చేకూర్చినది. బసవన్నా! సమయమునకు వచ్చి నేఁటి విజయమునకు ముఖ్యకారకుఁడ వైతివి.

బసవన్న—అనుగ్రహింపఁబడితిని. కాని, నేఁటి విజయమునకు మన మల్లికార్జుననే ముఖ్యకారకునిగా నెంచఁదగును.

సీ. పినుగట్లు లేపైని బడిన సైన్యము నాఁపి
ఘనత నీకోటను గాచినాఁడు
క్షేత్ర నొక్కండు వైరివారిధిఁ జొచ్చి
నెలవుపట్ల తెఱంగు నేర్చినాఁడు
పెక్కామడలదూర మొక్కరేయిని పోయి
సను దెచ్చి రణమందుఁ జొనిపినాఁడు
నేఁటి సంగర మీవు, మేటివీరులు, మెచ్చ
శత్రుభీకరలీల సలిపినాఁడు
తే. మేము వినుతింపఁ జోలదు మిత్రుఁ డగుట;
నైష భవదీయ మృదుల కటాక్ష రక్తిఁ
జూచి యెట్లుమన్నించెదో శూరవరుఁడు
మల్లికార్జున వర్మ నీ మామకొడుకు.

(రుద్రాంబా మల్లికార్జునులొండొరుల మొగములఁ జూచుకొని కొంచెము నవ్వుకొందురు. అందఱును కరతాళధ్వని గావింతురు)

ప్రసాదాదిత్యుఁడు—మేలు! బళి నన్నా! స్వారస్యమగు వాక్యమోయి!

మల్లికార్జునుఁడు—నాకంటె మెప్పునకుం దగినవారులేరా? లేకేమి! (విచారముతో) ఉండిరి. వైరిసైన్యము లన్నియు నొక్కపెట్టునఁ డీకొనినను వెనుకాడక, ఈ చిన్నదేవళంబును గర్భదుర్గంబులును కాపాడి, పౌరుషముతో ప్రాణంబులు వదలిన కొలందిమంది వీరోత్తంసులు మన కాదర్శప్రాయులును, పూజ్యులును గదా.

రుద్రమదేవి—అవును. వారిశౌర్యమును వినుతించునట్టి శాసనము నొకదాని నిక్కడ నిలిపెదము. మఱియు ఈ యుద్ధమున వీరస్వర్గముఁ గొన్నవారి యొక్క బంధువర్గము సామ్రాజ్యముచేతఁ బోషింపఁబడుఁగాక. ఇఁక రణములో గణ్యమానంబగు శౌర్యముఁ జూపిన వీరుల కెల్లరకు విజయపారితోషికము లొసంగఁబడుఁగాక.

ప్రసాదాదిత్యుఁడు—అనుగ్రహింపఁబడితిమి.

రుద్రమదేవి—దండనాథా! గాయపడినవారికి అత్యవసరమగు చికిత్స చేయుటకై వైద్యుల కొఱకుఁ గబురంపితిరా?

ప్రసాదాదిత్యుఁడు—రణము నిలుచుటతోడనే యొక రౌతును ఆపనిపై నగరంబులోనికిఁ బంపితిని. ప్రభూ! తమ సైనికుల కేలోపమును గలుగదు.

రుద్రమదేవి—మనవారికేకాక వైరిసైనికులకుఁగూడ వలయు వైద్యసహాయ మలవడఁ జేయుఁడు.

ప్రసాదాదిత్యుఁడు—ఆజ్ఞ. ప్రభువులు కరుణాసముద్రులు.

రుద్రమదేవి—(ప్రసాదాదిత్యునకు గ్రహపూరుషులను జూపి) ఈ మహాతేజశ్శాలులు ఏదేశమువారో?

ప్రసాదాదిత్యుఁడు—అనుజ్ఞ యగునో నేను మహాదేవరాజు నడిగెదను.

రుద్రమదేవి—అడుగవచ్చును.

ప్రసాదాదిత్యుఁడు—మహాదేవరాజా! మన కిదివఱకు రణరంగపరిచితి కలదు, కాని క్రొత్త వారలగు ఈ తేజశ్శాలు లెవ్వరు?

మహాదేవరాజు—పారసీకులు.

ప్రసాదాదిత్యుఁడు—పారసీకులా?

మహాదేవరాజు—మీకు సందేహముగా నున్నచో ఎదుటనున్న వారినే యడుగరాదా?

ప్రసాదాదిత్యుఁడు—(గ్రహపూరుషులతో) భవ్యులారా! ప్రతికక్షు లొండొరుల నామములఁ దెల్పుకొనుట యుద్ధ పరిసమాపక సమయ మర్యాద నుండీ.

సూర్యుఁడు—గురువర్యా! ఇంక దాఁచుట యెందులకు? సందర్భములను క్లుప్తముగ నెఱింగింపుము.

గురువు—సృష్ట్యాదినుండి ప్రదర్శింపఁబడుచున్న యీ మహాకథను క్లుప్తపఱిచి చెప్పుటకంటె నిందున్న వీరల కందఱ కొక్కక్షణము సేపు దివ్యదృష్టి నొసఁగుచో నిజస్థితిని వారే యెఱుంగఁగలరు.

సూర్యుఁడు—అట్లే యొనర్పుఁడు.

గురువు—వీరవరులారా! నిస్సంశయుల రగుఁడు.

(హస్తములు వారి కన్నులముందు త్రిప్పును.)

అందఱు—(కన్నులు మూసికొని) అద్భుత మద్భుతము! ఆశ్చర్య మాశ్చర్యము! (కన్నులఁ దెఱతురు)

గురువు—మహారాజ్ఞీ! సందేహము వీడినదా?

రుద్రమదేవి—(తనలో) ఇది యింద్రజాలము కాదుకదా! పరీక్షింతును. (ప్రకాశముగా) మహాత్ములారా! దివ్యతేజస్కులయెడ మాబోఁటి మానవులకు సందేహము కలుగదు. కాని తమరు మమ్ముఁ బరీక్షింప దయతో నేఁడు సలిపిన విక్రమలీలయందుఁ జాల మంది యసురులఁ గోల్పోయిరి. ఇది తమకు లీలయైనను వారికిఁ బ్రాణాంతక మయినది.

సూర్యుఁడు—భవ్యా! ఇదియా నీ సంశయము? మాపరీక్షకు మీరలు అఁగియుండఁగా మీ సందియము వాపక మే మేగుదుమా? ఇదే నేఁటివఱకును జెలరేగిన యీ సమీకంబున నిగతాసు లైనవా రెల్లరును మఱల సజీవులై ఎప్పటియట్లు విలసిల్లఁగలరు. దీననే మా దివ్యత్వము మీకుఁ దెలియఁగలదు.

(తెరలో కలకలము)

అందఱు—(ప్రక్కకుఁ జూచి) ఆశ్చర్య మాశ్చర్యము! యుద్ధనిహతు లందఱును నిద్రనుండి మేల్కొనువారివలె లేచుచున్నారు.

గాయపడినవారు—మాగాయంబుల బాధయు లేకుండపోయినది! ఆశ్చర్యము!

రుద్రమదేవి—(లోఁపలకు కేడుగ తెరవంకఁ జూచి) వారు మఱల యుద్ధ మారంభింపనున్నారు! అఁగుమనుఁడు! అపుఁడు!

ప్రసాదాదిత్యుఁడు—(తెరవంకఁ జూచి పేరెలుంగున) వీరులారా! యుద్ధపరిసమాప్తి యైనది. ఇంక పోరకుఁడు! పోరకుఁడు!—— (తెరలో కలకలము అఁగును)

మల్లికార్జునుఁడు—మఱల తలఁపడకముందే రణ మాఁపవలసివచ్చినందులకేమో వారు విస్మయమును అసంతృప్తిని చెందుచున్నారు.

రాఘవశర్మ—పాపము! రంభసన్నిధినుండి మఱల హఠాత్తుగ అనుదినసంసారస్థితికి దిగలాగఁబడినవారికి అసంతృప్తిగానుండదా? (అందఱును నవ్వుదురు)

మహాదేవరాజు—(అపవారించి) నీలకంఠా! ఆ బంటు మనవాఁడు. పిలుచున్నాఁడు.

నీలకంఠుఁడు—(అపవారించి) తరువాత రెండు తన్ని బుద్ధి సెప్పెదను.

రుద్రమదేవి—యుద్ధనిహతులను పునర్జీవితులుగఁ జేయఁజాలువారు దివ్యులగు గ్రహపూరుషులే. సందేహము లేదు.

భాస్కరాచారి—ప్రభూ! ఎల్లరకు సందేహము నివారణమైనది. కాని నా సందేహము బలము చెందినది.

రుద్రమదేవి—వివరింపుఁడు.

భాస్కరాచారి—ఖగోళపాలురు ఈ లోకమునకు విచ్చేయుట మానవులయొక్క మహద్భాగ్యమే. ఇఁక నన్నుఁగూర్చి ఖగోళపాలురు, దివ్యజ్ఞాన ప్రదర్శనము చేత, నిట్లు నిరూపించిరి. తొల్లి సృష్టికాలమున బ్రహ్మసభలో గ్రహగోళాధిపులును, ప్రజాపతుల మగు మేమును, భిన్నాభిప్రాయులము కాఁగా, నప్పుడు అర్ధనారీశ్వరుఁడవత

రించి, మా కొక్క పరీక్షావిధానమును గల్పించినట్లును, దానిచే బ్రజాపతులలో నొకఁడ నగు నేను మావాదమును గెలిపించుటకొఱకే భూలోకంబునఁ బుట్టి యింతటి రాద్ధాంతమునకుఁ గారకుఁడనైనట్లును, ద్యోతకంబయ్యె. నేను వచ్చినది వ్యక్తిస్వాతంత్ర్య నిరూపణమునకు. గ్రహపూరుషులు విచ్చేసినది గ్రహ బల ప్రసాదనమునకు. ఇప్పుడు విజయలక్ష్మీకటాక్షము ఏపక్షమువారిపైఁ బ్రసరించినది?

బసవన్న—విజయలక్ష్మి నేఁ డెవ్వరి పక్షమున వర్ధిలుచున్నదో లోకమెఱుంగదా!

సూర్యుఁడు—సృష్ట్యాదినుండియు విలయకాలమునకు నాడఁబడిన యీ మహానాటకమున నేటి యుద్ధ మొక చిన్న రంగము. ఇందు ఎవరు గెల్చినను సమష్టిపై తుదకు మాకే విజయము గలుగును.

భాస్కరాచారి—గ్రహపూరుషులచే మన్నింపఁ బడుదును గాక. మేమే విజయపక్షమున నిప్పటివఱకు నుంటిమి. ఇఁకముందునుగూడ నట్లుందుమని నా వచనము.

సూర్యుఁడు—అట్లయిన మొదటినుండియు వలెనే మన కిరువురకును భేదాభిప్రాయము ఉండి తీరవలెను.

భాస్కరాచారి—అట్లయిన నీ కథావిధానమునకు పర్యవసానముగ నెట్టి ధర్మమును స్థాపింపఁ బడలేదు. మహాపురుషులగు తా మందఱును విచ్చేయుట వ్యర్థ మైనది.

గురుప్ర—(తనలో) ఓహో! రాద్ధాంతము ముదల మూగురచున్నదే. (ప్రకాశముగా) దిగ్విలారా! ఈ వివాదము నింతటితో ముగించుటకు నా కొక సులభోపాయము పొడకట్టుచున్నది.

(రుద్రమదేవి కాక కొదువవా రందఱు)—ఏమది?

గురుప్ర—నేఁటి యుద్ధమున కాకతీయసామ్రాజ్యలక్ష్మికే జయము చేకూరినట్లు మన మందఱమును ఒప్పుకొనఁదగును. ఇఁక పూరుషప్రతిభ స్వతంత్రమైనదా, గ్రహబలాధీనమైనదా అను మహావివాదాంశమునుఁ గూర్చి మూర్తీభవించిన కాత్యాయని యనఁదగి, సర్వధర్మవివేకినియై, ప్రజాపాలన మొనర్చు కాకతీయసామ్రాజ్య లక్ష్మి యభిప్రాయమును చేకొందము.

(రుద్రమదేవి కాక కొదువవా రందఱు)—మేలు. మేలు. తప్పక చేకొందము.

సూర్యుఁడు—మహారాజ్ఞీ! వీరి యుద్దేశ మెఱిఁగితివికదా?

రుద్రమదేవి—ఈ మహావిషయమును నిర్ణయింప నేను సమర్థురాలనా?

సూర్యుఁడు—మహారాజ్ఞి యభిప్రాయ మంగళమును సమ్మతమగుఁగాక!

అందఱు—మేలు. మేలు. తప్పక యగుఁగాక!

రుద్రమదేవి—ఖగోళాధిపులచే ననుజ్ఞాతను. లోకంబున భిన్నవస్తువుల తారతమ్య మెఱుంగఁ గోరునప్పుడు తొలుతవాని నైజతత్త్వంబు నెఱుంగవలెను. ప్రకృతవిషయంబు లగు పురుషప్రయత్నము, గ్రహబలము, అను నీ రెంటి తత్త్వ మేదో విచారించెదము. కావున నిందుండు భవ్యులు, దివ్యులు, నాకొలఁది ప్రశ్నంబులకు ప్రత్యుత్తర మొసంగుదురు గాక!

అందఱు—అట్లే యొనర్తుము.

రుద్రమదేవి—పురుషప్రయత్న మనఁగ పురుషునిచేఁ జేయఁబడు యత్నము కదా. ఇందు పురుషుఁ డనఁగ నెవరో?

(అందఱును ఒకరిమొగము నొకరు చూచుకొనుచు, నాలోచించుచు మాఱు పలుకకుందురు.)

బసవన్న—మహారాజ్ఞీ! దివిజులనే సంశయపఱచఁజేయు నీ ప్రశ్నకు నాకుఁ దోఁచిన సమాధాన మిత్తును. ధర్మసంరక్షణార్థమై కత్తిఁ బట్టి, కదనంబున ధీరుఁడై మెలఁగు పౌరుషశాలియే పురుషుఁడు.

అందఱు—మేలు. మేలు.

శని—అట్టి ఘనకార్య మొనర్చునది పురుషుఁడుమాత్రమేనా? స్త్రీ యేల కాఁగూడదు?

బసవన్న—కావచ్చును. వేయేల? ఇందుకు మా మహారాజ్ఞియే తార్కాణము. అట్టి స్త్రీ వ్యక్తిని పురుషవర్యునిగాఁ గొనియాడఁదగును.

కాకతీయపక్షమువారు—అవునవును. తప్పక గొనియాడఁదగును.

చంద్రుఁడు—అట్లే! ఈసందర్భమున పురుషశబ్దము కేవల స్త్రీపురుషజంతుభేదము సూచించు వాక్యముకాదు; ఘనకార్యకరణదక్షతాద్యోతకమైనది.

సూర్యుఁడు—అవును. ఘనకార్యకరణసమర్థతయే నిజమైన పురుషలక్షణము.

రుద్రమదేవి—ప్రపంచమునందలి అనంతకార్యజాలమునందు గొప్పదానికంటె గొప్పదియు; కొలఁదిదానికంటెఁ గొలఁదిదియు, నుండునప్పుడు ఏది ఘనకార్యమో, ఏదికాదో, నిర్ణయించు టెట్లు?

సూర్యుఁడు—కావున, కేవల కార్యకరణదక్షతయే పురుషలక్షణమని చెప్పవలెను. గురువరా! మహారాజ్ఞికి సమాధానము సెలవిండు.

గురుఁడు—మంచిది.

రుద్రమదేవి—కార్యకరణదక్షత యనఁగా చైతన్య మని చెప్పవచ్చునా?

గురువు—అట్లే చెప్పవలెను. కాని యింకొకరీతిగఁ జెప్పుటకు వీలే లేదు. చైతన్యమే పురుషలక్షణము.

రుద్రమదేవి—అట్టి చైతన్యము వినా భావంబుగ నెవ్వరియం దుండునో!

గురువు—పరమపురుషునందే యుండఁగలదు.

రుద్రమదేవి—పరమపురుషుఁ డెవ్వరు?

గురువు—పరమాత్ముఁడైన పరబ్రహ్మము.

రుద్రమదేవి—అట్టి పరమాత్మునకు పురుషుం డను నామాంతరము లేదా!

గురువు—ఉన్నది.

రుద్రమదేవి—కాన పురుషప్రయత్న మనఁగా నా పరమాత్ముని సంకల్పలేశమే యని చెప్పఁదగునా?

గురువు—చెప్పవచ్చును. కాని ... ... (సందియములో నూరకుండును.)

సూర్యుఁడు—గురువరా! సంశయింతు రేమి?

శుక్రుఁడు—గురువు దివ్యమౌని.

గురువు—సన్నధిక్షేపింతు వేల? యుక్తి తోఁచెనేని మహారాజ్ఞికి నీవే ప్రత్యుత్తర మిమ్ము.

శుక్రుఁడు—అట్లే యిత్తును. మహారాజ్ఞీ! పురుషుఁ డనఁగ పరమాత్ముఁ డనియు, పురుషప్రయత్న మనఁగ దైవసంకల్ప మనియుఁ జెప్పితివి.— కాదు, మాచేతనే చెప్పించితివి. ఇఁకపై దైవేచ్ఛకు గ్రహబలము తగ్గు నని నుడువఁదలఁచితివేమో. అట్లగుచో గ్రహబలముకూడ దైవసంబంధమైనదే యని యేల యూహింపరాదు?

రుద్రమదేవి—గ్రహబల మనఁగా తమ యభిప్రాయ మేమి? గ్రహగోళాధిదేవతలైన మీ మీ స్వతేజోబలములా? లేక తమ పర్యటనంబులందు దేశకాలంబుల లేశమైన స్వేచ్ఛమై నతిక్రమింపఁజాలక యంబరంబునఁ దిరుగాడు నట్టి గ్రహగోళంబుల సత్వమా?

శుక్రుఁడు—రెండు నొకటియె కాదా?

రుద్రమదేవి—రెంటికిని చాల భేద మున్నది. చైతన్యము దైవలక్షణ మని తాము అంగీకరించితిరి. జడత్వము ప్రకృతిగుణ మగునుగదా?

శుక్రుఁడు—అగును. అయిన?

రుద్రమదేవి—చైతన్యముచే వాంఛితకార్యనిర్వహణసమర్థు లగు తమయొక్క స్వీయవర్తనలు దైవసంకల్పాంశము లనఁదగును. స్వవర్తనలలో చైతన్యద్యోతకమగు స్వేచ్ఛాశక్తియే

లేక ఆయావేళలకు ఆయాప్రదేశములఁ దిరుగుచు నాయా ఫలాఫలముల నిచ్చు గ్రహగోళములు ప్రకృతిసంబంధమైన వగునట్లు తోఁచెడిని. ప్రకృతి జడమైన పదార్థమని తా మంగీకరించితిరి.

గురువు—ఓహో! ఆంధ్రవీరలక్ష్మీ! నీ బుద్ధిసూక్ష్మత మెచ్చఁదగినదికదా!

శుక్రుఁడు—అట్లయిన చైతన్యపూరిత మగు పురుషప్రయత్నమే ప్రకృతిగుణక మగు గ్రహబలమున కంటె సత్త్వాధిక మైనదని ఆంధ్రలక్ష్మియొక్క యభిప్రాయమా?

రుద్రమదేవి—ప్రకృతిపూరుషుల బలాబలము లెన్న నెవ్వరితరము? కాని పురుషునకుఁ బ్రకృతి యధీన యని తమవంటి పెద్దలచే వింటిని.

సూర్యుఁడు—అట్లయిన చైతన్యముఁ గల ప్రతివ్యక్తియుఁ బ్రకృతి నధిగమించునదేనా?

రుద్రమదేవి—చీఁకటిఁ దొలఁగింపనిదే వెలుఁగు అనునది యుండదు. అట్లే ప్రకృతి నధిగమింపనిదే చైతన్య మనునది యుండదు. ప్రకృతి నధిగమించుటే చైతన్యలక్షణము. ఇఁక ప్రకృతి సత్త్వముల నధిగమించుటకు వ్యక్తిస్వాతంత్ర్యబలమును యోగాభ్యాసాదులచే సాధించిన ఘనులు సమర్థులగుదురు.

అందఱు—మేలు. మేలు. మహారాజ్ఞి బుద్ధికుశలత మెచ్చఁదగియున్నది.

సూర్యుఁడు—అట్లయిన గ్రహబలము నిరసింపఁబడ వలసినదేనా?

రుద్రమదేవి—నిరసింపఁబడుటేల? పూజింపఁబడవలెను.

శుక్రుఁడు—అదెట్లు! ఎవ్వఁడైన తనకంటెఁ దక్కువవానిని గౌరవించునా?

రుద్రమదేవి—మహాత్మా! ఈకత్తి నాచేతిచేఁ గదలింపఁబడున దయ్యు, నాచేతనే పూజింపఁబడుచున్నది. మఱియుఁ బ్రపంచమునందలి వస్తుతత్త్వముల మూలముల నారయునప్పుడు వానియందు భిన్నోపయోగంబులు కనిపించును గాని, ఎక్కువ తక్కువలు కనిపించునా?

శుక్రుఁడు—అదెట్లు! లోకములో నన్నియు సమానము లగునా?

రుద్రమదేవి—తత్త్వచింతన చేయునప్పుడు అట్లె తలంపవలయును.

శుక్రుఁడు—ఎట్లు?

రుద్రమదేవి—భోక్తయగు పురుషుండును, భోగ్యమగు ప్రకృతియు, నను రెండు పదార్థముల యంశములే కలిసి సకల చరాచర జీవలోకంబుగఁ బరిణమించిన దని తలంచునెడ, వాని గౌరవంబున గొప్పకొలఁదులు పొడకట్టునా? పరస్పర సాహాయ్యమునకే కాక

పరస్పరవిరోధమునకుఁ గారణ మావంతైనఁ గలదా! అట్టి పరస్పరసాహాయ్యము పరస్పరసహనమునఁగాని వర్ధిల్లదు. పరమాణు పరంపరకు పరస్పరసహనమనఁగా విశ్వసంపూర్ణమగు ప్రేమ. సూర్యదేవా! చీఁకటి తొలఁగఁగా భూమిపైనుండు మాకుఁ బావనంబైన భవదీయ మండలంబే కనిపించునట్లు, భ్రమంబు వాసిన మనస్సునకుఁ బ్రపంచమంతటను ఆ ప్రేమ యొక్కటియే కనిపించును. ఆ ప్రేమయే పరిపూర్ణచైతన్యమూర్తి యగు భగవంతునకు లక్షణము. గ్రహపూరుషు లగు తామును గ్రహగోళముల వలెఁ బ్రకృతిస్వభావులు కారు. భగవదంశా సంభూతులగు. కావునఁ బ్రేమస్వభావులు. మానవుల మగు మాయందు అట్టి సంపూర్ణప్రేమ వర్తింపఁజేసి, మాచేఁ బూజల నందఁదగును. జ్యోతిర్విద్య లోకంబునకు అలవడఁజేయఁ దలఁచు భాస్కరాచార్యునకు వలసిన జ్యోతిషగ్రంథంబుల ననుగ్రహింపవలెను. జ్యోతిర్విద్యావ్యాపనమున మే మెల్లరము గ్రహపూరుషులగు మీయెడఁ బూజ్యభావముతో నుందుము.

అందఱు—మేలు! మేలు! ఆంధ్రవీరలక్ష్మీ! బాగుగ వచించితివి.

రుద్రమదేవి—మఱియు దేవగిరి నృపాలురును మాయందలి వైరము మాని మైత్రిమై మెలంగుదురుగాక. సన్నిహితప్రాంతరాజ్యములకు అన్యోన్యద్వేషము ఉభయరాజ్య ప్రజాక్లేశకారణము గదా!

మహాదేవుఁడు—భవ్యా! అసమానంబగు నీ శౌర్యంబును, వివేకంబును, వినయంబును, జూచుటచే నా మది మిగులఁ దనివి సెంది, నీ యెడ నత్యంత గౌరవభావ మూనినది. ఇట్టి నిన్నుఁ గాంచి, నీ జననీజనకు లగు సోమాంబాదేవియు, గణపతిచక్రవర్తియుఁ గృతార్థులైరి. కుమారమల్లికార్జునుఁడు నీకుఁ దగిన వరుఁడు. మన రాజ్యములు రెంటికి నింకపై నత్యంత స్నేహభావము వర్ధిలుఁగాక.

అందఱు—సంతోషము. సంతోషము.

సూర్యుఁడు—ఆంధ్రలక్ష్మీ! యుక్తియుక్తంబు లగు నీ సౌమ్యవాక్యముల సామరస్యమునకు సంతసించితిమి. గ్రహబల పురుషయత్నములఁ గూర్చిన నీ యభిప్రాయ మెల్లరకు సమ్మతముగా నున్నది. పరమపూరుష ప్రేమాంశ పూరితం బగు నీ ప్రపంచతత్త్వము వివరించిన నీ కెంతయుఁ గృతజ్ఞులము. గురువర్యా! ఆంధ్ర సామ్రాజ్యలక్ష్మి యొక్క యభిప్రాయము నొక పద్యరూపమున సెలవింపుఁడు.

గురువు—ఆజ్ఞ.

సీ. పురుషుండు హరి యాట, పురుషయత్నము లన్ని
దైవ సంకల్పాంశ తన్మయములు.

చైతన్యతత్త్వమౌ స్వచ్ఛందమే లేని
గ్రహగతుల్ ప్రకృతి సంకల్పితములు.
ప్రకృతిపూరుషులందుఁ బ్రభువైన పురుషుండు
భోక్తయౌ, ప్రకృతి తా భోగ్య మగును.
గాన యత్నముచేత ఘనుఁడైన పురుషుండు
గ్రహయోగ సమ్మతుల్ గాంచఁ గలఁడు.
గీ. ప్రేమతత్త్వాత్మకముసృష్టి, భేద భంగి
భ్రమముచే గల్గెఁ; గాన నా భ్రమమువీడి
పురుషయత్నంబు గ్రహబలం బరయ నొకటి
కొకటి సాహాయ్య సంసిద్ధి నొనరుఁ గాక!

సూర్యుఁడు—భాస్కరాచార్యా! ఇఁక మన వివాదమునకుఁ గారణము లేదు. మీ రెల్లరు సౌమ్యులు, ఆస్తికులు, కుశ్శంకలఁ జేయనివారు, కావున నీ వింక నీ కాళికా దేవాలంబున నిక్షిప్తంబు లగు జ్యోతిర్గ్రంథంబుల గ్రహించి, యందలి విశేషంబుల వీరల కెఱింగించుటకు మే మంగీకరించితిమి.

భాస్కరాచారి—గ్రహరాజుచే సనుగ్రహింపఁబడితిని. జ్యోతిర్విద్య నెఱుంగుటచే మానవులు గ్రహపూరుషుల నధికభక్తితోఁ బూజింతురు. ఇప్పు డా గ్రంథము లెందుఁ గలవో!

సూర్యుఁడు—ఆ రాతిఫలకంబు క్రింద నున్న బిలమునం దున్నవి. (ప్రసాదాదిత్యునితో) సేనాధీశా! ఇద్దఱు బంట్లచేఁ ఆ రాతిఫలకంబును బెకలింపఁజేయుము.

ప్రసాదాదిత్యుఁడు—అట్లే! (బంట్లచేత నొకబండను దొలఁగింపఁజేయును. ఒక బిలముఖంబు గనిపించును)

భాస్కరాచారి—(బిలములోనికిఁ జూచి) ఓహో! ఎంత పెద్ద బిలము! ఎన్ని గ్రంథములు! ఎన్ని గ్రంథములు! బండ్లపైఁ దోలఁపవలెను. సావకాశంబుగ నింటికిఁ దీసికొనిపోవుదును. కాని ఈ రాతిపైఁగల కట్టుపద్యమునకు సంపూర్ణమగు వివరణముఁ గూడ గ్రహపూరుషులే సెలవిచ్చెదరుగాక.

సూర్యుఁడు—శుక్రాచార్యా! సెలవిమ్ము.

శుక్రుఁడు—ఆజ్ఞ!

"గీ. గ్రంథములను గోరు కన్య ద్విజాంగన
పెండ్లివేళ ... ... ... ...

అను పద్యముయొక్క భావ మిది. వినుము. ఇందు సూచింపఁబడిన ద్విజాంగన గనీ కొమార్తె లీలావతి యయ్యెను. ఆమెకుఁ గూడ నేఁడే వివాహము నిశ్చయించితిరి. కావున

నామె "పెండ్లివేళఁ దనదు ప్రియుని గూడఁ" గలదు. నేఁటియుద్ధంబున మడిసినవారందఱును, మఱల సజీవులైనను, దేవికి బలియైనవారుగనే తలంపఁబడవలయును. కావునఁ బ్రీతికరముగనే సమస్యాపూరింపఁబడినది. (కాళిగుడిలోఁ దీవ్రముగ గంటమ్రోగును) అదిగో! తనంతటఁ దా మ్రోగు జయఘంటయే కాళికాదేవి సమ్మతిని దెలుపుచున్నది.

అందఱు—ఆశ్చర్యము! అద్భుతము!

శుక్రుఁడు—"వేయి మంది కాళికి వేడుక బలి" యైరి. తరువాతఁ జెప్పఁబడిన బ్రహ్మచర్య దీక్షను గూర్చి ఈ పద్యమునఁ గాలమితి చెప్పఁబడి యుండలేదు. కావున నీ కొమార్తె వివాహిత యయ్యును ఒక్క వత్సరంబు దనుక విప్రకన్యాధర్మంబు నను వర్తింపుచుఁ గాళికాదేవికి నిత్యమును పూజలు సల్పుఁగాక! ఇఁక పద్యభావపూర్తికై లీలావతిఁగొన్న వరుని బిలిపింపుఁడు.

భాస్కరాచారి—అతఁడు గ్రామాంతరమున నున్నాఁడు.

మల్లికార్జునుఁడు—యుద్ధారంభమునకుఁ బూర్వమె అతని ... ... ...

రుద్రమదేవి—భాస్కరాచార్యా! అతఁడు లేకున్న మానె. ఈతఁడైన మన లీలావతికిఁ దగినవాఁడేమో చూడుఁడు. (దేవగిరిభటుని దుస్తులతోనుండు రాఘవశర్మను జూపును.)

భాస్కరాచారి—(అవమానముతో) ఈ దేవగిరిభటుఁడా? ఈతని కులగోత్రములేవియో తెలిసికొనకుండ మాకు——

రాఘవశర్మ—మా దేశమున పెండ్లిండ్లకుఁ గులగోత్రములతోఁ బని లేదు.

మహాదేవుఁడు—అది వట్టిమాట. అట్లు చెప్పువాఁడు మా భటుఁడు కాఁడు. మా సైనికుల దుస్తుల నెక్కడనో దొంగిలించి, ధరించినాఁడు. (రాఘవశర్మను బరికించి చూచి) ఓరీ! రాత్రి గుఱ్ఱమునుండి త్రోయఁబడిన బనుగువాఁడవు నీవే కదా?

రాఘవశర్మ—ఎట్లు? బనుగునా? ప్రస్తుతస్థితినిబట్టి మన మిద్దఱ మొక తెగలోనివారమే.

నీలకంఠుఁడను దేవనాయకుఁడు—ఏమీ! మూఢా! కాలవిపర్యాసముచేఁ బరాజయ మొందినను నీప్రభువును నీవే తృణీకరింపరాదని యెఱుంగని నిన్ను గడ్డములాగి రెండు తన్నులు ... (రాఘవుని గడ్డము లాగఁగా నది యూడివచ్చును. అందఱు "రాఘవశర్మ" అని నివ్వెఱపడుదురు. మహారాజ్ఞి కొంచెము నవ్వును. లీలావతి సిగ్గుచే వెనుకకుఁ దగ్గును.)

మల్లికార్జునుఁడు—మిత్రమా! నీవా! నీవా! నిన్నా నేను గుఱ్ఱమునుండి పడఁద్రోసినది? క్షమింపుము. క్షమింపుము. దెబ్బతగులలేదుకద. ఈ గడ్డ మెక్కడ సంపాదించితివి?

రాఘవశర్మ—బారెడేసి తోఁకల గుఱ్ఱములు ఇన్ని గల యుద్ధభూమిలో దొంగగడ్డముల కేమి గొదువ! కాని నాకుఁ తగిలించిన ఈ నైరులదుస్తుల తా మెటనుండి సంగ్రహించితిరి?

మహాదేవుఁడు—భృత్యులారా! వీరుల చెవులకు వెగటుగాఁ దోచునట్టి యీదుస్తుల దొంగ గడ్డముల మార్పు లేమిటి?

మల్లికార్జునుఁడు—మహాశయా! ఈ సందర్భములలోఁ కూటయుద్ధధర్మము నతిక్రమించు వివరము లేవియు లేవని యెఱుంగుఁడు.

గ్రహపూరుషులు—లేవులేవు. అందుకు మా దివ్యచక్షుస్సులే సాక్షులు.

మల్లికార్జునుఁడు—గ్రహపూరుషులకుఁ గృతజ్ఞుఁడను.

ప్రసాదాదిత్యుఁడు—రాఘవశర్మా! ఈ చిత్రకథ యేదో నీ హాస్యశీలమునకుఁ తగినట్లున్నదే.

రుద్రమదేవి—ఇది మిత్రుల లీలా పర్యటనము కాఁబోలును. ప్రసాదాదిత్యా! ఈ చిత్ర కథను తరువాత వివరముగా వినెదము. దేవగిరిప్రభువులు, సేనానాయకులుఁ గొన్నాళ్లు మన యతిథులై యుండుటకును, వారి సైనికులు భద్రంబుగ వారి రాజ్యంబునకు త్వరలోఁ బంపఁబడుటకు, నేర్పాటు గావింపుము.

ప్రసాదాదిత్యుఁడు—భాగ్యము.

బసవన్న—అదిగో! నగరంబునుండి ప్రజలు రాజోద్యోగులు వచ్చుచున్నారు.

(రాజోద్యోగులు, ప్రజలు, ప్రవేశించి మహారాజ్ఞికి నమస్కరింతురు)

ప్రసాదాదిత్యుఁడు—మిత్రులారా! రుద్రదేవీకరుణావిశేషంబున మనకు నేఁడు సంపూర్ణ విజయంబు చేకూరినది.

రాజోద్యోగులు—ఆంధ్రలక్ష్మి యొక్క విజయంబునకు పురమంతయు సంతోషమున పొంగిపోవుచున్నది.

రుద్రమదేవి—కాలయాపన మెందుకు? దండనాథా! ఖగోళాధిపులకు మనవారిని దెల్పుఁడు.

ప్రసాదాదిత్యుఁడు—గోళాధిపులారా! వీరందఱు రాజోద్యోగులు. (రాజోద్యోగులతో) మిత్రులారా! ఈ మహాతేజశ్శాలురు మనల రక్షింప నరుదెంచిన ఖగోళాధిపులు. వీరు దేవగిరి ప్రభువులు.

పౌరులు—(ఆశ్చర్యముతో) ఖగోళాధిపులా! ఎంత యాశ్చర్యకరమగు విషయము!

రుద్రమదేవి—వివరముల సావకాశముగా నెఱుంగవచ్చును. ఖగోళాధిపులకు నమస్కరింపుఁడు.

పౌరులు—అనుగ్రహింపఁబడితిమి. (గ్రహపూరుషులకు నమస్కరింతురు.)

సూర్యుఁడు—మీకు మేలగుఁగాక. మాననీయ యగు మీ మహారాజ్ఞి పరిపాలనము జయప్రదముగ వర్ధిల్లఁగలదు.

పౌరులు—దివ్యుల దీవనలు అమోఘములు.

సూర్యుఁడు—సంతసము. భవ్యులారా! భూలోక పర్యటనము నింక విరమించుటకు మాకు సమయమైనది. గురుచంద్రులారా! మహారాజ్ఞి నభినందింపుఁడు.

చంద్రుఁడు—మహారాజ్ఞీ!

ఉ. ఆపద గల్గువేళ హృదయంబున డిందక ధర్మ విక్రమా
టోపత గార్య వర్తన పటుత్వముఁ బూనుచు వీర పూరుష
ప్రాపక లక్ష్య మాను, పరిపార్థివ జాతపు, వంశ గౌరవ
స్థాపనఁ జేయఁ గల్గితివి, దక్షత నిల్పితి వాంధ్ర తేజముల్.

గురుడు—ఉ. అంతటి వీరవంశజవు నైన తగు నీవు పరాక్రమించుటే
వింతయుగాదు, నీపురము వేసటఁబెట్టిన మము నింత మ
న్నింతు వి దెల్లెడల్ దెలుపు, నీ సుమనోమహనీయ విశ్వవి
శ్రాంతదయాగుణంబు జనశాసనయోగ్యత రాజ్యభాగ్యతల్.

చంద్రుడు—ఉ. మీ విభవంబు కంటె మఱి మీ చతురంగబలంబు కంటె మీ
భూవిజయంబు కంటెఁ పరిపూర్ణధనాదుల కంటె నేతఱిన్
శ్రావక వంశ పూర్వులకుఁ దద్దయు మీ ఋజు మార్గ చర్యతో
భావ సుశాంతిఁ గూర్పఁదగు భంగిఁ జరించితి వమ్మ మాన్యవై.

గురుడు— ఉ. మెచ్చితి మమ్మ! నీదగు నమేయ గుణాఢ్యతకున్ ద్వదీయ వీ
రోచ్ఛ్రయ మైన యాంధ్ర జన యోధుల విక్రమలీల గాంచి; మా
వచ్చిన కార్య మందఱి కవశ్యశుభావహమై యెసంగగా
నిచ్చెద మెల్ల వాంఛల మహేశసతీసదృశాభ! కోరుమా.

రుద్రమదేవి—ధన్యుల మైతిమి. తాము విచ్చేయుటచేతనే యిందెల్లరకోర్కెలు సమకూరినవి. కులదేవతల కర్ఘ్యములు సమర్పించు తరుణమైనది. లీలావతీ! దివ్యులఁ గొనియాడుము.

లీలావతి—(గ్రహపూరుషుల కందఱు నమస్కరింపుచుండగ)

సీ. భువనజీవనదాత రవికి, సర్వాహ్లాద
కర సౌమ్యకిరణాప్తి వఱలు శశికి,
సకలవిజ్ఞాన ప్రసారుఁడౌ గురునకు,
శుభకళా కారుఁడౌ శుక్రునకును
వినయ వాణిజ్య వివేకియౌ బుధునకు,
నాయుఃప్రవర్ధనుఁడైన శనికి,
శౌర్యబలోత్సవౌదార్యుఁడౌ కుజునకు,
రణజయోదాత్తుఁడౌ రాహువునకు,

గీ. నీత వైరాగ్య పరుఁడైన కేతువునకు,
సత్వనిగ్రహ నుపగ్రహ తత్వములకుఁ,
తారకా గణ యుత శింశుమారమునకు,
భవ్యతర ఫలావాప్తికై ప్రణతు లిడుదు.

గ్రహపూరుషులు—శుభమస్తు. శుభమస్తు. శుభమస్తు.

సూర్యుఁడు—రణరంగవిజయంబుచే నలరునట్టి కాకతిసామ్రాజ్యలక్ష్మి యొక్కయు, వినయ వివేక నిధి యగు లీలావతి యొక్కయు వివాహ శుభముహూర్తంబులు సమీపించినవి. గురువరా! దైవకృపచే వర్ధిల్లునట్టి యీ వధూవరులకు గ్రహానుగ్రహంబు కూడఁ గలుగునట్లు దీవింపుఁడు.

గురువు—అనుజ్ఞ. అమ్మా! రుద్రమదేవీ! మల్లికార్జున కుమారా! ఇట్లు జంటగా నిలువుఁడు. లీలావతీ! రాఘవశర్మా! మీ రిట్లు నిలువుఁడు.

సీ. రవి పూర్వరాజేంద్ర రాజ్యపాలన శక్తి,
చంద్రుండు భువనప్రశాంత రక్తి,
కుజుఁడు సుక్షేత్ర భూ విజయైక సంపూర్తి,
రాహువు స్వచ్ఛంద రాజకీర్తి,
గురుఁడు వేదోక్త సద్గుణ కులోన్నత వృద్ధి,
శని పూరుషార్థ సాధన సమృద్ధి,
బుధుఁ డర్థ గణితాంగ బోధ నాధిక యుక్తి,
కేతువు హిత దైవ నీత భక్తి,

గీ. శుక్రుఁ డనుకూల దాంపత్య శుభ నియుక్తి,
వరుస తమతమ శుభదశా వత్సరముల
భవ్యతర యోగకారులై భావితార్థ
హిత ఫలంబుగ మీ కెప్పుఁ డీయఁ గలరు.

చంద్రుడు—మఱియు,

గీ. కాకతీయ సామ్రాజ్యలక్ష్మి, కదన రంగ
భవ్యజయలక్ష్మి, సకలసౌభాగ్యలక్ష్మి,
పెంపుగా నెల్ల జను లఁబాలింపుచుండ
నాంధ్రరాజ్యంబు శుభముల నలరుఁగాక.

అందఱు—తథాస్తు. తథాస్తు.

మల్లికార్జునుఁడు
రుద్రమదేవి } —అనుగ్రహింపఁబడితిమి.

మంగళహారతి.

కేదారగౌళ—ఆట.

శ్రీలోలుకరుద్రాంబా సీమంతినీమణికి । మంగళం । జయమంగళం.

చ. ఎల్లజగముల నేలు । నీశ్వరుకృపతోడ - ముల్లోకములవారు । ముదమందిచెలఁగి
"వల్లె! వల్లె! యిట్టు । చెల్లెఁగాక" యనఁగ - చెల్లని రుద్రాంబ । సాధ్వీమతల్లికి
పల్లవాధరి, భరతపుత్రికి । పావనాంధ్రరమాలలామను, - యుల్లమలరఁ దివలపులలిరం । జిల్లగాధృతిసేలఁజాలిన
మల్లికార్జునతేజ । మానితకీర్తికి । మంగళం । జయమంగళం.

(అనుచు నందఱును మంగళగీతము గానము సేయుచుండఁగా మంగళవాద్యములు
మ్రోఁగుచుండఁగాఁ దెర దిగును.)



# జ్యోతిర్లీల.

ఆంధ్రవీరలక్ష్మీ విజయము

అను

జ్యోతిర్లీల సర్వము సంపూర్ణము.



గీ. ఓర్మి యను సూక్ష్మదర్శిని నొప్పు తప్పు
లేర్చి, సవిమర్శ లెనయంగ, నిందు సాధు
భావ పద గౌరవంబుల భద్రభంగు
లరసి, దిద్దిన భగవంతు నభినుతింతు.



స్త్రీవృత్త లక్షణము—

ఒక్కొక్క పాదమునకు రెండేసి గురువులు.

సార=శక్తిచే, ఉదార=అధికమయిన, స్థైర్యాచార=స్థిరత్వముగల ఆచారముం గలవాఁడా!

నారీవృత్త లక్షణము—

ఒక్కొక్క పాదమునకు మూఁడేసి గురువులు. (అనఁగా మగణము.)

మృగీవృత్త లక్షణము—

ఒక్కొక్క పాదమునకు రగణము.

క్రూరహృత్=దుర్మార్గులను, శీర్యకృత్=భయపడినవారిఁగాఁ జేయుశక్తి, ధీర=సామర్థ్యముగల, సంచారణ=ప్రవర్తనఁ గలవాఁడా!

పఙ్క్తి వృత్త లక్షణము—

భ, గ, గ, గణములు ఒక్కొక్క పాదమునకు.

ఘోర=భయంకరమైన, తమః=అంధకారముచే, దుర్వార=అతిక్రమింపఁబడనట్టిదియు, భరాప్తి స్ఫార=భర=అధిక్యమును, ఆప్తి=పొందుటచే, స్ఫార=ప్రకాశించునట్టిదియు, అగు, మహాతేజః=మంచి తేజస్సుయొక్క, ధారణకార=ధరించుటను చేయువాఁడా.

సీసపద్య లక్షణము—

ఇంద్రగణములు ఆఱు సూర్యగణంబులు రెండు పాద పాదమునకుఁ జరఁగుచుండు; అటమీఁద నైన తేటగీతియు నైనఁ జెప్పవలయు మీఁద సీసములకు.

1వ గణపు మొదటి యక్షరమునకు మూఁడవగణపు మొదటియక్షరము యతి, అయిదవగణపు మొదటి యక్షరమునకు ఏడవగణపు మొదటియక్షరము యతి.

సంశయోత్తారక=సంశయమును పోఁగొట్టువాఁడా! జ్ఞానశక్తిమయ=జ్ఞానశక్తిచే నిండిన (జ్ఞానశక్తి, క్రియాశక్తి, ఇచ్ఛాశక్తి, అనఁబడు శక్తిత్రయము.) ఆత్మక=స్వరూపముగాఁ గలది గనుక నే, ఘన=ఎక్కువయిన, వివేక=పరిశీలనచే, భానువములు=ప్రకాశించునవి.

7 మత్తకోకిల లక్షణము—

ర, స, జ, జ, భ, ర గణములు, 11వ యక్షరము యతి.

తరళ లక్షణము—

న, భ, ర, స, జ, జ, గ. 12వ యక్షరము యతి.

సుప్తము=నిద్రావస్థను పొందినది, నిర్వికారము=మార్పులేనిది, దుర్గమంబు=పొందుటకు శక్యము కానిది, నిజ=తనయొక్క, అంశమయ=తేజస్సుచేత నిండిన, అవకాశము=ఆకాశమే, భవ్య=ఒప్పు

21 [illegible] లక్షణము—

ప్రతి పాదమునకు 8 సూర్యగణములు. గ్రంథములోనిది తురగ వల్గన రగడ.

గణ్యమాన మానమాన గమన సుమన సాధ్వులు—

గణ్యమాన=లెక్కించుటకుదగిన, మాన=(ఆత్మ్మమగు) కొలతచేత, మాన=గౌరవార్హమైన గమన=నడక చేతను, (ఆకాశచలనము), సుమనస=సౌజన్యము చేతను, (వ్యాకరణము—మనస్స్ పదము సు అను ఉపసర్గతో కూడినచో సుమనస అను అకారాంతపద మగునని సంస్కృతవ్యాకరణము.) ఆఢ్యుఁడు=సంపూర్ణుఁడు.

26 తారుణ్యము=యౌవనము.

ఆ + ఆమోద సామోదయంబు—

ఆమోద=సంతోషకరమగు, సామ=మంచిమాటయొక్క, ఉదయము=కలుగుట.

27 కార్యకారణకథల్=ఏద్దాని కది కారణమో అనుట, వివాదము.

28 వ్యత్యస్తకరణము=విపరీత మగు చేష్ట.

31 ఖగోళ మకుటాది విభుఁడు=ఆకాశమున ఉండు గోళములకు రాజు, అమిత భామండితుఁడు—ఎక్కువకాంతి చే వెలయువాఁడు, సంజ్ఞాసతీమనఃసఖునికి=సంజ్ఞ అను పేరుగల భార్యయొక్క మనసమునకు గనియైనవానికి, పుణ్యజనలభ్యమండలునకు—యోగముచే మృతినొందినవారు యుద్ధనిహతులు సూర్యమండలము ద్వారా స్వర్గమున కేగుదురనుట ఆర్యవచనము.

విగత సమస్త కిల్బిష వివిక్త మనంబులన్—

34 విగత=పోయిన, సమస్తకిల్బిష=అఖిలపాపముల, వివిక్త=పవిత్రమైన, మనంబులన్=మనస్సులచేత, శ్రీకర=శుభమును కలిగించు, కర్మయోగ=కర్మయోగము యొక్క, పరసిద్ధి=శ్రేష్ఠమగు సిద్ధియందు, నిబద్ధులు=దీక్షగలవారు.

41 విద్యలు—వ్యా. హృదయవేద్యము — అనుచో—బాలవ్యా., తత్పురుషపరిచ్ఛేదము, 86 వ సూత్రము—విశేష్యము స్త్రీలింగమైనను విశేషణము నపుంసకలింగముగ నుండవచ్చును. కారకపరిచ్ఛేదము, 20 సూత్రము—విశేష్యము బహువచనమైనను విశేషణ మేకవచనముగ నుండవచ్చును.

రవికరప్రభాపరంబు=సూర్యకిరణ [illegible] నివాసము, అన్యదూరంబు=ఇతర కాంతులకు కష్టసాధ్యము.

లోక విషయసార లోకనము—

లోక=లోకమునందైన, విషయ=వస్తువులయొక్క, సార=నిజతత్వమును, లోకనంబు=చూచుట.

42 కుంభలగ్నజాత!=కుంభలగ్నమందు జనించినదానా!

51 యోయం జాతః అను శ్లోకమునకు ప్రతిపదార్థము—

త్రిలోకీప్రథితసుచరితే=మూల్లోకములయందు ప్రసిద్ధమయిన నడతగల, కాకతీయాన్వవాయే=కాకతీయవంశమునందు, దేవదేవః=దేవతలప్రభువును, భగవాన్=భగవంతుడును, స్వయంభూః=స్వయంభువును అను దేవుడు, యస్మై=ఎవ్వరికొఱకు, శ్రేయాంసి=శుభములను, అజస్రం=ఎల్లప్పుడు, వితరతి=ఇచ్చుచున్నాడో, యస్య=ఏ రాజాయొక్క, ఆజ్ఞా=ఉత్తరువు, సర్వపృథ్వీపతి మకుటమణిశ్రేణీశేఖరీవయస్య=సమస్తరాజుల కిరీటములయందలి రత్నసమూహమునకు అలంకర్త్రి అనునో, సః=ఆ, అయం=ఈ, భూపాలమౌళిః=రాజశ్రేష్ఠుడయినట్టియు, గుణమహాన్=గుణములచేత అధికుడైనట్టియు, రుద్రదేవో నరేశః=రుద్రదేవుడను రాజు, జయతి=సర్వోత్కృష్టుడుగానున్నాడు.

యో రుద్రో రజతాచలే అను శ్లోకమునకు అర్థము—

51 యః=ఏ, రుద్రః=ఈశ్వరుడు, పురా=పూర్వమునందు, అర్ధాంగనారీః=సగము శరీరమునందు స్త్రీ గలవాడై, రజతాచలే=కైలాసమందు, స్థితిం=నివాసమును, అగాత్=పొందెనో, సః=ఆ, అయం=ఈ యీశ్వరుడు, సంప్రతి=ఇప్పుడు, సర్వాంగనారీః=అన్ని అవయవములందును స్త్రీత్వము గలిగినవాడై, స్థితః=ఉండును.

యద్విషమావలోకన కళామాత్రేణ—

యత్=ఏకారణమువలన, విషమావలోకన=మూడవనేత్రముయొక్క, కళామాత్రేణ=అంశచేతనే, వైరిపురాణి=శత్రుపట్టణములు, భస్మీకృతాని=భస్మము చేయబడినవి, ఆసన్=అయినవి, స్థానే=అది యుక్తము, యత్=ఏ కారణము వలన, విషమావలోకిన కళామాత్రేణ=ప్రతికూలమైన చూపుయొక్క అంశచేతనే, వైరి పురాణి=శత్రురాజుల యొక్క పట్టణములు, భస్మీకృతాః=భస్మము చేయబడినవి, ఆసన్=అయినవి, అధునా=ఇప్పుడు, చిత్రం=ఆశ్చర్యము, ఖడ్గే=కత్తియందు, విషం=విషము, ధార్యతే=ధరింపబడుచున్నది (అనగా ఈశ్వరుడు అర్ధాంగనారియై కంఠమందు విషము దాల్చెను ఈ రుద్రరాజునకు ఖడ్గమునందు విషము.)

సైవోమా అను శ్లోకమునకు అర్థము.

సైవ=రుద్రమదేవియొక్క తల్లియే, ఉమాచేతి=పార్వతి అని, నిర్దిష్టా=చెప్పబడినదై, సోమాచేతి=సోమాదేవి అని, ప్రథాం=ప్రసిద్ధిని, అగాత్=పొందెను, యస్యాః=దీనియొక్క, మాతా=తల్లి, సాక్షాత్=ప్రత్యక్షముగ, శివా=పార్వతీదేవి, గణపతిః=ప్రమథగణములకు ప్రభువైన గణపతి అను పేరుగల చక్రవర్తి దేవః=ఈశ్వరుడు. పితా=తండ్రి.

52 నభోమణికుల సదమలాలంకార—

నభోమణి కుల=సూర్యవంశమునకు, సదమలాలంకార=యోగ్యమైనటువంటి, కళంకము లేనట్టి అలంకారమైనవాడా.

మిత్ర నృపబద్ధ సమయపాలా—

మిత్రనృపబద్ధ=స్నేహితులైన రాజులతో చేసికొనబడిన, సమయపాల=ఏర్పాటుప్రకారము నడచుకొనువాడా.

ఏకశిలారాజ్య విపుల విభవ భద్ర పదభావ—

ఏకశిలారాజ్య=ఏకశిలా ప్రభుత్వముయొక్క, విపులవిభవ=విస్తారమయిన సంపదయొక్క, భద్రపద భావ=జాగ్రతపఱుచుటయే భావముగాఁ గలవాఁడా.

(పద్మనాయకవీర బిరుదపాఠమునకు అర్థము 3 వ అనుబంధమునందు చూచునది.)

77 శ్రోణిని విపులీకృత లంబ విలోల విశ్రుతిక—

శ్రోణిక=కటిప్రదేశముయొక్క వెనుకభాగమునందు, విపులీకృత=వ్యాపించినవి, లంబ=పొడవైనవి, విలోల=కదలుచున్నవి, (అని) విశ్రుతిక=ప్రఖ్యాతిచే, మలినేతర నైల్య=నలుపులో మాలిన్యము లేనివి (నైగనిగ్యము గలవి.)

79 షట్పదగీతము=తుమ్మెదలగీతము, షట్పద మనెడి సంగీతము.

89 సూచీవ్యూహము=సూదియొక్క ఆకారముగానుండు సైన్యముయొక్క తీర్పు.

94 సోపాన వనములు=సోపానములవలెనుండు పర్వత భాగములపైనుండు వనములు.

99 రామనామ వర్ణ సాధనోత్సాహ పరవజ్ర శోధసాక్షి—

ఈవాక్యముచే సూచింపఁబడిన కథ.

(శ్రీరాముని పట్టాభిషేకసమయమునందు హనుమంతునకు ఒక వజ్రముల హారము బహుమతిగా నొసంగఁబడెను. దాని నాతఁడు ధరింపక ఒక బండతో నా వజ్రములను చిదుకఁ గొట్ట ప్రారంభించెను. ఆతఁ డట్లు చేయుట చూచిన ప్రజలు అతనిని మూర్ఖునిగాఁ దలంచి, శ్రీరామునితో విన్నవింపఁగా, ఆతఁడు హనుమంతుని అభిప్రాయమును అడిగెను. రామనామముయొక్క అక్షరములను హారముయొక్క వజ్రములందు వెదకుచున్నాననియు. అవి యందులేనందున ఆ హారము తనకు సంతోషదాయకము కాదనియు హనుమంతుఁడు బదులుచెప్పెను.)

109 ఉడుకునీరు—క్రిందినుండి కోటగోడకుఁ జేరు శత్రువులకు ఆటంకముగ పైనుండి ఉడుకునీరు కోటను కాపాడువారు జడివానవలె కురిపించుట గలదు.

116 సమీక వివేకం అను సమాసమునకు అర్థము—

సమీకవివేక=యుద్ధమందు అనుభవముగలవారిని, విక్రమోజ్జ్వల-పరాక్రమముచే అధికులను, భయానకప్రకట=భయానకరసము శత్రువులయెడ వెలిబుచ్చువారిని అను వీర=వీరులయొక్క, హృత్=హృదయమునకు, ఉత్సాహ=ఆనందమునకు, కారణ=కారణమైనట్టి, ప్రభాజాల=కాంతిసముదాయముచే, సముజ్జ్వలము లగు=ప్రకాశించుచున్న, శస్త్రసంపదలు=ఆయుధసమూహములు.

117 స్వదేశజన మేదురకీర్తి మహత్వకారులు—

స్వదేశజన=తమదేశజనులయొక్క, మేదురకీర్తి=ప్రశస్తమయిన కీర్తియొక్క, మహత్వ=ఆధిక్యమును, కారులు=చేయువారు, అలసులు=సోమరులు, అన్యజంతువులు=ప్రవేశించుటకు తగ్గని యితరజంతువులు.

120 మానినీవృత్త లక్షణము—

7 భగణములు, 1 గురువు, ప్రతి పాదమునకు. 18 వ యక్షరము యతి.

132 హిమవన్నగేంద్ర జగదున్నత జన్మ తపః ఫలంబ—

హిమవన్నగేంద్ర=హిమవంతునియొక్క, జగదున్నత=జగత్తునందు అధికమైన, జన్మ=పుట్టుకయొక్క, తపః=తపస్సుయొక్క, ఫలంబ=ఫలమా!

అభవమోదకరామల దివ్యదేహా—

అభవ=జన్మలేనివానికి (శివునికి), మోదకర=సంతోషమును గలిగించు, అమలదివ్యదేహా=స్వచ్ఛమయిన ప్రకాశముల దేహము గలదానా!

సముత్సాహన తార్తవార గుణధామ—

సముత్సాహ=మంచి సంతోషముచే, నత=నమస్కరించువారియొక్క, ఆర్తి=బాధలను, వార=పోగొట్టునట్టి, గుణ=సద్గుణములను, ధామ=ఉనికిపట్టుగాఁ గలదానా!

133 నయశాస్త్రోక్త అను పద్యమునకు అర్థము—

నయశాస్త్ర=నీతిశాస్త్రమునందు, ఉక్త=చెప్పఁబడిన, సుధర్మ=మంచిధర్మములయొక్క, పాలన కళా=కాపాడుట అనెడి విద్యయందు, నైపుణ్యా=నేర్పుయొక్క, పారంగత=చివరకు తెలిసినట్టిదియు, అవ్యయ=స్థిరమయినదియు, (అగు) ధీ=బుద్ధిచేత, పేశల=పెంపుచేత, సత్య=యథార్థమైన, కాపట్యములేని, శౌర్యవిభవ=పరాక్రమ వైభవమునకు, వ్యాయామ=అభ్యాసస్థానమయిన, సంగ్రామరంగ=యుద్ధప్రదేశమునందలి, యశః=కీర్తిచేత, వ్యాలిఖిత=వ్రాయఁబడిన, అమల=స్వచ్ఛమయిన అక్షరములు గల, దిశాగంధేభ=దిగ్గజములయొక్క, దంతస్థలి=దంతప్రదేశమునందు, జయ తేజః=జయతేజస్సుచేత, అధిక=ఎక్కువైన, కాకతీయన్నపవంశ=కాకతీయరాజుల వంశమునకు, ప్రాంశరాజత్=మిక్కిలిగా ప్రకాశించుచున్న, మణీ=మణివంటిదానా.

149 వరనర్తకులు=మంచి నాటకసంఘులు,



# 2వ అనుబంధము.

జ్యోతిశ్శాస్త్ర పరిభాషావచనముల వివరము.

జ్యోతిశ్శాస్త్రము.—జ్యోతులు అనఁగా ఆకాశమునఁ బ్రకాశించు మండలములు. వీనిని గూర్చి చెప్పు శాస్త్రము జ్యోతిశ్శాస్త్రము.

గ్రహములు.—సూర్యమండలము నాశ్రయించి పరిచలనము చేయునట్టి కొన్ని ఖగోళములు. ఇవి చాల గలవు. కాని జాతకఫలము నిమిత్తమై మనదేశపు జ్యోతిశ్శాస్త్రజ్ఞులు తొమ్మిది గ్రహములను మాత్రమే యెంచిరి. వాని పేర్లు:—

1 సూర్యుఁడు—(Sun) ఈ మహామండలమును ఆశ్రయించి ఇతర గ్రహగోళము లన్నియు తిరుగుచుండును కావున సూర్యుఁడు గ్రహముకాదు. అయినను జాతకఫలనిర్ణయార్థమై శాస్త్రజ్ఞులు భూమినే గ్రహమండలమధ్యమస్థానముగ నెంచి, సూర్యమండలమును గ్రహగోళములలో నొకటిగా గణించుచువచ్చిరి.

| తక్కిన యెనిమిది గ్రహములు— | ఇంగ్లీషుపేర్లు. |
|---|---|
| 2 చంద్రుఁడు— | Moon. |
| 3 కుజుఁడు— | Mars. |
| 4 గురువు— | Jupetor. |
| 5 శని— | Satnrn. |
| 6 బుధుఁడు— | Mercury. |
| 7 శుక్రుఁడు— | Venus. |

8 రాహువు—
9 కేతువు— } ఈ రెండు గ్రహములకును గోళములు లేవు. సూర్యుని చుట్టును తిరుగునట్టి భూమియొక్క మార్గమును భూప్రదక్షిణ మొనరించునట్టి చంద్రునియొక్క పరిధి తాకునట్టి రెండు చోట్లను రాహుకేతువు లను పేర్లతో శాస్త్రజ్ఞులు వ్యవహరించుచు వచ్చిరి. వీనికే ఇంగ్లీషులో (ascending and discending nodes of the moon) అను పేర్లు గలవు. పై గ్రహమండలము లన్నింటికి ఆయా పేర్లు గల అధిదేవతలు గలరని పౌరాణికప్రసిద్ధి. వారలే ఈ నాటకమున పాత్రలుగా గ్రహింపఁబడిరి.

నక్షత్రములు—
తారలు— } మబ్బులేని రాత్రి ఆకాశమున మెఱయునట్టి ఖగోళములలో కొన్ని పైఁ జెప్పఁబడిన గ్రహములు. అవిగాక తక్కిన వన్నియు నక్షత్రములు లేక తారలు. ఇవి చాల గలవు. కాని మానవులకు సంబంధించిన కాలచక్రముయొక్క గణనకొఱకై జ్యోతిశ్శాస్త్రజ్ఞులు అశ్విన్యాదిగ నిరువదియేడు నక్షత్రములను మాత్రమే యెంచుచువచ్చిరి. ఈ నక్షత్రములలో నొక్కొక్క నక్షత్రమునకు నాలుగు పాదములు అనఁగా భాగములు యేర్పఱిచి, ఈ క్రిందివిధముగ సూర్యుని మార్గమగు కాలచక్రమునువిభజించిరి.

1 కాలచక్రము, దివారాత్రములు, సూర్యుఁడు భూమి చుట్టునుతిరుగునట్లు కనిపించు ఆకాశ భాగము. — మేషము, వృషభము, మిథునము, కర్కాటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము, మీనము అను పండ్రెండు రాసులుగ విభజించిరి.

ఈ పండ్రెండు రాసులును మొత్తముమీఁద నిరువదియేడు నక్షత్రముల క్రింద విభజింపఁబడి యున్నవి. పైని చెప్పినట్లు ఒక్కొక్క నక్షత్రమునకు నాలుగేసి పాదము లయినచో అన్ని నక్షత్రములకును కలసి (4 × 27) 108 పాదములు అగును. అనఁగా పండ్రెండు రాసులలో ఒక్కొక్క దానికి 108/12=9 నక్షత్ర పాదములు వచ్చును. ఈ నక్షత్రపాదములకే నవాంశలని పేరు. ఈ నక్షత్రములను బట్టియే ఆకాశమునందు రాసుల నిర్ణయము చేయఁబడి, ఆయారాసులకు ఆయాగ్రహములు వచ్చినప్పుడు కలుగు ఫలముల మేలుకీడులు చెప్పఁబడుచుండును.

లగ్నము—పైని చెప్పినట్లు సూర్యమార్గమును పండ్రెండు రాసులక్రింద విభజించి, ఆ రాసులలో ఏది ఏసమయమునందు పూర్వదిక్చక్రముపైకి వచ్చుచుండునో (అనఁగా ఉదయించుచుండునో) ఆ సమయమునకు ఆ రాసియే లగ్నమని చెప్పుదురు. భూభ్రమణముయొక్కయు భూచలనముయొక్కయు వేగములవెంట రాసులయొక్క ఉదయాస్తమయములకు మార్పు కలుగుచుండును.

జాతకచక్రము—ఎవరైనను జనించు సమయమునందు ఆకాశమున ఏ గ్రహము ఏ రాసిలో నుండునో సూచించు పటమునకే జాతకము లేక జాతకచక్రము అని పేరు. ఇది చక్రాకృతిగ వ్రాయఁబడునదగును గాని చౌకముగ కొందరు, ఈ నాటకముయొక్క అఱువది మూఁడవ పుటలో నుదహరింపఁబడినట్లు, నాలుగుమూలలుగ తఱుచు లిఖించుచుందురు. ఈ చక్రములో 'ల' అని వ్రాసినచోటే లగ్నము. తక్కిన పొడి అక్షరము లన్నియు గ్రహముల పేర్ల మొదటి అక్షరములు.

శింశుమార చక్రము—గ్రహగోళ నక్షత్రగోళాత్మకం బగు సర్వప్రపంచమును శింశుమార చక్రంబను నామంబుచే వ్యవహరింపఁబడుచున్నది. ఇది భగవత్స్వరూప మని భాగవతాది గ్రంథములలో విపులముగ వర్ణింపఁబడియున్నది.

పరిచలనము—ఒకగోళము మఱియొక ప్రధానగోళము చుట్టును తిరుగుట.

పరిభ్రమణము—గోళములు అన్నియు బొంగరములవలె తమచుట్టును తిరుగుచుండుట.

# 3వ అనుబంధము.

## పద్మనాయక వీర బిరుదములు.

(గోత్రములు 77. ఒక్కొక్క గోత్రమువారికి బిరుదములు విశేషముగ నున్నవి. వాటి కాధిక్యము చేతను వానిలో కొన్నిమాత్రమే యిం దుదహరింపఁబడినవి.)

(1) బిరుదములు. రేచర్లవారివి— అర్థములు.

1 పంచపాద్యేయ దళ విభాళ! = పంచపాద్యేయునియొక్క సేనను భేదించినవాఁడా!
2 కాకతిరాజ్య స్థాపనాచార్య! = కాకతిరాజ్యమును స్థాపించుటలో గురువువంటివాఁడా!
3 చలమర్తిగండ! = చలమర్తి పట్టణమును శాసించినవాఁడా!
4 జల్లిపల్లి వీరక్షేత్ర శోణభారతీకమల! = జల్లిపల్లి యుద్ధరంగమందు భారతీకు లనెడి యోధులలో శ్రేష్ఠుఁడా!
5 సోమకుల పరశురామ! = సోముని వంశమును జయించినవాఁడా!
6 యంబిరుదగండ! = యంబిరుదుఁ గలవానిని జయించినవాఁడా!
సర్వబిరుదకుమార! = సర్వబిరుదులయందును కుమారస్వామివంటివాఁడా!
7 రాయవేశ్యా భుజంగ! = రాయఁ డనువానిని స్వాధీనపఱచుకొన్న వాఁడా!
8 ఆమనగంటి పురవరాధీశ్వర! = ఆమనగల్లు అనెడు పట్టణమునకు ప్రభువా!
9 శత్రురాయ గోవ్యాఘ్ర! = శత్రురాజు లనెడి గోవులకు బెబ్బులివంటివాఁడా!
10 కంచికవాట చూరకార! = కాంచీనగరముయొక్క తలుపులను హరించినవాఁడా!
11 రేచర్లవంశ పయఃపారావార రాకాసుధాకర! = రేచర్లవంశ మనెడి పాలసముద్రమునకు పూర్ణచంద్రుఁడా!

(2) ,, దేవనూళ్ళవారివి—

1 శైలగోపాలవార్థివ! = శైలగోపాలుఁ డనెడి బిరుదుఁ గల రాజా!
2 కోడిబిబ్బనాయకరగండ! = కోడిబిబ్బనాయకుని జయించినవాఁడా!
3 గురిజాలగణపతి శిరకుఠార! = గురిజాలగణపతియనెడి రాజును జయించినవాఁడా!
4 అర్ధనారీ తలాటరామ! = అర్ధనారీముఖములు గల చేతికడియముఁ గలవాఁడా!
5 రాహుత్తవేశ్యాభుజంగ! = రాహుత్తుని స్వాధీనపఱచుకొన్నవాఁడా!
6 దేవనూళ్ళగోత్ర పయఃపారావార సుధాకరా! = దేవనూళ్ళగోత్ర మనెడి పాలసముద్రమునకు పూర్ణచంద్రుఁడా!

(3) రేపాలవారివి—

1 పాతాళగరుడ! = పాతాళరాజు లనెడి పాములకు గరుత్మంతునివంటివాఁడా!
2 మన్మథనాథ! = మన్మథుని జయించినవాఁడ!

3 నిమమోలు పరీక్షేత్రజే భారతీశ మల్లా! = నిమమోలు యుద్ధరంగమునందు వారనేడు లనెడి యోధులలో శ్రేష్ఠుడా!

4 ఉత్తమగండ! = ఉత్తములలో శ్రేష్ఠుడా!

5 తెల్ల తలాటరాయ! = తెల్లని ముఖములుగల మురుగు గలవాడా!

6 రేపాలగోత్ర పయః పారావార సుధాకరా! = రేపాలగోత్ర మనెడి పాలసముద్రమునకు చంద్రుడా!

(4) „ విప్పర్ల వారివి—

1 కరవాల భైరవా! = కత్తులచే భయంకరుడా!

2 దివిచూడ కాప! = దివిచూడు డనెడి రాజును రక్షించినవాడా!

3 గండభేరుండ తలాటరాయ! = గండభేరుండముఖములు గల మురుగు గలవాడా!

4 రాయరాహుత్త వేశ్యాభుజంగ! = రాయరాహుత్తు డనెడి రాజును స్వాధీనము చేసికొన్నవాడా!

5 ఉభయరగండ! = ఇద్దఱు శత్రువులను ఏకసమయములో జయించినవాడా!

6 హొన్నిబ్బరగండ! = ఇద్దఱు వీరులను ఏకకాలమందు జయించినవాడా!

7 హొత్తు మువ్వరగండ! = మువ్వురు వీరులను ఏకకాలములో జయించినవాడా!

8 ధీర సామంత! = ధైర్యముగల సామంతరాజా!

9 బారా మండలీక! = పండ్రెండు సేనలకు అధిపతి యయినవాడా!

10 భాగ్ను కఠారచూరకార! = భాగ్నుని కత్తిని హరించినవాడా!

11 దుష్టగోవుల తలగుంపుగండా = దుష్టులైన రాజులయొక్క శిరములను ఛేదించినవాడా!

12 సమరపుర తలాటరాయా! = సమరపురచిహ్నము గల మురుగు గలవాడా!

13 బుధవర్మ కులాలంకరణ! = బుధవర్మని కులమునకు అలంకార మైనవాడా!

14 చోళరాజ్య స్థాపనాచార్య! = చోళరాజ్యమును స్థాపించినవాడా!

15 విప్పర్లగోత్ర పయః పారావార సుధాకరా! = విప్పర్లగోత్ర మనెడి పాలసముద్రమునకు చంద్రుడా!

(5) „ విరియాలవారివి—

1 పరబలభీమ! = శత్రుసేనలకు భయంకరుడా!

2 దుష్ట రిపు గజాంకుశ! = దుష్టశత్రువు లనెడి యేనుగులకు అంకుశమువంటివాడా!

3 తేరా సామంత! = పదుమువ్గురు సామంతరాజులు గలవాడా!

4 బారా మండలీక చాభ్లా! = పండ్రెండుమంది సేనాధిపతులను కాంతిహీనులుగా జేసినవాడా!

5 కరుణాత్రుమల్లా! —
6 దానవ తలాట రాయా! = రాక్షసముఖములు గల చేతికడియము గలవాడా!
7 విరిదూల గోత్ర పయః పారావార సుధాకరా! = విరిదూలగోత్ర మనెడి పాలసముద్రమునకు చంద్రుడా!

(6) ,, ఆరట్లవారివి—

1 పతిహిత హనుమంత! = ప్రభువునకు హితముచేయుటయందు హనుమంతునివంటి వాడా!
2 భండన భీమ! = యుద్ధరంగమునందు భయంకరుడా!
3 ఏకసంఖ్యానువు రాహుత్తరగండా! = ఏకసంఖ్యాబిరుదు గల రాజును జయించిన వాడా!
4 అర్ధనారీ తలాట రాయా! = అర్ధనారీముఖములు గల చేతికడియము గలవాడా!
5 ఆరట్లగోత్ర పయః పారావార సుధాకరా! = అరట్లగోత్ర మనెడి పాలసముద్రమునకు చంద్రుడా!

(7) ,, అల్లుచెర్లవారివి—

1 సాహస హనుమంత! = సాహసమందు హనుమంతునివంటివాడా!
3 సంగ్రామవిజయ! = యుద్ధమందు అర్జునునివంటివాడా!
3 ముదువకొలను వీరక్షేత్రణీ భారతీక మల్లా! = ముదువక్కొల ననెడి యుద్ధరంగమందు భారతీకు లనెడి యుద్ధభటులలో శ్రేష్ఠుడా!
4 అరిరాయ భూత భైరవా! = శత్రురాజు లనెడి భూతములకు భయంకరుడా!
5 పద్దుకటారి రాయ! = పద్దుకటారి అనెడి బిరుదు గల రాజా!
6 అల్లుచెర్లగోత్ర పయః పారావార సుధాకరా! = అల్లుచెర్లగోత్ర మనెడి పాలసముద్రమునకు చంద్రుడా!

(8) ,, సామంతరావువారివి—

1 సామంతకొమర ఖండేరాయ! = సామంతకొమర వంశమునకు శ్రేష్ఠుడా!
2 వంకిణాకోట దుర విఫాల! = వంకిణాకోటను యుద్ధమునందు పగులగొట్టిన వాడా!
3 విజయరాయని దిశాపట్టా! = విజయరాయని వలన దిగ్విజయపట్టికను పొందిన వాడా!
4 తెలుంగుదేశ రాహుత్త! = తెనుగుదేశమునకు రాజా!

5 ఉభయదళ పితామహా! = ఉభయదళములకు భీష్మునివంటివాఁడా!
6 కోదండసింహా! = విలువిద్యగలవారిలో శ్రేష్ఠుఁడా!
7 ఇనుగాలగోత్ర పయః పారావార సుధాకరా! = ఇనుగాలవంశ మనెడి పాలసముద్రమునకు చంద్రుఁడా!

(12) ,, మట్నూళ్ళవారివి—

1 భండన భయంకరా! = యుద్ధమందు భయంకరుఁడా!
2 తొండన గజ కేసరా! = తొండదేశపు రాజు అనెడి యేనుఁగుకు సింహమువంటివాఁడా!
3 కానిపాంచాల ఏకదళ వీర! = కానిపాంచాలరాజును ఒక్కసేనతో జయించినవాఁడా!
4 ఏరువన భయంకరా! = ఒక్కసైన్యముచేత శత్రువులను భయపెట్టినవాఁడా!
5 నల్ల తలాట నాయకా! = నీలములతో చేయఁబడిన మురుగు గలవాఁడా!
6 చోళరాజ్య స్థాపనాచార్యా! = చోళరాజ్యమును స్థాపించినవాఁడా!
7 మట్నూళ్ళగోత్ర పయః పారావార సుధాకరా! = మట్నూళ్ళగోత్ర మనెడి పాలసముద్రమునకు చంద్రుఁడా!

(13) ,, పాట్నూళ్ళవారివి—

1 పట్టరుమాన వర్ధన! = పట్టరుమానరాజునకు సహాయము జేసినవాఁడా!
2 కల్యాణ నగరాపహార! = కల్యాణపురపు కోటను హరించినవాఁడా!
3 కోసలరాజ్యవిహార! = కోసలరాజ్యములో విహరించినవాఁడా!
4 పర్వగోకర్ణుని దక్షిణభుజాదండ! = పర్వగోకర్ణరాజునకు కుడిభుజమువంటివాఁడా!
5 పాట్నూళ్ళగోత్ర పయః పారావార సుధాకరా! = పాట్నూళ్ళవంశ మనెడి పాలసముద్రమునకు చంద్రుఁడా!

(14) ,, మారుట్లవారివి—

1 మారుట్లసింహా! = మారుట్లగోత్రీయులవారిలో శ్రేష్ఠుఁడా!
2 మల్లవోలి పురవరాధీశ్వరా! = మల్లవోలుపట్టణమునకు రాజా!
3 దుర్భిక్షవైరి మధ్యాహ్న కల్పవృక్షమా! = కఱవనెడి శత్రువునకు మధ్యాహ్న కాలమందైన కల్పవృక్షమువంటివాఁడా!
4 అభిమానదుర్యోధనా! = అభిమానమందు దుర్యోధనునివంటివాఁడా!
5 శరభ తలాట రాయా! = శరభముఖముగల చేతికడియము గలవాఁడా!

6 మారుట్లగోత్ర పయః పారావార సుధాకరా! — మారుట్లవంశ మనెడి పాలసముద్ర
ముసకు చంద్రుడా!

(15) ,, పానేపల్లివారివి—

1 మండలీకరగండహస్తమల్లా! — బలవంతులైన మండలాధిపతులలో శ్రేష్ఠుడా!
2 భుజబలభీమా! = భుజబలమందు భీమునివంటివాడా!
3 మడిమ దిరుగు బిరుదు కుమారనాయకాచార్యమల్లా! — మడిమ దిరుగు బిరుదు గల
కుమారనాయకుని జయించినవాడా!
4 తంటతట్లాట రాయా! = తంటముఖములుగల కడియము గలవాడా!
5 పానేపల్లిగోత్ర పయః పారావార సుధాకరా! — పానేపల్లివంశ మనెడి పాలసముద్రము
నకు చంద్రుడా!

ఇట్లు 77 గోత్రముల పద్మనాయకవీరబిరుదములును, గోత్రవీరుల నామ ములును, పద్మనాయక చరిత్రముసందును, రావువంశ చరిత్రయందును, పూర్తిగా నొసగఁబడినవి.



# 4 వ అనుబంధము.

## సంస్కృత నాటక లక్షణము.

### దృశ్యప్రబంధములు పదివిధములు.

| | | నాయకుఁడు. | రసములు. | కథ. | అంకములు. |
|---|---|---|---|---|---|
| 1 | నాటకము. | ధీరోదాత్తుఁడు. | శృంగారము లేక వీర రసము ప్రధానము. | ఇతిహాసము, పూర్వముజరిగినది. | 5 లేక ఎక్కువ. |
| 2 | ప్రకరణము. | ధీరశాంతుఁడు. | శృంగారము. | కల్పితము. | |
| 3 | భాణము. | ధూర్తవిటుఁడు. | శృంగార వీర రస సూచన. | ,, | 1 అంకము. |
| 4 | ప్రహసనము. | పాషండాదులు. | హాస్యము ప్రధానము. | ,, | ,, |
| 5 | డిమము. | పిశాచ దేవ గంధర్వాదులు 16 గురు నాయకులు. | రౌద్రము ప్రధానము. శృంగార వీర } సూచన | ఇతిహాసము, మాయ, సూర్యచంద్రాగ్ని గ్రహావర్ణన. ఇంద్రజాలము. | 4 అంకములు. |
| 6 | వ్యాయోగము. | ధీరోద్ధతుఁడు. | వీరప్రధానము. | విఖ్యాత చరిత్ర. | |
| 7 | సమవాకారము. | 12 దేవాసురులు. | వీరరసము. | కల్పితము లేక ఇతిహాసము. | 3 అంకములు. |
| 8 | వీథి. | ధీరోద్ధతుఁడు. | శృంగార సూచన. | కల్పితము. | 1 అంకము. |
| 9 | అంకము. | ప్రాకృతజనుఁడు. | కరుణ రసము. | ఇతిహాసము. | 1 అంకము. |
| 10 | ఈహామృగము. | ధీరోదాత్తుఁడు. మర్త్యుఁడు లేక దివ్యుఁడు. | శృంగారము. | మిశ్రము. | 4 అంకములు. |

### నాటక పరిభాషలు.

నాంది—కథాసూచన. 8 లేక 12, 18, 22 పదములలోఁ గాని, వాక్యములలోఁ గాని, చెప్పవలెను. కొందఱు పదనియమము చేయరు.

విష్కంభము—జరిగినకథను జరుగఁబోవుకథను మధ్యమపాత్రలు చెప్పుకొనుట.

చూళిక—తెరలో నుండి మాటలాడుట.

ప్రవేశకము—విష్కంభమువలెనే నీచపాత్రలు చెప్పుకొనుట. ఇది 1వ అంకములో ఉండకూడదు.

అంకావతారము—రాఁబోవుసంకములోని విషయమును ముగియు నంకములో సూచించుట.

పాకములు—ద్రాక్ష, నారికేళ, కదళీ అని మూఁడు విధములు.

అంకము—(దృశ్యములోని భాగము) ప్రత్యక్షమైన నాయకుని చరిత్రముఁ గలది. అనేక రచనలకు రసములకు ఉనికిపట్టు.

శయ్య—పదములయొక్క అన్యోన్య మైత్రి.

### వృత్తులు.

(1) భారతి—కొంచెము మృదువై, అర్థసందర్భము కలది.
(2) సాత్వతి—కొంచెము ప్రౌఢమైనది.
(3) కైశికి—అంతయు సుకుమారమైనది.
(4) ఆరభటి—అంతయు గంభీరమైనది.

### రీతులు.

(1) వైదర్భి—బంధకాఠిన్యము లేనిది. శబ్దకాఠిన్యము లేదు. [illegible] సములు లేనిది.
(2) గౌడి—ఓజోగుణము (దీర్ఘసమాసములు విశేషముగా [illegible]) కాంతిగుణము (ఉద్భటపదత్వము) కలది.
(3) పాంచాలి—పై రెంటియొక్క మిశ్రమము.

### నాయకులు.

(1) ధీరోదాత్తుడు—మహాసత్వుడు, గంభీరుడు, క్షమావంతుడు, అవికత్థనుడు.
(2) ధీరోద్ధతుడు—దర్ప మాత్సర్య భూయిష్ఠుడు, [illegible], వికత్థనుడు, మాయావి, సులభక్రోధుడు.
(3) ధీరలలితుడు—నిశ్చింతుడు, కళాసక్తుడు, సుఖైకభోగుడు.
(4) ధీరశాంతుడు—శాంతుడు, ప్రసన్నాత్ముడు.

### నాటకసంధులు.

ఒక్క ప్రయోజనముతో సంబంధముగల అవాంతరప్రయోజనములు కలియుట నాటకసంధి.

### నాటకసంధులయొక్క వివరములు.

| వరుస సంఖ్య. | నాటకసంధిపేరు. | ఆసంధిలో కలియు ప్రయోజనముల పేర్లు. | ప్రయోజనములయొక్క వివరము. |
|---|---|---|---|
| 1 | ముఖము. | 1 ఆరంభము | = విస్తార ఫలమునకై ఉత్సాహము. |
| | | 2 బీజము | = కొలదియై ఉత్తరోత్తరము విస్తారమైన కార్యమును [illegible]చుట. |
| 2 | ప్రతిముఖము. | 1 ప్రయత్నము | = ఫలప్రాప్తికై తొందరపడుట. |
| | | 2 బిందువు | = అవాంతరవిఘ్నము నివారించుట. |

3 గర్భము.
- 1 ప్రాప్త్యాశ = ఉపాయము అపాయము యొక్క చింత.
- 2 పతాక = చెప్పఁబడఁబోవు కథను అంగముగా చేసికొని కథను వ్యాపింపఁజేయుట.

4 అవమర్శము.
- 1 నియతాప్తి = అపాయాభావమునందే కార్యనిశ్చయము.
- 2 ప్రకరి = అవ్యాపి యగు కార్యమును నిర్వహించుట.

5 ఉపసంహృతి.
- 1 ఫలాగమము = సమగ్రమైన ఫలసంపత్తి.
- 2 కార్యము = ఫలము.

## నాట్యశాలా వర్ణన.

నాట్యశాలలు మూఁడువిధములగు ఆకృతులు గలవి. (1) దీర్ఘ చతురశ్రము. (2) చక్రాకృతి. (3) అండాకృతి. వీనిలో చక్రాకృతిగలవి ప్రస్తుతము పాశ్చాత్య దేశములో నాటక చేయఁబడుచున్నవి. అండాకృతిగలవి పూర్వపు రోమక గ్రీకు దేశములలో నాటకశాలలో నుండెడివి. ఇప్పుడు మన దేశమునందు మొదట చెప్పఁబడిన దీర్ఘ చతురశ్రాకృతిగలవియే నిర్మింపఁబడుచున్నవి.

### విస్తీర్ణము.

నాటకసంఘము యొక్కయు, ప్రేక్షకజనము యొక్కయు ఆవశ్యకమును బట్టి నాట్యశాలల విస్తీర్ణము నిర్ణయింపఁబడవలెను. పూర్వము రోమనుదేశములో అండాకృతిగల నాట్యశాల "కాలసీయమ్" అను పేరుగలది సుమారు లక్షమంది ప్రేక్షకజనము పట్టునంత పెద్దదిగా నుండెడిది. కాని సాధారణముగా నంత పెద్దవి అనుపయోగకరముగను నిర్మించుట కశక్యముగను ఉండును. ఉచ్ఛస్వరమున పలుకు మనుష్యుని వచనము ఎంత దూరము వినిపించునో అంతదూరముకంటె అనఁగ సుమారు నలుబది గజములకంటె పొడవగు నాటకశాల నిర్మింపఁబడుట అనావశ్యకము.

### నాటక శాలలోని భాగములు.

1 ప్రేక్షకస్థలము, 2 రంగము, 3 నేపథ్యము, 4 దీపయానము, 5 పాతాళము అను అయిదుభాగములును చేరి నాటకశాలయగును. నాటకశాలలో 2 భాగములు ప్రేక్షకస్థలము, ఒకభాగము రంగము, ఒకభాగము నేపథ్యముగ నుండునట్లు విభజించునెడ సౌకర్యముగ నుండును.

ప్రేక్షకస్థలము:—ఇది, ప్రదర్శనమును చూడవచ్చు పౌరులు అధివసించుటకును; ఇద్యటనము సల్పుటకును, వీలుగ నుండవలయును.

రంగస్థలము:—ఇది నాటకము ప్రదర్శింపఁబడు స్థలము. ఇది ప్రేక్షకస్థలము నానుకొని దానికంటె ఉన్నతముగ నిర్మింపఁబడవలెను. దీనిపరికరములను గూర్చి తరువాత వివరించెదము.

• నేపథ్యము:—రంగస్థలమునకు వెనుకను ప్రక్కలను గల భాగమును నేపథ్యమందురు. ఇది నటకులు రంగప్రవేశ మొనర్చుటకు ముందు విశ్రమించుటకును, సన్నాహపడుటకును, భూమికాగ్రహణ మొనర్చుటకును ఉపయోగింపఁబడు స్థలము. సామాజికులలో స్త్రీలుకూడ నుండునెడ స్త్రీలకును పురుషులకును ప్రత్యేకముగ భూమికానిర్మాణమునకై యభ్యంతరస్థలములు నేర్పాటుపడదగును. రంగస్థలమునకు చెందిన పరికరముల నన్నిటిని దాచియుంచుటకును, నటకులును నైపథికులును ఇటునటు పోవుచు తిరుగుటకును, తగునంత విశాలముగ నుండవలయును. గావున నేపథ్యము సంకుచితము కాకుండవలెను.

దేవయానము:—రంగస్థలమునకు పైభాగమున నుండు అటకకును, నాటకభవనము యొక్క పైకప్పునకును, నడుమ నుండు ప్రదేశమునకు దేవయాన మని పేరు. ఇది దేవతా భూమికల యానారోహణ అవరోహణ సమయములు నుపయోగింపఁబడును.

పాతాళము:—రంగస్థలమునకు దిగువప్రదేశమున గడిగ నేర్పాటుపఁబడు వివరమునకు పాతాళ మని పేరు. భూప్రవేశాదుల ప్రదర్శించుటకును, పెద్దపెద్ద అద్దముల సహాయమున సంతర్ధానము, యుద్ధము, వర్షము, సముద్రము మొదలైన అద్భుత దృశ్యముల సులభముగ రంగమునందు కనఁబఱచుటకును, పాతాళ మనఁబడు నీ దిగువభాగము చాలఁగ నుపయోగ పడును. వీని వివరముల కొఱకు రంగనిర్మాణమును గూర్చి ఆంగ్లేయ గ్రంథములను పరిశీలించునది.

రంగస్థల పరికరములు:—

(1) యవనికలు.
(2) రజ్జువులు.
(3) ఆదర్శములు.
(4) ఆయుధములు.
(5) దుస్తులు.

యవనికలు.

రంగస్థలమందు రసమును పోషించుటకు సహాయభూతమై రంగమున కడ్డముగ నొకటి తరువాత నొకటిగ కట్టఁబడియుండునవి యవనికలు. వీనిలో నైదుమాత్రము ముఖ్యమైనవి. వాని నీ క్రింద వివరించెదము.

(1) రంగముఖి:—ఇది మొదటి తెర. దీనిపై నుండు చిత్తరువు స్థిరముగాక దేశ కాలానుగుణముగను, ప్రేక్షకరంజకముగను, నాట్యవస్తు సూచకముగను, ఉండునట్లు ఒక్కొక్క నాటకమునకును మార్పఁబడుచుండ వలయును. భక్తిరసప్రధానముగ నుండవలయును. ఇది నాంద్యారంభమున నెత్తఁబడి మరల నాటకాంతము వఱకును దింపఁబడరాదు.

(2) శృంగాటకి:—ఇది రెండవ తెర. దీనిపై హాస్యరసప్రధానముగ పురవీధి చిత్రింపఁబడుట శ్లాఘ్యము. ఈ తెరను ప్రతి ప్రహసనవ్యంగ్యములందును ఎత్తి దింపుచుండవలెను.

(3) మాధ్యమిక:—ఇది మూడవ తెర. దీనిపై చిత్తరువు గృహాభ్యంతర సూచకముగ నుండవలయును. ఇది సామాన్యజన గృహముగ కనఁబడుటకు సాధారణవస్తు రచన చేతను, రాజప్రాసాదముగ గనిపించుటకు రాజోచిత వస్తు రచన చేతను, సమర్థింపఁబడవలెను.

(4) విలాసిక:—ఇది నాల్గవ తెర. దీనిపై చిత్తరువు, శృంగార రస ప్రధాన మగు నుద్యానవనమును, క్రీడామందిరమును, సూచించు చుండవలెను.

(5) వర్ణిక:—ఇది యైదవదియు, కడపటిదియు నగు నల్లని తెర. దీని పైని చిత్తరువుండదు. వస్తురచనచేత నీ తెరముందే యరణ్యము, సముద్రము, మేఘావృతాకాశము, యుద్ధభూమి, కోట, శ్మశానము మొదలగునవి సమర్థింపఁబడవలెను. పాతాళ ప్రదేశమున నుండు [illegible] యుద్ధములు లోనగు దృశ్యము లన్నిటికిని మిగుల సహాయముగ నుండును. ఈ తెర యెప్పుడును ఎత్తఁబడ రాదు.

సాహాయ్యకలు:—పైఁజెప్పఁబడిన అయిదు ముఖ్యమగు తెరలును గాక ధనలోపము లేని సామాజికు లుపయోగించెడి కొదువ తెర లన్నియు సాహాయ్యకలనఁబడును.

పార్శ్వకలు:—పెద్ద తెరలకు రెండు ప్రక్కల నుండి నేపథ్యస్థలమును మఱుఁగుపఱుచు నట్టి ప్రక్క తెరల పేరు పార్శ్వకలు. వీనిపై నుండు చిత్తరువులు ఆయా ముఖ్య యవనికలకు అనుగుణముగ చిత్రింపఁబడవలయును.

ఆచ్ఛాదికలు:—దేవయానము అనఁబడు రంగస్థలోపరిభాగము కనఁబడకుండునట్లు అడ్డముగ పైని వ్రేలఁగట్టఁబడియుండు సన్నని జాలరు తెరల పేరు ఆచ్ఛాదికలు. దీనిపై నుండు చిత్తరువులును జతనుండు ప్రధానయవనికల కనుగుణముగ పై భాగమును సూచించునట్లుండ వలయును.

### రజ్జువులు.

నాటక సహాయ వస్తువులలో రజ్జువు లనఁబడు నీ త్రాళ్లు మిగుల ముఖ్యమైనవి. మన దేశమునందలి సమాజములు వీని యుపయోగమును పూర్తిగఁ బొందుట లేదు. కంటి కగ్గపడు

సంతటి సన్నని పట్టుదారము మొదలు పెద్ద తెరలను ఎత్తి దింపుటకు వాడఁబడు పగ్గము వఱకును పలువిధములగు రంగుల తాళ్ళు వస్తునిర్మాణమునందు స్వభావసిద్ధముగ నృత్యముల చేయుటలో నత్యంతోపయోగకరము లగును.

### ఆ ద ర్శ ము లు.

రంగమందు చూపఁబడు నద్భుతదృశ్యములు అనఁగా దేవతాప్రత్యక్షములు, అంతర్ధానములు, యుద్ధరంగము మొదలగునవి చూపఁబడుటలో అద్దములు గొప్పగ నుపయోగపడు చుండును. రంగస్థలమునందు వర్ణికాయవనికను దగ్గఱగ ప్రేక్షకులకు కనఁబడునట్లు నొక్కటైనను, నేపథ్యమున నా యద్దమున కెదుటి ప్రక్కలయందు దానిలో ప్రతిఫలించునట్లు రెండద్దములను, ఉంచి నేపథ్యమునందలి రెండద్దముల ముందు ఇద్దరు నటకులు అభినయించుచుండినచో ప్రేక్షకులను కనిపించు నద్దమున నలువురు రంగస్థలమునందే యభినయించునట్లు కన్పట్టును. యుద్ధమును సులభముగ గనఁబఱుచుటయందు ఈ తంత్రము అద్భుతముగ నుపయోగకారి యగును ఇట్లే దేవయానమున నొకయద్దమును, పాతాళమున నొక యద్దమును, ఉంచి వాని నుండి బింబములను రంగస్థలమందలి యద్దమున ప్రతిఫలించునట్లు చేయునెడ దేవతారోహణ అవరోహణాదులను యంత్రసహాయము లేకయే సులభముగ కనఁబఱుపవచ్చును.

### ఆ యు ధ ము లు.

కత్తులు, ఈఁటెలు, తుపాకులు మొదలగునవి. నటకులు ప్రదర్శనసమయమునందే కాక అభ్యాసమునఁ గూడ నాయుధోపయోగమును సాధనచేయుచుండిననగాని ప్రదర్శనమునకు స్వాభావికస్థితి కలుగనేరదు.

### దు స్తు లు.

భూమికాధారణయందు ప్రకృతకాలమున ప్రదర్శనములందు దుస్తుల సహాయమునకు ఆవశ్యకమునకంటె నెక్కుడగ ప్రాముఖ్య మొసఁగఁబడుచున్నది. స్వభావసిద్ధికొఱకు భూమికాధారుని నైపుణ్యమే ప్రధానముకాని వెలగల దుస్తులు ముఖ్యములు కావు. ప్రస్తుతము పెక్కు సమాజములలో వాడఁబడు చమికీ దుస్తులు ప్రాచీన భారత వీరుల సూచించు భూమికలకు కేవల మస్వాభావికము లని చెప్పవలెను. పాత్ర కనుగుణమగు దుస్తులకై ఆయా కాలపు చారిత్రను భూమికాధారి బాగుగ గుర్తెఱింగి యుండి, యాకాలపు దుస్తులను నిర్మించుటకు ఘ్రానవలెను. అనఁగా ప్రతినాటకమునకును అందుకు చెందిన దుస్తులను నిర్మింపవలయుఁ గాని యొకేరీతి దుస్తులు కాలభేదముగల వివిధ పాత్రలకుఁ వాడఁబడ రాదు. ఆధునిక మహమ్మదీయ పాశ్చాత్య భూమికలకు తప్ప ప్రాచీన హైందవ భూమికలకు సురవా లనఁబడు కాలి తొడవులను, ఆంగ్లేయపాదుకలను, ఉపయోగింపక మనపూర్వులు ధరించిన యుచిత వస్త్ర

ముల ధరించుటే యోగ్యముగా కనుపట్టెడిని. మఱియు ఋషిభూమికారచనయందు కృత్రిమ శ్మశ్రువులు అనావశ్యకము. స్త్రీభూమికాధారణమునకై స్త్రీలే నియమింపబడునెడ వేషరచన యందు అతిక్రమ మనావశ్యకము. ఆధునికచరిత్రకు చెందిన రో ష నా రా మొదలగు అన్యమత స్త్రీల వేషములకు ఆయాకాలపు స్త్రీల దుస్తుల విచారించునది.

**సా మా జి క వ ర్గ ము.**

నియోజకులు, నైపథికులు, నటకులు అని మూడుతరగతులుగ సామాజికులు విభ జింపబడుదురు.

నియోజకులు:—వీరు నాటకసమాజము యొక్క పరిపాలనాపద్ధతి నిర్వర్తించువారు. వీరిలో నీ క్రిందివారు ముఖ్యులు.

(1) పాలకుడు:—ఇతడు నాటక సమాజమునంతను బరిపాలించి, యుపరి పనుల యందు వారిని నియమించుచేసి, యుచితావేళల కార్యాకార్యములు నిర్వహింపబడుట మొద లగు పనులను పరిశీలించు పైయధికారి. నాటక ప్రదర్శన సమయమునం దితడు ప్రేక్షక స్థలమునం దుండి ప్రేక్షకజనముయొక్క సౌకర్యాదులను, ద్వారమునొద్ద ప్రవేశ పత్రముల యొక్కయు ధనపేటికయొక్కయు పరిశీలనమును, చేయుచుండవలయును. ప్రతిదినమును సమా జము యొక్క ఆదాయవ్యయముల నితడు పరీక్షించుచుండవలెను.

(2) మునస్ధీ:—సమాజమునకు సంబంధించిన లెక్కలన్నిటిని వ్రాయునాతడు. ప్రదర్శన సమయమునందు ద్వారమునొద్ద నుండి ద్వారపాలుర సహాయమున ప్రవేశపత్రముల విక్రయించుచుండవలయు.

(3) ద్వారపాలకులు నలువురు:—ప్రధాన ద్వారమునొద్దను వెనుక మార్గముకడను ప్రదర్శన సమయమునందు కావలియుండి, తదితర సమయములందు వీలువెంట శాలలోపలి ధనాగారమునొద్ద పహరా యిచ్చుచుండ దగినవారు.

(4) పరిచారకులు:—సామాజికనిలయమును పరికరములను శుభ్రపఱచుచుటయం దును, ప్రేక్షకజనుల కావశ్యకము లగు సహాయము నొసగుటయందును నియమింపబడవలెను.

(5) వైద్యుడు:—సామాజికుల కావశ్యకమగు వైద్యసహాయమును, నాటక ప్రకటన కార్యమును నీతని పనులు. ప్రతినాటకమునకు ముందుగ నటకుల నీతడు పరీక్షించి, భూమికా ధారణమునకు తగినవారిని తగనివారిని నిర్ణయింపవలెను. ప్రదర్శన సమయమునం దీతడును ద్వారమునొద్ద నుండి ప్రవేశపత్రముల నిచ్చు మునస్ధీకిని, ప్రేక్షకజనసౌకర్యముం జూచు పాల కునకును సహాయ మొనర్చునది.

(6) నియోజకి:—ప్రేక్షకులలో స్త్రీల సౌకర్యములఁ గనుగొనుచుండుటకై యీ యమ నియమింపఁబడవలెను.

(7) పచకుఁడు (వంటవాఁడు):—సామాజికులకు అనుదిన పచనకార్యము గాక ప్రదర్శన సమయమున ప్రేక్షకుల కావశ్యకములగు ఫలాహారాదుల విక్రయించుటకై యీతఁడు నియమింపఁ బడవలెను. పైఁజెప్పఁబడిన పరిచారకులు ఈతనికి సహాయకముగ నుండవలెను.

నైపథికులు.

నేపథ్యమునం దుండు సామాజికులు నైపథికులు. వీరిలో ముఖ్యుల నీ క్రింద వివరించెదము.

(1) రంగప్రధాని:—రంగనిర్మాణమును భూమికా ప్రవేశాదులను విచారించుచు నేపథ్యమునందుండు ముఖ్యాధికారి. ఈతఁడు ప్రదర్శనసమయమున నాటకశాలను విడువరాదు.

(2) భూమికాచారి:—ఈతఁడు భూమికాచరయందే ముఖ్యముగ నియమింపఁబడి యే నిముసమున కే భూమిక సంసిద్ధముగ నుండవలయునో కనుగొనుచుండవలయును. ప్రదర్శనమున స్వభావసిద్ధికై భూమికాచారి ప్రజల పూర్తిగాఁ దెలిసికొనియుండుటయేకాక రచనా సామగ్రి నిపుణతకై కుట్టుపనిని, ముఖవర్ణరచనను, పూర్తిగ నేర్చియుండవలెను.

(3) అభినయగురువు:—ప్రదర్శకులకు నాటకాభినయమును నేర్పి, ప్రదర్శనసమయమునందు సరిచూచి, లోపములు లేకుండఁ జేయుచుండవలయును. ప్రదర్శనములేని దినములందు నీతఁడీ నటకులకు కవాతు డ్రిల్లు మొదలగునవి సాధకముఁ జేయింపఁదగును.

కవి, చిత్రకారుఁడు:—ఈ రెండుపనులు నొకనిచే నెఱవేర్పఁబడవచ్చును. అవసరమునకై ఆయా భాగములను మార్పుచేయుటయు, స్వాభావికసిద్ధికై తగు యవనికా చిత్రలేఖనములును ఈతని కార్యములు.

పాఠకుఁడు, లేఖకుఁడు:—ఈ రెండుకార్యములు నొకనిచే నెఱవేర్పఁబడవచ్చును. కవికి సహాయముగ నుండి పాఠభాగములను లిఖించుటయు, ప్రదర్శనసమయములందు పాఠభాగములను మఱచినప్రదర్శకులకు స్ఫురణకుఁ దెచ్చుచు సహాయ మొసఁగుటయు నీతని కార్యములు.

యవనికావాహులు:—యవనికలు మొదలగు రంగస్థలపరికరములను రంగప్రధాని యాజ్ఞానుసారముగా సర్దుపాటుఁ జేయు పనివాండ్లు.

మార్దంగికుఁడు:—మద్దెలవాయించువాఁడు. గానము సరిగఁ జొక్కి తాను ప్రకాశించునట్లు గాక గానములో నిమిడియుండునట్లు తన ప్రజ్ఞను చూపవలెను.

శ్రుతికారకుఁడు:—హార్మోనియము మొదలగు వానితో శ్రుతి పట్టువాఁడు. ఈతఁడు నటకులకును శ్రోతలకును మధ్యగా నుండఁగూడదు. నటకులకు వెనుకగాని ప్రక్కనుగాని ఉండి, నటకుల వచనధోరణిని మించకుండునట్లు శ్రుతి పట్టుచుండవలయును.

జంత్రకారుఁడు:—ఫిడేలు మొదలగు జంత్రవాద్యముల వాయించు వాఁడు. వీనిని నటకుల గానములో నిమిడియుండునట్లు వాయింపవలయు. తెర దింపునపుడు మాత్రము విజృంభించి వాయించుచు, తన ప్రజ్ఞ నంతను పూర్తిగ ప్రదర్శింపఁదగును.

న ట కు లు.

సామాజికులలో నటకులు ముఖ్యులైనను వీరు సంఖ్యలందు మిగుల నతిశయించి యుండుట యనావశ్యకము. నైపథికుల యొక్కయు నియోజకుల యొక్కయు సహాయము పూర్తిగ నుండుచో కొలఁదిమంది నటకులు పాత్రసంఖ్యాధిక్యతగల ప్రదర్శనములను సమర్థతతో నిర్వహింపఁగలుగుదురు. స్త్రీభూమికలను స్త్రీలే ధరింపవలె ననుట యుద్దేశముగాఁ గలిగి సామాజికవర్గ విధానముల నిర్వచింతుము. నటకులలో నీ దిగువ చెప్పఁబడునంతమంది ఆవశ్యకమనియు, అంతకంటె నెక్కువ సంఖ్యల నియమించుట యాయా సామాజిక పోషకుల యిచ్ఛాధీన మనియు, తెలియంగునది.

పు రు షు లు.

(1) ప్రధాన పురుష పాత్రము.
(2) సహాయ పురుష పాత్ర.
(3) హాస్యరస ప్రచారి.
(4) విదూషకుఁడు.

ఈనలుగురు నటకులును ఎట్టిప్రదర్శనమునకైనను చాలియుందురు. ప్రధాన పురుష పాత్ర యేకారణముచేతనైన ప్రదర్శనమునకు అసమర్థుఁ డగునప్పుడు సహాయపాత్ర ప్రధాన వేషము ధరించుటకు చాలియుండవలెను.

స్త్రీ లు.

(1) ప్రధాన స్త్రీభూమిక.
(2) సహాయ స్త్రీభూమిక.
(3) బాలభూమిక.
(4) సహాయ నర్తకీ భూమికలు.

స్త్రీసామాజిక లందఱును నృత్త నాట్య సమర్థలై యుండవలెను బాలభూమికధరించు నది ప్రహ్లాదాది బాలపురుషవేషము ధరింపవలె నని యుద్దేశము.

సైనికులు, సేవకులు మొదలగు అప్రధాన పాత్రములను నైపథికులలో ప్రదర్శన సమయమునందు పనిలేనివారు ధరింపవచ్చును. నియోజకులు భూమికా ధారణమునకై పూనుకొనునెడ ప్రేక్షకులకు అననుకూలమును, సామాజికులకు అపఖ్యాతియు, కలుగును.

## 10

### సామాజికుల దినచర్యాక్రమము.

### స్వస్థలమున—పురుషులకు.

ఉదయము ఘం. 5–30 మొదలు 6 వఱకు నేకువ కాలకృత్యములు.

ఘం 6 „ 7–30 „ ప్రార్థన, ఫలాహారము.

„ 7–30 „ 9 „ పాఠసాధన.

„ 9 „ 4 „ ఇతరవృత్తిజీవనముగల సామాజికులు ఈకాలమును వృత్తిసాధనకై వినియోగించునది. వేతనము లంది నాట్యవృత్తినే గల సామాజికులు ఈమధ్య దినకాలమును నాట్యపరికర సామరస్యమునకై వినియోగింపవలెను.

సాయంత్రము ఘం 4 „ 6 వఱకు వ్యాయామము, దేహపరిశ్రమము, ప్రతి సామాజికుడును అనుదినమును అభ్యసించి దృఢకాయము, అంగసౌష్ఠవము గలిగియుండిననే కాని సామాజికధర్మమును పూర్తిగ నెఱవేర్పజాలడు. ఈసమయముననే వారివారికొకసారి

నియోజకులు:—నియోజక ధర్మములను,

సామాజికులు:—పైని ప్రదర్శనాదుల కుపయోగించు కనాతు మొదలగు సాధనమును,

నైపథికులు:—తెరలను ఎత్తిదింపుట, రంగవస్తు పరికరములను త్వరిత కాలంబున మార్పుచేయుట, అగ్నిప్రమాదము మొదలగు అపాయసమయములందు పరికరములను శాలను సంరక్షించుట, మొదలగు అభ్యాసములను చేయవలెను.

స్త్రీసామాజికలు కూడ ఈ పరిశ్రమలయందు పాల్గొనవలెను.

ఘం 6 మొ 8 వఱకు అభినయగురువునొద్ద అభినయాభ్యాసము

వారమునకు రెండుసార్లు అభ్యాసనాటకము. (రిహార్సలు)

నాటక ప్రదర్శన దినమాదును, ఆ మరుసటిదిన మంతను యావన్మంది సామాజికులు విశ్రాంతి గైకొనదగును.

మజిలీలందు:—పైని చెప్పినట్టి అనుదిన కార్యక్రమమునే పాటించుచు, వారమునకు మూడు ప్రదర్శనములకు మించి ప్రయత్నము సేయకుండునది.

మజిలీలందు నూతన పురముల వినోదముల చూచుటకు సామాజికులు (4 మొ 6) సాయంత్రమునే యుపయోగింపవలెను. ఇట్టి పర్యటనములందు పాలకుడు, రంగప్రధాని, అభినయగురువు, నియోజకి ఇట్టివారె యనేకము క్రిందనే యేగవలెను. కాని సామాజికులు ఒక్కరొక్కరుగ వారి యిచ్ఛానుసారముగ వెడలుటకు పాలకుడు అనుజ్ఞ నీయకుండవలెను.

ఇవి సామాజిక వర్గమునకు జెందిన సాధారణ నియమములు. అవశ్యకమగు నెడల 1 పాలకుడు, 2 మునద్దీ, 3 నైవ్యుడు, 4 నియోజకి, 5 రంగప్రధాని, 6 అభినయగురువు, 7 ప్రధాన పురుష భూమికాధారి, 8 ప్రధాన స్త్రీ భూమికాధారి ఒక సంఘముగా నేర్పడి, పాలకుని అగ్రాసనాధిపత్యముక్రింద దేశ కాల పాత్రోచితము లగు మార్పుల నొనర్చుకొనవలెను.

# 5వ అనుబంధము.

## శుద్ధపదపత్రిక.

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 18 | ఫ్వినివృత్తము | తన్వీవృత్తము |
| 3 | 26 | చంద్రవిన్మ | చంద్రవర్త్మ |
| 4 | 27 | పద్మనాళాంతర బిలంబు | పద్మనాళాంతర బిలంబు |
| 9 | 18 | గసనగు | గసనగు |
| 9 | 25 | జలము అను | జలము, పృథ్వి అను |
| 9 | 29 | పస్థలను | పస్థలను |
| 12 | 24 | స్థల | స్థల |
| 14 | 17 | ప్రజానాత | ప్రజామాత |
| 20 | 25 | ప్రథమ | ప్రథమ |
| 21 | 21 | సమకూడ | సమకూడ |
| 24 | 19 | పంచ | పంచ |
| 26 | 27 | ఉభయలు | ఉభయులు |
| 27 | 25 | నిచెదము | నిచ్ఛేదము |
| 29 | 25 | వేవందువా | లేవందువా |
| 31 | 6 | ఆగుదాఁగుసం | అఁగుఁడాఁగుఁసు |
| 49 | 5 | రాఘువవర్మ | రాఘువశర్మ |
| 50 | 18 | మనస్థితి | మనస్స్థితి |
| 51 | 20 | దేవదేవస్వయం | దేవదేవస్స్వయం |
| 51 | 24 | నారీస్థితః | నారిస్స్థితః |
| 63 | 14 | మనోజయంతు | మనోజవంతు |
| 68 | 2 | జోతి | జ్యోతి |
| 78 | 22 | పటపగలు | పట్టపగలు |
| 92 | 2 | అట్ట | అట్ట |
| 93 | 19 | ఉత్థిష్ఠమై | ఉద్ధితమై |
| 111 | 11 | కొండజాలిని | కొండ జాతని |
| ,, | 29 | సారస్య | సారస్య |
| 114 | 12 | నిరాయుదుడు | నిరాయుధుఁడు |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 114 | 13 | గుఱ్ఱము | గుఱ్ఱము |
| 128 | 16 | ఫంచరించు న శైవ్వ | సంచరించు నీ శైవ్వ |
| ,, | 20 | కాంచినాను | కాంచినాఁడను |
| ,, | 26 | మసన్ | మనస్ |
| ,, | 29 | పొదువు | పొసఁగు |
| 124 | 2 | మిత్రులా | మిత్రులారా! |
| 125 | 8 | జో తిర్మం | జ్యోతిర్మం |
| ,, | 16 | సై నుకులను | సైనికులను |
| 127 | 7 | అభిబాదము | అభివాదనము |
| 138 | 5 | ప్రపాదనము | ప్రతిపాదనము |
| ,, | 21 | నామ్రాజ్య | సామ్రాజ్య |
| 139 | 26 | నిర్ణయించు | నిర్ణయించు |
| 140 | 16 | సస్నధి | సన్నధి |
| 143 | 13 | అ స్తికులు | ఆస్తికులు |
| 144 | 23 | దేవనాయకుఁను | దేవగిరినాయకుఁను |
| 146 | 10 | కుము | కుముద్మ |
| 147 | 7 | సామ్రాజ్యలక్ష్మి | సామ్రాజ్యలక్ష్మి |

